# అపరాధ పరిశోధన

రు. 3-50 జులై '78

సప్లిమెంట్



అపరాధ పరిశోధన అనుబంధం—55

# నాలుగు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## ఈ వాసన భరించలేను!

రచన : వసుంధర

## మిత్రుని చంపిన శత్రువు?

రచన : 'సికిందర్'

## ఆమెను చంపాలి!

రచన : టెంపోరావ్

## టాక్సీ స్టాండ్!

రచన : ఎస్. ఎస్. శాస్త్రి

'అంగారక' - మొదటి భాగము

అపరాధ పరిశోధన సప్లిమెంట్—55
జులై, 1978
వెల : రు. 3-50
ఏడాది చందా 45 రూపాయలు
జీవిత చందా 250 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్ :
శ్యామదామోదర్ రెడ్డి

సంపాదక వర్గం :
టెంపోరావ్
శ్యాంబాబు
రమణశ్రీ
ఏ. వీ. మోహన్రావ్
సుజనశ్రీ
వసుంధర
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం :
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ; హైదరాబాదు-29
ఫోన్-36959

ముద్రణ :
క్రాంతి ప్రెస్,
12, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

గద్దె రంగారావు

# ఈ వాసన భరించలేను!

వసుంధర

సినిమా అంత బాగున్నట్లు లేదు. రమ నిరుత్సాహంగా చూస్తోంది. మధ్యమధ్య టైము కూడా చూసుకుంటోంది. హాల్లో జనంకూడా అట్టే వున్నట్లులేదు. రమకు అటూ ఇటూ కూడా పక్కసీట్లు చాలా ఖాళీలున్నాయి.

ఇంటర్వెల్ అయిన అయిదు నిముషాలకు ఎవరిదో చేయి తన భుజంమీద పడినట్లై రమ వులిక్కిపడి పక్కకు చూసింది. తన పక్కన వున్నది తనవంటి ఆడపిల్లకావడం ఆమెకు తృప్తిని కలిగించినా ఆశ్చర్యంమాత్రం ఇంకా తగ్గలేదు. ఆ ముఖం రమకు పరిచయమైనది కాదు.

"సినిమా బోరుగా లేదూ?" అందామె.

"చాలా..." అంది రమ ముక్తసరిగా.

"ఇంకా గంటకు పైగా హాల్లో కూర్చోవాలంటే బెంగగా లేదూ..."

"ఉంది. కానీ ఈ అనుభవం కొత్తకాదు నాకు. ఇలాంటి సినిమాలు చాలా చూశాను."

ఆమె నవ్వి- "నా పేరు కళ్యాణి. ఆర్ట్సు కాలేజీలో బియ్యే చదువుతున్నాను. మీ పేరు..." అనడిగింది.

"నా పేరు రమ. నేను ఇంటర్మీడియేట్ ప్యాసై పైపూ, షార్టూహ్యాండూ నేర్చుకున్నాను. ఉద్యోగ ప్రయత్నంలో వున్నాను..." అంది రమ.

"ఎంతకాలంగా?"

"ఆరునెల్లనించి..."

"నీకు నేను క్షణాలమీద ఉద్యోగం ఇప్పించగలను. సినిమా హాల్లోంచి బయటకు పోదామా?"

"నేను రాను..." అంది రమ.

కళ్యాణి నవ్వి — "అంతగా కావాలనుకుంటే ఈ సినిమా మళ్ళీ రేపు చూడొచ్చు. రఘుపతిగారీరోజు సాయంత్రం ఫారిన్ వెళ్ళిపోతున్నారు. మళ్ళీ రెండు నెలల దాకా రారు. ఆయన నాకు బాగా తెలుసు. ఆయన తల్చుకుంటే నీకు క్షణాలమీద నెలకు ఎనిమిదివందలు దొరికే ఉద్యోగం ఏర్పాటు చేయగలరు. అదృష్టం వదులుకోకు..." అంది.

రమ అనుమానంగా - "నువ్వెవరు?" అంది.

"నేను రఘుపతిగారి కంపెనీలో గుమస్తాని. నెలకు వెయ్యి రూపాయలు జీతం. ఏణ్ణర్ధమయింది ఉద్యోగంలో జేరి. బాధ్యతలు తక్కువ. చాలా హాయిగా వుంటోంది ప్రాణం..."

రమ మెదడులో ఆశ తళుక్కుమంది "ఇప్పుడే వెడితే పని జరుగుతుందంటావా?"

"అని నా నమ్మకం!"

"అయితే పద..." అంది రమ.

# 2

రఘుపతికి నలభై ఏళ్ళుంటాయి. మనిషి చూడ్డానికి హుందాగా చాలా బాగుంటాడు. ఆ అందం డబ్బు తెచ్చినదే కావచ్చు. కానీ డబ్బు అందరికీ అందాన్ని తీసుకు రాలేదు కదా!

రమకు ఆయన డిక్టేషన్ ఇచ్చాడు. తర్వాత ఆమె టైపు చేసి తెచ్చిన కాగితం చూసి - తృప్తిగా తలాడించి "అంతా బాగానే వుంది. నిన్నుద్యోగంలోకి తీసుకోవచ్చు. ఎటొచ్చీ జీతమెంతో ఫిక్స్ చేయాలి..." అన్నాడు.

రమ ఆనందంగా ఆయనవంకే చూస్తోంది.

"ఉద్యోగం ఇవ్వచ్చా అన్న విషయం నీ పార్టు వ్యాందు ప్రతిభనుబట్టి తేల్చేశాను. జీతమెంతివ్వాలన్న విషయం నీ వ్యాందుచూసి తేలుస్తాను..." అంటూ రఘుపతి చటుక్కున రమ చేయి పట్టుకున్నాడు. అప్రతిభురాలైన రమ విదిలించుకోనైనా లేదు. చేయిపట్టుకుని క్షణమాగి రఘుపతి చటుక్కున ఆమెను తన దగ్గరగా లాక్కున్నాడు.

అప్పటికి రమకు జరుగుతున్నది తెలిసి విదిలించుకోబోయింది. కానీ రఘుపతిది ఉక్కు కౌగిలివలె వుంది. రమ పిట్టలా వుంటుంది. కిచకిచలాడడం మినహా మరేమీ చేయలేదామె.

"సినిమా హాలు దగ్గర నిన్ను చూడగానే నా మనసు వశం తప్పింది. కళ్యాణిని పంపి నిన్ను రప్పించుకున్నాను. నీకిస్తానన్న ఉద్యోగం బూటకంకాదు. ఇప్పుడు నువ్వు నాకిచ్చే ఆనందాన్నిబట్టి నీ జీతం వుంటుంది. ఇందువల్ల నీకే నష్టమూ లేదు. జీవితం పూలబాటలా వుంటుంది.

నాకు నువ్వొక త్రివే కాదు. కాబట్టి నీతో ప్రతిరోజూ ఇలాంటి అవసరముండదు. ఎప్పుడో నెలకో రెండు నెలలకో ఇలా కలుసుకుంటాం. కలుసుకున్నప్పుడల్లా బోనస్ వుంటుంది. ఇష్టమైనవాళ్ళనెవర్నైనా పెళ్ళి చేసుకోవచ్చు. తర్వాత మానేయొచ్చు. నీకూ నాకూ శాశ్వతానుబంధమేమీ లేదు కాబట్టి నువ్వు మామూలుగా పెళ్ళి చేసుకోవచ్చు. ఓ.కే" అన్నాడు రఘుపతి.

రమకు నోట మాట రాలేదు. కానీ గింజుకుంటోంది.

"నువ్వలా గింజుకోవడంవల్ల నా ఆవేశం పెరుగుతోంది. ఈ గదిలోంచి బయటపడడం అసాధ్యం. ఆలోచించుకుని మర్యాదగా లొంగిపో."

ఈ పర్యాయం రమ మాట్లాడింది "నీ ఉద్యోగం నాకక్కర్లేదు. నా దారిన నేను పోతాను. నన్ను వదలిపెట్టు..." ఆమె మాటల్లో అభ్యర్థనకంటే తిరస్కారమే ఎక్కువగా గోచరిస్తోంది.

"ఉద్యోగమక్కర్లేదంటే నాకభ్యంతరం లేదు. నిన్ను వదిలిపెట్టడం మాత్రం కల్ల..." అన్నాడు రఘుపతి.

రమ అతన్ని బలంగా వెనక్కునెట్టి తలుపుల దగ్గరకు పరుగెత్తింది. అయితే ఎంత ప్రయత్నించినా ఆమె తలుపులను తెరవలేకపోయింది. ఈలోగా రఘుపతి వచ్చి ఆమెను దొరకబుచ్చుకున్నాడు.

రమ దెబ్బతిన్న ఆడపులిలా విజృంభించింది. ఆయన్ని గోళ్ళతో రక్కింది. పళ్ళతో కరిచింది. ఆయన తనబట్టలు చింపుతుంటే ఆమె అతని వళ్ళంతా గీరేస్తోంది. మధ్య మధ్య బాధతో రఘుపతి ఆమెను వదిలిపెడుతున్నాడు. అప్పుడామె గది నాలుగు మూలలకూ పరుగెత్తి ఏదైనా

ఆయుధం కోసం వెతుకుతోంది.

ఆమెకు ఓ మూలగా వున్న ఇనుపఊచ కనబడింది. చటుక్కున దాన్నందుకుని గిరగిరా తిప్పుకుంటూ రఘుపతి మీదకు విసురుగా వచ్చింది.

ఆత్మరక్షణకోసం ఆయన అటూ ఇటూ' తిరిగినా కొన్ని దెబ్బలు తినక తప్పలేదు. తగిలిన ఒకో దెబ్బా ఆయన కసిని పెంచుతున్నాయి. దెబ్బలబాధ భరించలేక ఆయన తెగించి ముందుకు వెళ్ళి రమ చేతిలోని ఇనుప ఊచను లాక్కోగలిగాడు. తన చేతిలోకి ఆ ఊచ రాగానే ఆయనకు అంతు తెలియని ఆవేశం కలిగి బలంగా దానితో రమ నెత్తిమీద మోదాడు.

రమ కెవ్వున కేక పెట్టి కుప్పలా కూలిపోయింది. ఆమె తల పగిలి రక్తం వరదలై ప్రవహించింది. అంతవరకూ తగిలిన దెబ్బలవల్లనో ఆ రక్తం చూపటం వల్లనో రఘు పతికి కూడా స్పృహ తప్పింది.

# 3

"ఇందాకట్నుంచి చూస్తున్నాను. ఎవర్నువ్వు? ఇక్కడే అలా కూర్చున్నావు. బయటకు పోతావా? లేక లోపల్నుంచి ఎవర్నయినా పిలవమన్నావా?" అంది కళ్యాణి. ఆమె అతన్ని సమీపించబోయింది కానీ అతని దగ్గర్నుంచి వచ్చే వాసన భరించలేక చటుక్కున ముక్కు మూసుకుని వెనకడుగు వేసింది.

అతను చూడ్డానికి యువకుడిలాగే వున్నాడుకానీ చాలా అపరిశుభ్రంగా వున్నాడు. బట్టలు మాసికలతో వుండడమే కాక మాసిపోయినవి కూడా. ఒళ్ళంతా మురికిగా ఉంది. జుట్టు చింపిరిది. గెడ్డం మాసింది.

"నా పేరు జోగినాధం. ఈ ప్రపంచంలోని కుళ్ళుకు

ప్రతినిధిని నేను. చూడ్డానికి శుభ్రంగా కనబడుతున్నా-నీకూ, నీ యజమానికీకూడా బోలెడంత కుళ్ళు వుంది. అలాంటి వాళ్ళదగ్గర దానం పట్టి వాళ్ళ కుళ్ళును తగ్గిస్తూ నా కుళ్ళును పెంచుకుంటూ వుండడం నా జీవనోపాధి. ఓ పది రూపాయలిస్తే నా దారిన నేను పోతాను...'' అన్నాడతను.

కళ్యాణి అతనికి చటుక్కున పదో రూపాయలిచ్చింది. ఆ నోటు అందుకునేందుకు అతను దగ్గరకు రాగా ఆమె భరించలేకపోయింది.

''అడగ్గానే అడిగినంతా ఇచ్చినవాళ్ళ దగ్గర చాలా కుళ్ళుంటుంది. ఇక్కడ నా రేటు పెంచాల్సిందే - నేను మరికొంత సేపిక్కడ ఆగాల్సిందే'' అన్నాడు భోగినాథం నోటు తన పాకెట్లోకి పంపేస్తూ.

''ఏడిసినట్లుంది. వెడతావా వెళ్ళవా?'' అంది కళ్యాణి.

''చూడు. నువ్వెవరో పిల్లని తీసుకొచ్చావ్. ఆ పిల్ల ముఖం అమాయకంగా వుంది. ఆమెనా గదిలోకి పంపావు. అందులో రఘుపతి వుంటాడని నాకు తెలుసు. ఇలా చాలా కాలంగా జరుగుతోంది. ఆ గదిలోంచి ఎందరో ఆడపిల్లలు బయటకు రావడం నాకు తెలుసు. అతికొద్ది మందీ మాత్రమే అందులోంచి నవ్వుతూ బయటకు వచ్చారు. ఎక్కువమందికి ఆ గది ఏడ్పునే మిగిల్చింది. దీన్నిబట్టి నీకేమైనా అర్థమయిందా?'' అన్నాడు భోగినాథం.

కళ్యాణి భయంగా అతనివంక చూసి ''ఎవర్నువ్వు? ఇవన్నీ నీకెలా తెలిశాయి!'' అనడిగింది.

''పిల్లి కళ్ళుమూసుకుని పాలుతాగుతూ ఎవరికళ్లా పడ

లేదనుకుంటుంది. నువ్వూ అంతే. ఇంతకీ నేనడిగిందానికి చెప్పలేదు. ఆ గదిలోంచి చాలా ఎక్కువమంది ఏడుస్తూ బయటకు రావడాన్నిబట్టి నీకేమనిపిస్తోంది.. ''

''ఏమీ అనిపించడంలేదు...''

''లోకంలో నీలాంటి ఆడాళ్ళు చాలా తక్కువమంది ఉన్నారని గ్రహించాలి నువ్వు. నీకు డబ్బు సంతోషాన్నిస్తుంది. డబ్బుకోసం నువ్వేమైనా చేయగలవు. శరీరాన్ని కూడా ఎవరికైనా సమర్పించుకోగలవు. కానీ అలాగని ఇతరులకన్యాయం చేయడం పెద్ద నేరం. నీలాంటి నేరస్థుల్ని నేను క్షమించను...''

''క్షమించక ఏం చేస్తావ్?'' అంది కళ్యాణి వెటకారంగా.

జోగినాథం రెండంగలువేసి కళ్యాణిని సమీపించి ఆమెను గట్టిగా కౌగలించుకున్నాడు. కళ్యాణికిది ఊహించని పరిణామం కావడంవల్ల తెల్లబోయినా - మితిమీరిన జుగుప్సాభావంతో - కెవ్వుమని కేక వేసింది. జోగినాథం ఆమె పెదవులపైన ముద్దుపెట్టుకుని వదిలేశాడు. తర్వాత రెండడుగులు వెనక్కు వేశాడు.

కళ్యాణి కట్టుకున్న తెల్లని చీర మాసిపోయింది. పచ్చటి ఆమె శరీరం మాసిపోయింది. ఆమె వంటికున్న సుగంధ పరిమళం చాలావరకూ హరించుకుపోయింది. ఆమె పెదవుల తీపి హరించుకుపోయింది.

ఏదో భయంకరమైన అనుభూతికి లోనైన దానిలా కళ్యాణి శరీరం కంపించిపోతోంది. పెదవులు వణుకుతున్నాయి. చూపులు భయం భయంగా వున్నాయి.

''శీలమంటే అదే! ఇష్టంలేని పురుషుడిని కలిసిన స్త్రీ ఇప్పుడు నువ్వు పొందిన అనుభూతుల్నే పొందుతుంది.

ఆమె శరీరం ఇదేవిధంగా మలినపడినట్లు భావిస్తుంది. ఆ గదిలో వున్న అమాయకురాలి గతి గుర్తు తెచ్చుకో. నీకూ నాకూ మధ్య ఒక్క క్షణమే. ఆమె అయితే చాలా సేపట్నుంచి వుందక్కడ...”

“రఘుపతికీ నీకూ పోలికేమిటి? త్వరగా పోతావని నీకూ పది రూపాయలూ ఇచ్చేశాను. తక్షణం అవతలికేనా పో — లేదా నా పదీ నాకిచ్చేయ్...” అంది కళ్యాణి.

“తీసుకున్న డబ్బు వెనక్కివ్వడం నా కలవాటులేదు. నువ్వు చేసిన చాలా పాపాల్లోంచి ఓ పదిరూపాయల పాపాలు పొయ్యేయనుకో...” అన్నాడు జోగినాథం.

“వెడతావా వెళ్ళవా?” తీవ్రంగా అడిగింది కళ్యాణి.

“ఇక్కడుండడం నా అభిమతంకాదు. ఎటొచ్చీ ఆ గదితలుపులు తెరుచుకున్నాక వెడతాను. మరోలా అనుకోకు...” అన్నాడు జోగినాథం.

కళ్యాణికి ఏం చేయాలో ఏం మాట్లాడాలో తోచక అలా అతనికేసే చూస్తూ వుండిపోయింది. తలుపులు మాత్రం ఓ పట్టాన తెరుచుకోవడం లేదు. అలా సుమారు రెండుగంటలసేపు ఎదురుచూశాక ఆ గది తలుపులు తెరుచుకున్నాయి.

## 4

“కళ్యాణీ! రమను చంపేశాను...” అన్నాడు రఘుపతి - గది తలుపులు తీసుకుని బయటకు వస్తూ. అక్కడ జోగినాథం వుంటాడని అనుకోనూ లేదు. ఆ మాటలన్నప్పుడాయన జోగనాథాన్ని చూడనైనా లేదు.

ఆయన మాటలు విని కళ్యాణి ముందు ఉలిక్కిపడినా అక్కడ జోగినాథమున్నాడన్న విషయాన్ని రఘుపతికి తెలియజేయడం తన బాధ్యతగా గుర్తించి, కనుసైగతో

ఆ విషయం తెలియజేసింది.

కాస్త పక్కగా వున్న జోగినాథాన్ని ఆయన అప్పుడే చూసి గతుక్కుమన్నాడు. అయితే జోగినాథం వేషం చూడగానే వెంటనే తమాయించుకుని "ఒరేయ్- ఎవర్రా నువ్వు - ఇలారా" అన్నాడు.

జోగినాథం నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ ఆయన ముందుకు వెళ్ళాడు. ఏమీ మాట్లాడకుండా కొంత దూరంలో ఆగి - "ఇంకాస్త ముందుకు రానా - ఇక్కడ ఆగిపోనా?" అన్నాడు.

రఘుపతి చటుక్కున ముక్కుమూసుకుని - "ఆగు!" అన్నాడు. వెంటనే జోగినాథంకూడా ముక్కుమూసుకుని "ఏవాసనైనా భరించగలను నేను. కానీ రక్తం వాసన భరించలేను" అన్నాడు.

రఘుపతి కళ్యాణివంక చూసి "ఈ పిచ్చివాడిక్కడ ఎంతసేపట్నించి వున్నాడు?" అనడిగాడు.

"వాడు పిచ్చాడిలా కనబడ్డంలేదు. చాలా తెలివైన వాడిలా, ప్రమాదకరమైన వాడిలా కనిపిస్తున్నాడు..." అంది కళ్యాణి.

రఘుపతికి కళ్యాణి మాటల్లో నమ్మకం కుదరలేదు— "ఒరేయ్ నువ్వు గోతులు తీయగలవురా?" అనడిగాడు.

"మనిషికి ముందా, వెనకా?" అన్నాడు జోగినాథం.

"అడుగున...గొయ్యి తీశాక సరాసరి మనిషి అందులో కప్పబడి పోవాలి..." అన్నాడు రఘుపతి.

"చేతకాదు..." అన్నాడు జోగినాథం — "మనం ఇంకొకళ్ళకోసం తీసే గొయ్యి మనకోసం ఇంకొకళ్ళ చేత తీయిస్తుందని నాకు తెలుసు..."

"వెధవ కబుర్లు మాని చెప్పిందిచెయ్యి. ఓ రెండ్రోంధ

లిస్తాలే - గొయ్యి తీస్తావా?'' అన్నాడు రఘుపతి.

"నేను డబ్బు తీసుకునేది పాపాలు మాపడానికేగానీ చేయడానికి కాదు. అయినా నువ్వింకా ఆరోగ్యంగానే వున్నావుకదురా - నీకు గొయ్యెందుకు?''

"రా...రా అంటావా నన్ను..." రఘుపతి కోపంగా అన్నాడు.

"అదేమిట్రా - నువ్వు నన్ను రా అంటే నేను కోపగించుకోలేదు. నాపాటి మర్యాద తెలియదురా నీకు'' అన్నాడు జోగినాథం.

"కళ్యాణీ - నువ్వు చెప్పిందే నిజం. వీణ్ణి బ్రతకనివ్వకూడదు..." అన్నాడు రఘుపతి.

"అలా అనేస్తే ఎలాగరా - నువ్వో అమ్మాయిని చంపావు. అందుకు నీకు ఉరిశిక్ష పడాలికదా - అది నావల్లనే జరగాలి కదా..."

రఘుపతికి తను చేసిన హత్య విషయం గుర్తుకొచ్చింది.

అది రఘుపతి ప్రత్యేకంగా కట్టుకున్న ఇల్లు. ఊరికి అయిదారు మైళ్ళ దూరంలోవుంది. సాధారణంగా అక్కడి కెవరూ రారు. అక్కడింకెవరూ వుండరు. తనకున్న స్త్రీ వ్యసనాన్ని రఘుపతి ఈ ఇంట్లో తీర్చుకుంటున్నాడు. రమను అతను చంపినది సౌండ్ ప్రూఫ్ గది.

ఆవేశంలో రమను కొట్టి తనూ పడిపోయాక కాసేపటికి రఘుపతికి మెలకువవచ్చింది. జరిగిందేమిటో గ్రహించి బయటకు వచ్చేసరికి పిచ్చాడిలాంటి మనిషి తారసపడ్డాడు.

"ఎవడ్రా నువ్వు. అలుసిచ్చినకొద్దీ తెగ వాగుతున్నావ్?'' అన్నాడు రఘుపతి కోపంగా.

"ఒరేయ్_అలుసు నువ్వివ్వలేదు. నేను తీసుకున్నాను. నా పేరు జోగినాథం. చాలాకాలంగా నీ విషయం కని

పెడుతున్నాను. నీ దగ్గర్నుంచి బయటపడ్డ ఆడపిల్లల్ని కలుసుకుని మాట్లాడేను. వాళ్ళెవ్వరికీ నీమీద పగతీర్చు కునే ధైర్యంలేదు. అన్నివిధాలా తాము నష్టపోయినా నాకు సహకరించమన్నారు. అయినా నా ప్రయత్నం మానలేదు. నువ్వు సంఘానికి చీడపురుగువి. నిన్ను ఏరేయడం నా అభిమతం."

"వీడికి పిచ్చో వెర్రో తెలియడంలేదు కళ్యాణీ!" అన్నాడు రఘుపతి.

"కళ్యాణీ!" అన్నాడు జోగినాథం- "పిచ్చి నాక్కాదు, ఈ రఘుపతికి. వెర్రి నాక్కాదు, నీకే! తన మాటకంగీకరించని అమ్మాయిని చంపేసిన రఘుపతిది పిచ్చి. అలాంటివాడెప్పుడో అప్పుడు నిన్నూ చంపక పోడని గ్రహించని నీకు వెర్రి. మీ ఇద్దరిమధ్యా నేనుండ దల్చుకోలేదు. ఆ అమ్మాయి పేరు రమ అని తెలిసింది కదా-చూడండి తర్వాత ఏం చేస్తానో!"

జోగినాథం అక్కణ్ణించి కదిలాడు. రఘుపతి చటుక్కున నాలుగంగల్లో జోగినాథాన్ని కలుసుకుని పట్టుకుని-"ఎక్కడికి పోదామనుకున్నావ్ రా-" అన్నాడు.

జోగినాథం బలంగా రఘుపతిని విదిలించుకున్నాడు. రఘుపతి క్రింద పడిపోతూ అతని బలానికి ఆశ్చర్య పడ్డాడు.

"ఒరేయ్ రఘుపతీ! ఖర్చు తక్కువ, ఆదాయ మెక్కువ-అందుకే నీ దగ్గరికి డబ్బు పేరుకుపోతోంది. అలాగే నా దగ్గర బలంకూడా పేరుకుపోతోంది. శారీరక బలంతోపాటు నైతికబలంకూడా ఉంది నా దగర..." అన్నాడు జోగినాథం.

"పదివేలిస్తాను. హత్యసంగతి మర్చిపో," అన్నాడు

రఘుపతి.

"అలా దారికి రా. మర్చిపోడానికి పదివేలుచాలుతుందో చాలదో తెలుసుకుందుకోసారి హత్యా ప్రదేశాన్నీ, హాతు రాలినీ చూడాలి..." అన్నాడు జోగినాథం.

రఘుపతి, కళ్యాణి, జోగినాథం— ముగ్గురు గదిలోప లకు వెళ్ళారు. అక్కడి దృశ్యం భయంకరంగా ఉంది. కళ్యాణి అయితే కెవ్వుమని కేక వేసింది.

"పాతికవేలకు చెక్కు రాసియ్యి. అదికాక ఇంకా రెండు మూడు బిల్సు వస్తాయి-రెండు మూడు రోజుల్లో. అవికూడా నువ్వే ఇచ్చుకోవాల్సి ఉంటుంది. ఎక్కువ సేపు చేరమాడితే ఇక్కడి దృశ్యం శాశ్వతంగా నా మెదడులో నిలిచిపోతుంది. అప్పుడు మరిచిపోవడం కష్టం..." అన్నాడు జోగినాథం.

రఘుపతి మాట్లాడకుండా అక్కడున్న ఓ టేబిల్ సొరుగు లాగి చెక్కు బుక్కు పెన్నూ తీశాడు. జోగి నాథం పేరున పాతికవేలకు చెక్కు రాసిచ్చాడు. అదయ్యేవరకూ అతన్నీ అతని చర్యలను వెయ్యికళ్ళతో కనిపెడుతున్నాడు జోగినాథం.

"ప్రమాదమెలాగూ జరిగిపోయింది. నిన్ను శిక్షించినా పోయిన రమ బ్రతకదు. నా బోటి పుణ్యాత్ముడికివ్వడం వల్ల నీ పాపాలు కొన్ని పోయాయి. ఇకమీద పాపాలు చేయకు..." అన్నాడు జోగినాథం. తర్వాత అతను మెరుపు వేగంతో అక్కణ్నించి వెళ్ళిపోయాడు.

జోగినాథం వెళ్ళగానే రఘుపతి ఎక్కడికో ఫోన్ చేసి ఏమో చెప్పాడు.

# 5

"వెధవ ఏమనుకున్నాడో గానీ మననేం చేయగలడు?" అని నవ్వాడు రఘుపతి.

కళ్యాణి తనూ శృతి కలిపింది.

"అక్కడున్న ఆ ఇల్లు మన పేరున లేదు. అది నాదని చాలామందికి తెలియదు. అక్కడ హత్య తాలూకు ఆన మాలుకూడా లేదు. ఈ వేళ ఎవరైనా చెక్కు మార్చుకునేందుకు బ్యాంకుకు వస్తే ఆపి వుంచమని చెప్పాను. ఆ విషయంలో పోలీస్ రిపోర్టుకూడా ఇచ్చాను - ఓ దొంగ వెధవ నన్ను బెదిరించి బలవంతంగా చెక్కు రాయించి తీసుకున్నాడని! ఇప్పుడు వాడేం చేస్తాడు?"

కళ్యాణి చిన్నగా నవ్వి - అసలు సంగతి మీ రాలోచించడం లేదు. అసలా రమ ఎవరో తెలియలేదా ముందు" అంది.

"అది నిజమే! అదెవత్తో అనామకురాలయియుంటుంది. దాని ఆచూకీ తెలుసుకోడానికే సాధ్యంకాకపోవచ్చు ఈ నగరంలో. అయినా ఆ వెధవ ఇంకేమీ చేయడని నా ఉద్దేశ్యం. పాతిక వేలకు చెక్కు చూస్తే కళ్ళు చెదిరిపోయాయి వాడికి. ఏదో ఓ రోజున ఆ చెక్కు తీసుకుని బ్యాంకుకు వెడతాడు. పోలీసులకు దొరికిపోతాడు." గర్వంగా నవ్వాడు రఘుపతి.

అంతలో బల్లమీద టెలిఫోన్ మ్రోగింది. రిసీవర్ ఎత్తి - "హలో!" అన్నాడు రఘుపతి.

"నేనండి - వార్తాజ్యోతి పత్రిక ఆఫీసునుంచి మాట్లాడుతున్నాను. తమరు నిన్నరాత్రి ఇచ్చిన ప్రకటన పేపర్లో వేశామండి. బిల్లు మీ పేరున వ్రాయాలా, మీ కంపెనీ పేరున వ్రాయాలా అని అనుమానం వచ్చి మా నేజరుగారు మీకు ఫోన్ చేయమన్నారు."

"ఏం ప్రకటన అది - కంపెనీకి సంబంధించిందా... లేక..."

"కంపెనీకి సంబంధించిందవునో కాదో తెలియదండి..."

"అయితే పేపరు చూసి చెబుతాను. మళ్ళీ ఫోన్ చేస్తాను..." అన్నాడు రఘుపతి.

"ఎందుకులెండి- ఓ అరగంట పోయాక నేనే మళ్ళీ ఫోన్ చేస్తానండి..."

రఘుపతి ఫోన్ పెట్టేసి, "వార్తాజ్యోతి వచ్చిందా?" అన్నాడు.

కళ్యాణి ఆ గదిలోంచి బయటకు వెళ్ళి ఓ అయిదు నిముషాల్లో తిరిగివచ్చింది. ఆమె చేతిలో వార్తాజ్యోతి దినపత్రిక ఉంది.

రఘుపతి ఆత్రుతగా పేపరు అందుకుని త్వరగా తిరగేశాడు. ఆయనక్కావలసిన సమాచారం రెండో పేజీలో దొరికింది. అది చదివి ఉలిక్కిపడ్డాడాయన- "కళ్యాణీ! ఇది చదువు..."

కళ్యాణికూడా అది చదివి ఉలిక్కిపడింది.

అందులో రమ అనే అమ్మాయి గురించిన వర్ణనఉంది. ఆ అమ్మాయి తప్పిపోయిన పక్షంలో రఘుపతి వారికి సాయపడగలడని వుంది. రఘుపతి చిరునామా ఉంది.

"ఇది జోగినాథం పనే!" అంది అప్రయత్నంగా కళ్యాణి.

"కానీ- వెధవ- ఇంతపని చేస్తాడని అనుకోలేదు..." అన్నాడు రఘుపతి. ఆయన ముఖంలో కోపం, విసుగుతో పాటు భయంకూడా కనబడింది.

"ఈ పర్యాయం వ్యవహారమంతా ఇలాగే వుంది..." అంది కళ్యాణి.

"అవును. ప్రతిఘటన ఎరుగని నన్ను రమ ప్రతిఘటిం

చింది. ఎన్నడూ లేనిది నేను హత్య చేయాల్సి వచ్చింది. ఓ పిచ్చివెధవ నన్ను వీధిలో పెట్టడానికి ప్రయత్నిస్తున్నాడు...'' అన్నాడు రఘుపతి బాధగా.

కళ్యాణికీ భయంగానే వుంది. ఆయన పాపాల్లో ఆమెకూ చాలా భాగం వుంది. ఏదో ఓ రోజున పాపం పండుతుందంటారు. కొంపదీసి తమకూ అలాగే పాపం పండలేదు గదా!

# 6

''నా పేరు చొక్కారావు. రమ నా చెల్లెలు...'' అన్నాడతను.

''అయితే...'' అన్నాడు రఘుపతి.

''నిన్న మధ్యాహ్నం సినిమాకని వెళ్ళిన రమ మాయమయింది. ఏమయిందో తెలియక హడలి చస్తున్నాం. ఈ రోజు ఉదయం పేపర్లో మీరు చేసిన ప్రకటన చూశాక కొండంత ధైర్యం వచ్చింది. ఉరకలు పరుగులమీద ఇక్కడకు వచ్చాను...'' అన్నాడు చొక్కారావు.

''రమ ఫోటో వుందా మీ దగ్గర?''

చొక్కారావు వెంటనే జేబులోంచి ఫోటో తీసి ఇచ్చాడు. రఘుపతి దాన్నందుకుని చూసి తడబడ్డాడు. అద్భుత సౌందర్యంతో విరాజిల్లుతున్న ఆ అప్సరసను నిన్నటి సాయంత్రం ఒక్కపర్యాయమైనా అనుభవించకుండా చేజేతులా చంపాడు తను. రఘుపతికి మళ్ళీ మరొక్కసారి బాధ, భయం కలిగాయి.

''చెప్పండి_ రమకేమయింది?'' అన్నాడు చొక్కారావు.

''మీ ఇంట్లో ఎంతమంది వున్నారు?''

"నేను, నా భార్య, రమ..."

"రమ తలిదండ్రు లెక్కడున్నారు?"

"రమకు నేను, నాకు రమా తప్ప ఇంకెవ్వరూ లేరు. మా తలిదండ్రులు చనిపోయి చాలాకాలమైంది..." అన్నాడు చొక్కా రావు.

"ఏం చేస్తున్నారు మీరు?"

"ఓ కంపెనీలో గుమస్తా ఉద్యోగం. రమకు పెళ్ళి చేయాల్సిన బాధ్యత నామీద వుంది. దాన్ని ఉద్యోగంలో జేర్పించి_ ఆ డబ్బును వేరే వేసి ఓ రెండేళ్ళలో పెళ్ళి చేయాలనుకుంటున్నాను."

"ఏం చదివారు మీరు?"

"బియ్యే పాసయ్యాను..."

"మిస్టర్ చొక్కా రావ్!" గంభీరంగా అన్నాడు రఘుపతి_ "రమను గురించి నాకేమీ తెలియదంటే నమ్ముతారా?"

చొక్కా రావు దెబ్బతిని, "మరి... వార్తాజ్యోతి ప్రకటన..." అన్నాడు.

"నేను డబ్బుగలవాణ్ణి. నగరంలో పరపతి గలవాణ్ణి. నన్నల్లరిపెట్టాలనీ, నా పరువు గంగపాలు చేయాలనీ అనుకునే కిట్టని వాళ్ళు చాలామంది వున్నారు. అలాంటి వాళ్ళలో ఎవ్వరో రమను మాయంచేసి ఈ విధంగా ప్రకటన చేశారు. అది నా దురదృష్టం. మీరు నాతో సాయంచేస్తే మీకు నేనో సాయం చేయగలను..."

"చెప్పండి..." అన్నాడు చొక్కా రావు.

"మీకు నా కంపెనీలో ఆఫీసరుద్యోగం ఇప్పిస్తాను. పదివేల రూపాయల క్యాషు ఇస్తాను. మీరు రమను గురించి మరచిపోవాలి. ఎవరైనా ఆమె గురించి అడిగితే

ఊళ్ళు చూడ్డానికి వెళ్ళిందని చెప్పాలి..'' అన్నాడు రఘుపతి.

చొక్కారావు తటపటాయించాడు.

''ఎప్పుడైనా రమ తిరిగివస్తే ఆమెక్కూడా మంచి ఉద్యోగం ఇప్పిస్తాను. తగిన వరుణ్ణి మీరెన్నిక చేస్తే నా ఖర్చులతో ఆ పెళ్ళి జరిపిస్తాను. కానీ ఈ విషయంలో ఏమీ తెలియని నన్ను మరి మీరు బాధించకూడదు...''

చొక్కారావు కాసేపు ఆలోచించి-''ఈ పరిస్థితుల్లో మీరు కానీ నేను కానీ అంతకంటే చేయగలిగిన దేముంది?'' అన్నాడు.

''రమ ఆచూకీ తెలుసుకునేందుకు నేనుకూడా ప్రయత్నిస్తాను. ఈ ఫోటో నాదగ్గర వదిలి వెళ్ళండి. రేపు మీ పేపర్సుతో నన్ను కలుసుకుంటే ఉద్యోగం విషయం ఫైనలైజవుతుంది. ఇప్పుడీ పదివేలూ తీసుకు వెళ్ళండి...'' అన్నాడు రఘుపతి.

చొక్కారావు డబ్బు అందుకుని లెక్కపెట్టుకుని లేచాడు.

''మిస్టర్ చొక్కారావ్! నా పరువు నిలబెట్టుకోవడం కోసం మీకుపకారం చేస్తున్నాను. మీ కారణంగా అది నిలబడకపోతే నేను అపకారంకూడా చేయగలను. నా మనుషులు నిన్నూ నీ నిజాయితీని కఠినంగా పరీక్షిస్తారు. ఆ పరీక్షకు తట్టుకుని నిలబడ్డాక నే ఉద్యోగపు ఆర్డరు నీ చేతికొస్తుంది...'' అన్నాడు రఘుపతి.

# 7

''ఏమండోయ్- కాస్త ఆగండి!'' అన్న కేకవిని చొక్కారావు చిరాగ్గా ఆగాడు.

అతనికి తొందరగా ఇంటికి వెళ్ళాలని వుంది. చెల్లెలు

కనబడ్డంలేదన్న విచారం కంటె అయాచితంగా పదివేలు వచ్చిన సంతోషం ఎక్కువగా వుందతనికి. అంతేకాక ఆఫీసరుద్యోగం దొరకబోతోంది! ఇవన్నీ భార్యకు చెప్పాలని అతను ఆత్రుతపడుతున్నాడు. ఇప్పుడిలా పిలిచిన వ్యక్తికూడా ఎరిగున్నవాడిలా లేడు. ఆకారానికి పిచ్చివాడి లాగున్నాడు.

అతను పరుగెత్తుకుంటూ వచ్చి– "నా పేరు జోగినాథం! మీరు రఘుపతిగారింటికి వెళ్ళడం చూశాను. బహుశా మీరు రమ అన్న అయుండాలి. మీ పేరు తెలుసుకోవచ్చా?" అన్నాడు.

"చొక్కారావు..." అన్నాడతను.

"సరే– చొక్కారావుగారూ– మీకు మీ చెల్లెలి వివరాలు తెలిశాయా? రఘుపతి ఏం చెప్పాడు మీకు?" అన్నాడు.

"నా చెల్లెలి గురించి ఆయనేం చెబుతాడు?" అన్నాడు చొక్కారావు.

"ఏదో చెబుతాడని కాకపోతే ఎందుకు వెళ్ళడం?" అన్నాడు జోగినాథం.

"నా చెల్లెలు ఊళ్ళు తిరుగుతోంది. అది మాయం కావడమేమిటని కంగారుపడి వివరాలు తెలుసుకుందుకు వెళ్ళాను. తీరా చూస్తే పేపర్లో ప్రకటన ఆయన చేసింది కాదుట–ఎవరో కిట్టనివాళ్ళు చేశారుట..."

"అలాగని ఆయన చెబితే నమ్మేసి వెనక్కొచ్చేశారా? బాగానే వుంది..." అన్నాడు జోగినాథం– "మీ చెల్లెలు ఊరికెప్పుడెళ్ళింది?"

"చాలా రోజులయ్యింది!"

"మీరు నిజం చెబుతున్నారో అబద్ధం చెబుతున్నారో

తెలియదు కానీ- మీ చెల్లెలు రమ నిన్న ఈ ఊళ్ళోనే ఉంది..."

"మీ రెవరో నాకు తెలియదు. మీరు చెప్పేది నా కర్థంకావడంలేదు. నాకు అవతల పనులున్నాయ్. వస్తాను..." అంటూ కదిలాడు చొక్కా రావు.

"నేనూ వస్తున్నానుండండి..." అంటూ అతన్ననుసరించాడు జోగినాథం.

"ఎందుకు?"

"మీ ఇంటికివచ్చి మీ చెల్లెలు ఫోటో చూసి వెడతాను..." అన్నాడు జోగినాథం.

"ఫోటోకోసం ఇంటిదాకా ఎందుకు? జేబులో అవి ఓ నాలుగు వేసుకునే వచ్చాను. ఉద్యోగాలకి అప్లికేషన్స్ పెట్టడానికి అది ఇంట్లో ఎప్పుడూ ఫోటోలు సప్లయి చేస్తుంటుంది..." అంటూ ఓ ఫోటో తీసి జోగినాథానికిచ్చాడు చొక్కా రావు. ఆ సమయంలో జోగినాథం అతనికి మరీ దగ్గరగా వచ్చాడేమో వాసన భరించలేక ముక్కు మూసుకున్నాడు.

జోగినాథం ఆ ఫోటోని చూసి- "మీరు నిజంగా ఈమెకు అన్నయేనా?" అన్నాడు.

"అవును ఏం?"

"అయితే ఈమెకు పట్టిన గతి తెలుసుకోవాలని లేదా?"

"లేదు..."

"నిన్న ఈమెను రఘుపతి దారుణంగా హత్య చేశాడన్న విషయం తెలిసేక కూడా ఇలాగే అంటారా మీరు?"

చొక్కా రావు క్షణం మాత్రం తడబడ్డాడు. అతనికి

రఘుపతి హెచ్చరిక గుర్తు వచ్చింది. ఆయన పెట్టే పరీక్షలకు తట్టుకుంటేనే తనకు ఆఫీసరుద్యోగం లభిస్తుంది!

"రఘుపతిగారి గురించి మీరేం చెప్పినా నేను నమ్మను..." అని క్షణంకూడా ఆగకుండా అక్కణ్ణించి కదిలాడు.

జోగినాథం చటుక్కున తన ముక్కు మూసుకుని— "అబ్బా-స్వార్థపు వాసన నేను భరించలేను..." అని చౌక్కారావుకు వినబడేంత గట్టిగా అన్నాడు. చౌక్కారావు పట్టించుకోకుండా వెళ్ళిపోయాడు.

# 8

"రఘుపతి గురించి నాకు బాగా తెలుసు. కళ్యాణి సాయంతో ఆయన ఎందరో ఆడపిల్లల మానప్రాణాలు బలిగొంటున్నాడు. చాలాకాలంగా ఈ విషయాన్ని గమనిస్తూ నేను ఏమీ చేయలేకపోతున్నాను. డబ్బుతో ఆయన మానాన్నీ, బంధుత్వాన్నీ, మమకారాన్నీ, అధికారాన్నీ, సాక్ష్యాల్నీ—అన్నింటినీ కొనేస్తున్నాడు. ఆయన వల్ల నష్టపోయిన వాళ్ళుకూడా నాకు సాయపడ్డంలేదు. అలాంటివాడి బ్రతుకు బయటపెట్టకపోతే ఇంకా ఎందరివో జీవితాలు నాశనంకాక తప్పదు..." అన్నాడు జోగినాథం.

శాంతి అదోలా నవ్వి— "మీరివన్నీ ఎందుకు చెబుతున్నారో తెలియదు. ఏదో గుట్టుగా సంసార చేసుకుంటున్నవాళ్ళం. మాకు పెద్దవాళ్ళ గొడవలనవసరం. ఇంక రమ సంగతంటారా— అది మా స్వవిషయం. మాకు లేని బాధ మీకనవసరం. మీకేమైనా అనుమానాలుంటే రఘుపతిగారిమీద పోలీస్ రిపోర్టిచ్చుకోండి—" అంది.

"సంఘంలో కుళ్ళు కడగాలనుకుంటే ముందు—మీ

వంటిమీద కుళ్ళు కడుక్కోండి. వాసన భరించడం కష్టంగా వుంది'' అన్నాడు చౌక్కారావు.

జోగినాథం బాధగా నవ్వి- ''నా వంటిమీద కుళ్ళు భరించలేనిదైనా-ప్రమాదకరమైనది కాదు. ఈ సంఘంలోని కుళ్ళుకు నేనొక ఉదాహరణను. ఏదైనా దీక్షబూనినపుడు నేను స్నానం మానేస్తాను. గడ్డం గీయను. బట్టలు మార్చను. అనుకున్నది జరిగాకనే నా స్నానం. రఘుపతికి శిక్షపడేవరకూ-ఈ సంఘంలాగే నేనూ మురికిని భరించక తప్పదు'' అన్నాడు.

''పోనీ రఘుపతిగారు దుర్మార్గుడే అనుకుందాం... ఆయన తప్ప మిగతావారంతా మంచివారేనంటారా?'' అంది శాంతి.

''కాదు. అలాంటివారిని ఒక్కొక్కరినే ఏరివేయడం నా కోరిక'' అన్నాడు జోగినాథం.

''ఈ విషయంలో పనిగట్టుకుని మా ఇంటికి వచ్చినందుకు నా ధన్యవాదాలు. కానీ నేను మీకేవిధంగానూ సాయపడలేను సరికదా మరో పర్యాయం మా ఇంటికి వస్తే నాకు రమ అనే చెల్లెలే లేదనవలసి వస్తుంది...'' అన్నాడు చౌక్కారావు.

జోగినాథం ఉద్రేకంగా లేచి—''అనవలసి రావడమేంకర్మ—రమ అనే చెల్లెలు మీకింక ఎలాగూ లేదు...'' అన్నాడు. తర్వాత నెమ్మదిగా తమాయించుకుని— ''ఆపదలోవున్న ప్రతి ఆడదీ నాకు చెల్లెలు. కానీ అన్నగా నా సాయాన్నింతవరకూ ఎవరూ అంగీకరించలేదు. రమ ఈ లోకంలో ఉండివుంటే తనూ నా సాయం వద్దనేదేమో! ఆమె అసహాయతనాధారం చేసుకుని నేను ఆమెకు అన్నను కాదల్చుకున్నాను. రమ అన్నగా

రఘుపతి నెదిరించ దల్చుకున్నాను...'' అని అక్కణ్ణించి కదిలాడు.

''ఆఫీసరుద్యోగం వచ్చేదాకా ఇంకా ఇలాంటి వెన్ని పరీక్ష లెదుర్కోవాలో!'' అన్నాడు చౌకార్రావు, భార్యతో.

# 9

ఆమె ఒకసారి చుట్టూ చూసింది.

ఎదురుగా నీలాకాశం, పైన నీలాకాశం, క్రింద దారుణమైన అగాధం మనసులో దేవుడిని స్మరించుకుని క్రిందకు దూక బోయింది.

చటుక్కున ఎవరిదో చేయి ఆమెను ఆపింది. అదే చేయి ఆమెను బలంగా వెనక్కు లాగింది.

ఆమె పెనగులాడడానికి ప్రయత్నించలేదు. అగాధంలో దూకబోయే ముందున్న నిర్ణయం ఏదో హస్తంతన్నా పేసరికి బలహీనమై పోయింది. తనా అగాధంలో దూకి వుంటే?

తలచుకుని వణికి పోయిందామె.

''నిన్ను నేను చాలా దూరంనుంచి అనుసరించి వస్తున్నాను. ఇలాంటి ప్రయత్న మేదో చేస్తావన్న అనుమానం బజారులో నీ ముఖం చూసినప్పుడే కలిగిందినాకు. చావాలని ఎందుకను కున్నావ్?'' అన్నాడతను.

''బ్రతక లేక!'' అందామె.

ఆమె జీవితంలో వంచింప బడింది. ఒక మోసగాడు ఆమెచుట్టూ తిరిగి—పెళ్ళి చేసుకుంటానని ఆశ పెట్టాడు. నిన్నటిదాకా అతన్ని నమ్మింది. నిన్ననే ఇద్దరూ ఒకటయ్యారు. ఈరోజు వాడి అసలురంగు బయటపడింది.

ఆమెకు జీవితంలో ఎవ్వరూలేరు. గత రెండు సంవత్స

రాలుగా ఒక మనిషిచుట్టూ తన ఆశలన్నింటినీ అల్లు కుంటూ వచ్చిందామె. ఈ రోజవన్నీ భగ్నమైపోయాయి. జీవితం మీద విరక్తి కలిగిందామెకు.

"బాగుంది. ఓ మోసగాడికోసం విలువైన నీ ప్రాణాలు తీసుకుంటావా? అలాంటి మోసగాళ్ళకు బుద్ధి చెప్పడం నీ బాధ్యత కాదా? ఆ విధంగానైనా నీ వంటి మరి కొంతమంది ఆడవాళ్ళు రక్షించబడతారు కదా!"

"మీ రెవరు?"

"నా పేరు జోగినాథం. రఘుపతి అనే పేరుగల పెద్ద మనిషి అన్యాయాలను బయటపెట్టడం నా ధ్యేయం. ఆయన మూలంగా ఎందరో ఆడపిల్లల శీలం హరించుకుపోతోంది. అయినా నా కెవ్వరివద్ద నుంచీ సహకారం లభించడం లేదు."

"నా పేరు కోమల. నేను మీ కేదైనా సాయపడగల నేమో చెప్పండి!"

"సాయపడగలవు. నువ్వు చూడ్డానికి చాలా అందంగా వున్నావు, కళ్యాణి కంట బడ్డావంటే ఆమె నిన్ను రఘుపతి వద్దకు చేర్చుతుంది. నువ్వూ రఘుపతీ ఓ గదిలో వుండగా - నువ్వాయన్ను ప్రతిఘటిస్తూండగా - పోలీసులతో నేను వస్తాను. రెడ్ హేండెడ్ గా పట్టుకుంటే తప్ప రఘుపతి నేరాలు ఋజువుచేయడం కష్టం..."

కోమల జోగినాథం చెప్పినదంతా విని అతను చెప్పిన విధంగా నడచుకోవడానికి సిద్ధపడింది. "నిజంగా ప్రాణాలు తీసుకోవడం తెలివితక్కువ. ప్రాణాలకు తెగించిన వాళ్ళు ఆత్మహత్యకు బదులుగా సంఘంలోని కళ్ళను బయటపెట్టే ధైర్యం ప్రదర్శిస్తే దేశానికి మేలు జరుగుతుంది" అందామె.

"బాగా చెప్పావ్. ఇప్పుడు నేను చేస్తున్నదదే-" అన్నాడు జోగినాథం.

# 10

"మీ గురించి చాలా విన్నాను సార్! డ్యూటీని నిర్వహించడంలో మీరుదేనికీ భయపడరని ప్రజలు కథలుగా చెప్పుకుంటూరు..." అన్నాడు జోగినాథం.

ఇనస్పెక్టర్ భానోజీరావు నవ్వి-"ఏంకావాలి నీకు?" అన్నాడు.

"మీరు వెంటనే నాతో బయల్దేరి రావాలండి. చాలా కాలంగా ఓ పెద్దమనిషి అసలు రంగును బయట పెట్టడానికి విఫలయత్నాలు చేస్తున్నాను. ఇన్నాళ్ళకు నాకో అవకాశం వచ్చింది. రఘుపతి నా చెల్లెలు కోమలను తీసుకుని వెళ్ళాడు. మీరు కలగజేసుకుంటే ఆయన అసలు స్వరూపం చూస్తారు. కలగజేసుకోకపోతే నా చెల్లెలు బ్రతుకు అన్యాయమై పోతుంది."

భానోజీ రావాల్టే చలించలేదు - "రఘుపతి అంటే ఎవరు?"

జోగినాథం, రఘుపతి గురించీ, ఆయన ఆడపిల్లలను చెరపట్టే విధానం గురించీ, తన పథకం గురించీ వివరించాడు. భానోజీరావు అంతా విని "నిన్నూ నీ వాటాన్నీ చూస్తూంటే నీ మాటలు నమ్మాలని పించడం లేదు-" అన్నాడు.

"నా మాటల్లో అబద్ధముందనిపిస్తే నన్ను జైల్లోకి తోసేయండి..." అన్నాడు జోగినాథం—"నా మాట మన్నించి మీరు నాకేసు పట్టాలి..."

ఏకళనున్నాడో భానోజీరావు అంగీకరించి—"సరే-పద! ఇది రఘుపతిగారితో వ్యవహారం. ఏమాత్రం తేడా

వచ్చినా నా పీకలమీదికొస్తుంది. నువ్వు చెప్పిన విషయం ఋజువుకాకపోతే జైల్లో పెట్టడం సంగతలాగున్నా మక్కెలిరగదన్నేస్తాను..." అన్నాడు.

ఇన్‌స్పెక్టర్ భానోజీరావు, నలుగురు కానిస్టేబుల్సు జోగినాథం పోలీస్ జీపులో ఎక్కారు. జీపు శరవేగంతో దూసుకుపోయి ఊరికి చివరగావున్న రఘుపతి ప్రత్యేక భవనం ముందాగింది. జోగినాథం, భానోజీరావు మాత్రం జీపు దిగారు.

వాళ్లు లోపలకు వెళ్ళేసరికి కళ్యాణి అక్కడ బయట పచార్లు చేస్తోంది. యూనిఫాంలోవున్న పోలీసు ఇన్‌స్పెక్టర్ని చూసి ఆమె కంగారు పడింది.

"రఘుపతిగారున్నారా?" అన్నాడు భానోజీరావు.

కళ్యాణి తల ఆడించి - "చాలా అర్జంటు పనిలో వున్నారనుకుంటాను..." అంది.

"ఆయనతో ఓసారి కలవాలి..."అన్నాడు భానోజీరావు ఆజ్ఞాపిస్తున్నట్లుగా.

కళ్యాణి ఒక్కక్షణం తటపటాయించి గుమ్మందగ్గరకు వెళ్ళి ఒకమీట నొక్కింది. ఆ తర్వాత రెండునిమిషాల అనంతరం తలుపులు సన్నగా తెరుచుకున్నాయి. రఘుపతి తలుపు సందుల్లోంచి ముఖం బయటపెట్టి - పోలీస్ ఇన్‌స్పెక్టర్ని చూసి- చటుక్కున బయటకు వచ్చాడు. వచ్చేటప్పుడు తలుపులు జారగిల వేశాడు.

"ఇతని పేరు జోగినాథం. ఇతని చెల్లెలు కోమలను మీరు తీసుకు వచ్చారని ఇతనంటున్నాడు..." అన్నాడు భానోజీరావు.

"వీడూ...వీడి అవతారానికీ ఓ చెల్లెలుకూడానా?" అన్నాడు రఘుపతి. ఆయన ముఖం చాలా కోపంగా

వుంది.

"అది సరేననుకోండి. నేనూ అలాగే అనుకుంటు న్నాను. ఇంతదాకా వచ్చాను కాబట్టి, ఇతడి అభియోగంలో నిజానిజాలు తేల్చడానికి ఒక్కసారి ఈ ఇల్లు సెర్చి చేసి వెళ్ళిపోతాం. ఇతడబద్ధం చెప్పివుంటే అందుకు తగిన శిక్ష ఎలాగూ అనుభవిస్తాడు!" అన్నాడు భానోజీరావు.

"ఇట్సాల్ రైట్ - నాకో అయిదునిమిషాలు గడువివ్వండి..." అని రఘుపతి తనగదిలోకి వెళ్ళి తలుపులు వేసుకున్నాడు. భానోజీరావు అనుమానంగా ఆ తలుపుల వంకనే చూస్తూ నిలబడ్డాడు.

సరిగ్గా అయిదునిముషాల అనంతరం తలుపులు తెరుచుకున్నాయి. గదిలోంచి రఘుపతి బయటకు వచ్చాడు. ఆయన వెనుకనే ఒక యువతి కూడా బయటకు వచ్చింది.

"ఆమె నా చెల్లెలు కోమల..." అన్నాడు జోగినాథం.

"ఈమె మిస్ కోమల! ఈరోజే నా పర్సనల్ సెక్రటరీగా అపాయింటయింది." అంటూ రఘుపతి ఆ యువతిని భానోజీరావుకు పరిచయం చేశాడు. కోమల, భానోజీరావుకు నమస్తే చెప్పింది.

భానోజీరావు ఆశ్చర్యంగా కోమల వంకచూసి - "మీకు మీఅన్నయ్యకూ రూపంలోనూ వేషభాషల్లోనూ చాలా తేడావుంది...." అన్నాడు.

"నాకు అన్నయ్యెవరు?" అంది కోమల ఆశ్చర్యంగా. జోగినాథాన్ని చూపిస్తే అతన్ని తా నెప్పుడూ చూడలేదంది. అతనెవరో తనకు తెలియదంది. ఉద్యోగం కోసం తిరుగుతూంటే కళ్యాణి తననిక్కడకు తీసుకువచ్చిందనీ - ఆ సందర్భంగానే తనకూ రఘుపతిగారికీ

అక్కడ మాటలు జరుగుతున్నాయనీ ఆమె చెప్పింది.

"చెల్లాయ్ - ఎందుకిలా మారిపోయావ్?" అన్న జోగినాథాన్ని నిరసనగా చూసి - "అబ్బా-వాసన..." అంటూ ముక్కు మూసుకుంది కోమల.

జోగినాథం తనూ ముక్కు మూసుకుని - "ఇప్పుడు జరుగుతున్న ఈ వంచన వాసన నేనూ భరించలేక పోతున్నాను..." అన్నాడు.

భానోజీరావు క్రూరంగా జోగినాథం వంక చూసి - "పద - పోలీస్ స్టేషన్‌కు పోదాం. తప్పుడు సమాచారానికి ఫలిత మెలాగుంటుందో అక్కడి రుచిచూస్తావ్" అన్నాడు.

"సార్ - మీ శిక్ష ననుభవించడానికి నేను సిద్ధంగా వున్నాను. ఇంతవరకూ నేను మీకు ఒకే ఒక తప్పుడు సమాచారాన్నిచ్చాను. నా మీద దయవుంచి మీ కింకో సమాచార మిస్తున్నాను వినండి. అది కూడా తప్పని తేలితే నన్ను మీరు ఉప్పు పాతర వేసినా బాధపడను. ఎలాగూ ఇంతవరకూ వచ్చారు. ఈ ఇంటికొడ్డో ఒక చోట ప్రభుత్వానికి పనికొచ్చే అమూల్యమైన నిధి పాతి పెట్టబడి వుంది. ఆ స్థలాన్ని నేను మీకు చూపిస్తాను.." అన్నాడు జోగినాథం.

భానోజీరావు ఆశ్చర్యంగా జోగినాథం వంక చూశాడు. అతని ముఖంలో బాధ తప్పితే భయంలేదు. జోగినాథం కళ్ళలో తేజస్సున్నట్లు భావించాడతను.

రఘుపతి - "ఆ పిచ్చాడి మాటలను మీరు లెక్క చేయకండి...." అన్నాడు. అయితే భానోజీరావు మాత్రం - "ఎలాగూ ఇక్కడికి వచ్చాను కాబట్టి అదీ చూసి వెడతాను నేను. ఇది కేవలం నా విధి నిర్వహణ.

మీరు అన్యధా భావించ కూడదు...” అన్నాడు.

రఘుపతి ఓ నిముషం ఆలోచించి - “సరే - అలాగే కానివ్వండి...” అన్నాడు.

దొడ్లో జోగినాథం పోలీసులకు చూపించిన ప్రదేశం చూసి రఘుపతి కాస్త తడబడ్డాడు. కానీ ఆ తడబాటును కప్పి పుచ్చుకునేందుకు శత విధాల ప్రయత్నించాడు.

కానిస్టేబుల్సు అక్కడ తవ్వడం ప్రారంభించారు. సరిగ్గా కొంత లోతైనా తవ్వకుండానే కానిస్టేబుల్సులో సంచలనం ప్రారంభమయింది. జోగినాథం ముఖంలో సంతృప్తి - రఘుపతి ముఖంలో తెచ్చి పెట్టుకున్న ఆశ్చర్యం ఒకేసారి వచ్చాయి.

జాగ్రత్తగా తవ్వగా ఆ గోతిలోంచి ఒక యువతి శవం బయటపడింది. శరీరం ఇంకా బాగా పాడైపోలేదు.

కళ్యాణి, కోమల 'కెవ్వ'మని అరిచారు.

“ఎవరిదీ శవం? ఇక్కడికెలా వచ్చింది?” - హుంకరించాడు భానోజీరావు. అతని కిప్పుడు వెయ్యేనుగుల బలం వచ్చింది.

“రఘుపతిని ప్రతిఘటించిన ఓ అబల. పేరు రమ...” అన్నారు జోగినాథం తాపీగా.

“ఇన్‌స్పెక్టరు గారూ - ఈ జోగినాథం గాడెవడో నాకు తెలియదు కానీ నా పరువు గంగపాలు చేయడం కోసమే వాడు కంకణం కట్టుకున్నట్టుంది. గత కొద్ది దినాలుగా వీడు నన్నిరుకులో పెట్టాలని చూస్తున్నాడు. నేనే హత్య చేస్తే వీడికి తెలిసేలా తెలిసేచోట ఎందుకు పాతిపెడతాను? నా అనుమానం - వీడే ఈ హత్యచేసి శవాన్నిక్కడ పాతిపెట్టి వుంటాడని!” అన్నాడు రఘుపతి కంగారుగా.

"ఏదైనా కావచ్చు. ఏమైనా కావచ్చు. కానీ ఇప్పు డిక్కడో కేసుపుట్టింది. దాన్ని పరిష్కరించ వలసిన బాధ్యత నాకుంది..." అన్నాడు భానోజీరావు.

రఘుపతి తన గోడంతా ఏకరువు పెట్టుకున్నాడు. జోగి నాథం తన నెలా యిబ్బంది పెడుతున్నదీ వివరించాడు. "ఇదివరలో రమ గురించి నా పేరున పేపర్లో ప్రకటన వేయించాడు. తర్వాత కోమలను నాపై ప్రయోగించాడు. అదృష్ట వశాత్తూ రమ అన్నయ్యా, కోమల కూడా నా సహృదయాన్నర్థం చేసుకో గలిగారు. ఇప్పుడీ శవాన్ని తీసుకొచ్చాడు, ఇవన్నీ కలిపి ఆలోచిస్తూంటే - ఏ కారణంగానో రమను వీడే హత్యచేసి, ఆ నేరాన్ని నాపై మోపాలను కుంటున్నాడని నా అనుమానం..." అన్నా డాఖరికి.

"మీ అనుమానం సముచితంగానే తోస్తున్నది..." అన్నాడు భానోజీరావు - "కానీ అందుకేదో కారణ ముండాలి కదా! జోగినాథం మీ మీద ఎందుకు పగ బట్టాడు? ఆతనికి మీరేదైనా అపకారం చేశారా?"

"ఈ జోగినాథం స్వార్థంకోసం ఎవరి మీదా పగ బట్టడు. సమాజంలోని చీడపురుగుల్ని బయట పెట్టడమే నాపని..." అన్నాడు జోగినాథం.

"ఇంతకీ ఈ శవం..."

"ఇన్‌స్పెక్టరు గారూ ఆవివరాలన్నీ నేను చెబుతాను. ఆ యువతి పేరు రమ. ఆమెను గుర్తు పట్టగలవారు దొరికే ఇంటి అడ్రసు కూడా నేను చెబుతాను. నోట్ చేసు కోండి" అన్నాడు జోగినాథం.

## 11

జోగినాథం సాలోచనగా పోలీస్ స్టేషన్లో కూర్చు

న్నాడు. తానొకటి తలిస్తే దైవ మొకటి తలిచాడు. రమ హత్యా నేరంతో రఘుపతిని బయట పెడదామనుకుంటే - ఆ శవం బయటపడడం తన ప్రాణాలమీదకే వచ్చింది.

ఆరోజు రఘుపతి నుంచి పారిపోయి కొంతదూరం మాత్రమే వెళ్ళి తను మళ్ళీ రహస్యంగా వెనక్కి వచ్చి జరిగినదంతా చూశాడు. శవం ఎక్కడ పాతి పెట్టబడిందో గమనించాడు. తర్వాత ఒక లారీ సాయంతో నగరం చేరుకున్నాడు. ఈ వివరాలు తను చెప్పినా ఇప్పుడెవరూ నమ్మడం లేదు.

చౌకారావు, కోమలి చెబుతున్నదాన్నిబట్టి రఘుపతి పైన జోగినాథానికి అపరిమితమైన ద్వేషమున్నదని తెలుస్తోంది. అందుకు కారణం జోగినాథం స్వార్థం కాదంటే ఎవరూ నమ్మడం లేదు. కేవలం విశ్వమానవ కళ్యాణంకోసం ఒక మనిషి ఇంకో మనిషి నేరాలను బయట పెట్టడానికి ప్రాణత్యాగం వరకూ వెడతాడని ఎవ్వరూ నమ్మడం లేదు.

రమను తానెరుగనని రఘుపతి అంటున్నప్పుడు - రమ హత్య గురించి మాట్లాడిన జోగినాథమే ఆ హత్య చేసి ఉండాలని చౌకారావభిప్రాయపడుతున్నాడు.

రఘుపతి డబ్బుతో మనుషులనూ, వారి తెలివితేటల్నీ, ధైర్యాన్నీ, మంచితనాన్నీ సర్వాన్నీ కొనగలుగుతాడు. అటువంటివాడికి ఎదురు తిరిగాడు తను. ఆత్మహత్య చేసుకోబోయిన కోమలను తను రక్షిస్తే - ఆ కోమల తిరిగి డబ్బుకు అమ్ముడు పోయింది. తన ఛీత్కరించింది.

రమ శవం అక్కడ పాతిపెట్టబడ్డ విషయం జోగినాథానికెలా తెలిసింది? ఈ విషయంలో అతనిచ్చే సమా

ధానాన్నెవ్వరూ నమ్మబోవడంలేదు. సాక్ష్యాలు జోగినాథానికి వ్యతిరేకంగా పేరుకుంటున్నాయి.

"ఇప్పుడేం చేస్తావ్?" అన్నాడు భానోజీరావు.

జోగినాథం నవ్వాడు.

"పొట్టేలు వెళ్ళి కొండను ఢీకొట్టింది."

"ధర్మ బలముందన్న ధైర్యంతో."

"ప్రతి హంతకుడూ ధర్మం తన పక్షాన వుందనుకుంటాడు."

జోగినాథం మళ్ళీ నవ్వి - "నా ఆశయం మంచిది. నేను తప్పక జయిస్తాను" అన్నాడు.

"ఎలా? ఉరికంబం ఎక్కా-?"

"కాదు..." అని నవ్వాడు జోగినాథం.

# 12

ఓ కుర్రాడు ఆ చీటీ శాంతి చేతిలో పెట్టి తూనీగలా పారిపోయాడు.

శాంతి ఆ చీటీ చదువుకుంది. అది చౌక్కారావు ఆదేశం.

అవతల వీధిలో బస్ స్టాప్ వద్ద నిలబడితే కళ్యాణి అనే అమ్మాయి ఓ టాక్సీ తీసుకుని వస్తుంది. తనందులో ఎక్కాలి. గమ్యస్థానం వద్ద చౌక్కారావామెను రిసీవ్ చేసుకుంటాడు. అక్కడ ఒక కొత్త అదృష్టం వారి గురించి ఎదురుచూస్తోంది.

శాంతి ఆ చీటీ చదువుకుని బాగా మురిసిపోయింది. రమ మాయంకావచ్చు, హత్య చేయబడవచ్చు - కానీ ధనలక్ష్మి మాత్రం తమను తరుముకుని మరీ వచ్చి చేరుతోంది. రఘుపతి మూలంగా ఆర్థికంగా తమ పరిస్థితి

బాగా మెరుగుపడింది.

శాంతి త్వరగా తెమిలి బట్టలు కట్టుకుని చీటిలోవున్న ప్రకారం చేసింది. ఆ ప్రకారమే టాక్సీ వచ్చింది. టాక్సీలో కళ్యాణివుంది. శాంతి టాక్సీ ఎక్కింది.

టాక్సీ కదిలిన రెండు నిముషాలో ఆఫీసులోవున్న చౌక్కారావుకు ఫోన్ వచ్చింది.

"రఘుపతి ద్వారా నీ భార్య శాంతి కూడా వలను పట్టినగ తే పట్టబోతోంది. ఆమె ప్రస్తుతం ఊరిచివరవున్న రఘుపతి బంగళాకు వెళ్ళింది. త్వరగా వెళ్ళి ఆమెను రక్షించుకో..."

చౌక్కారావు కలవరపడి అప్పటికప్పుడు బయలేరి ఇంటికి వెళ్ళాడు. ఇల్లు తాళంవేసి వుండడంతో అతని కంగారు అధికమయింది. త్వరగా టాక్సీ చేయించుకున్నాడు.

అతను ఊరిచివర బంగళా చేరుకునేసరికి కళ్యాణి లోపల హాల్లో పచార్లు చేస్తోంది. చౌక్కారావు ఒక్క ఉదుటున ఆమెను సమీపించి - "నా భార్య శాంతి ఇక్కడకు వచ్చిందా?" అనడిగాడు.

"మీ భార్య ఎవరో నాకు తెలియదు...." అంది కళ్యాణి.

అంతలోనే అవతలిగది తలుపులు తెరుచుకున్నాయి. గదిలోంచి రఘుపతి, శాంతి బయటకువచ్చారు. చౌక్కారావు నక్కడ చూసి రఘుపతి తడబడ్డాడు. శాంతిని రఘుపతి పక్కన చూసిన చౌక్కారావు కళ్ళు ఎర్రబడ్డాయి.

"మిస్టర్ చౌక్కారావ్! ఎక్కడో ఏదో పొరపాటు జరిగింది. పొరపాటున నీ భార్యను నా దగ్గరకు తీసుకు

రావడం జరిగింది. అయాం రియల్లీ వెరీ సారీ! ఈమె నా కూతురువంటిది. నన్ను మన్నించి వెంటనే ఇక్కణ్ణించి మీ ఇద్దరూ వెళ్ళిపోండి...'' అన్నాడు రఘుపతి.

శాంతి గబగబా భర్తను సమీపించింది. ఇద్దరూ బంగళాలోంచి బయట పడబోతూండగా వాళ్ళకు ఇన్‌స్పెక్టర్ భానోజీరావు ఎదురయ్యాడు.

''చాలా ఆశ్చర్యం - మీరు...ఇక్కడ!'' అన్నాడు భానోజీరావు.

ఏం మాట్లాడాలో తోచక నవ్వేసి ముందడుగు వేశాడు చొక్కారావు.

''ఆగండి - ఇది హత్య జరిగిన ప్రాంతం. ముద్దాయికి వ్యతిరేక సాక్షులు మీరు. ఇక్కడికెందుకొచ్చారో చెప్పి మరీ వెళ్ళండి.'' అన్నాడు భానోజీరావు.

చొక్కారావుకు వెంటనే ఏం చెప్పాలో తెలియలేదు. కల్పించడానికి అతనికేమీ తోచలేదు. ఆ కారణంగా అతను చటుక్కున తనకు ఫోన్ వచ్చిన విషయమూ, బయల్దేరి రావడమూ చెప్పేశాడు. శాంతికూడా తన అనుభవం చెప్పింది.

''గదిలో రఘుపతి ప్రవర్తన ఎలాగుంది?''

''ఆయన నా శీలం దోచుకోవాలనే ఉద్దేశ్యంలోనే వున్నాడు. అయితే ఆయన రఘుపతి అని తెలియగానే నేను శ్రీమతి చొక్కారావునని తెలియజేశాను. ఆయన షాక్ తిన్నట్టులిక్కిపడి నన్ను సగౌరవంగా గదిలోంచి బయటకు తీసుకొచ్చాడు'' అంది శాంతి.

''జరిగింది జరిగినట్టు చెప్పండి'' అన్నాడు భానోజీరావు.

''కళ్యాణి నన్ను ఇంటికి తీసుకువచ్చి ఆ గదిలోకి వెళ్ళ

మంది. అక్కడ నా భర్త వుంటాడనుకున్నాను. రఘుపతి గారు కనిపించారు. నన్ను చూస్తూనే — 'ఈ రఘుపతి గదిలోకి వచ్చి లొంగకుండా ఏ ఆడదీ ప్రాణాలతో బయటపడ లేదు. మర్యాదగా లొంగి బహుమతి పుచ్చుకుని వెళ్ళిపో' అన్నాడు - ఆ తర్వాత నేను శ్రీమతి చొక్కా రావునని తెలిసి కంగారుపడ్డాడు" అంది శాంతి.

"మీరు వెళ్ళవచ్చు" అన్నాడు భానోజీరావు-"ఇలా నాతో చెప్పినట్లు ఇంకెవ్వరికీ చెప్పకండి."

చొక్కారావు, శాంతి అక్కణ్నించి బయటపడ్డారు. దారిలో శాంతి "ఈ రోజు చాలా పెద్దగండం గడిచింది. ఆ భోగినాథం నిజమే చెబుతున్నాడని నా కిప్పుడనిపిస్తోంది. ఒక వేళ మన రమ ఇలాంటి పరిస్థితుల్లోనే" అని ఆపైన మాట్లాడలేక ఊరుకుంది.

భానోజీరావు లోపలకు వెళ్ళేసరికి రఘుపతి, కళ్యాణి దగ్గరగా కూర్చుని ఏవో మాట్లాడుకుంటున్నారు. ఇన్‌స్పెక్టర్ని చూసి ఇద్దరూ కంగారుగా లేచి నిలబడ్డారు.

"పెద్ద పనేమీ లేదు. రమ హత్యకేసులో మంచి సాక్ష్యం లభించనున్నదనీ ఆ సందర్భంగా ఇక్కడకు వెళ్ళమనీ నాకు ఫోన్ వచ్చింది. అలాగే బయల్దేరి వచ్చాను. సమాచారం లభించింది. ఎలాగూ వచ్చానుకదా అని మిమ్మల్ని ఓ పర్యాయం పలకరించి పోదామని ఇలా వచ్చాను. వస్తాను" అన్నాడు భానోజీరావు.

"ఏమిటా సమాచారం?" అన్నాడు రఘుపతి.

"కేసు స్వరూపాన్నే మార్చే సమాచారమది. భోగినాథం గత చరిత్ర విచారించాను. నిజంగానే అతడు సత్పురుషుడు. ఇప్పటికతను అయిదారుగురు దోషుల్ని న్యాయస్థానాని కప్పగించాడు. ఒక్క విషయంలోనూ

అతనికి స్వార్థంలేదు.''

రఘుపతి తడబడుతూ "బహుశా ఇది మాస్టర్ ప్లాన్ కావచ్చు. ఏదోవిధంగా నామీద పగ తీర్చుకునేందుకు ముందు కొంత బ్యాక్ గ్రౌండ్ ఏర్పరచుకుంటూ వచ్చి ఇప్పటికిలా బయటపడ్డాడనుకుంటాను'' అన్నాడు.

"అదే నిజమైతే అందుకేదో బలమైన కారణముండి వుండాలి. అదేమిటో మీరే చెప్పాలి. కానీ మీరు చెప్పడంలేదు.''

రఘుపతి మాట్లాడకుండా ఆలోచనలో పడిపోయాడు.

"మీరింకా నానుంచి చాలా విషయాలు దాస్తున్నారు. మీకు స్త్రీ వ్యసనమున్న మాట నిజం.అందుకు ఆడవాళ్ళను మీరీ ప్రదేశానికి రప్పించుకునే మాటకూడా నిజం.'' అన్నాడు భానోజీరావు.

"ఇన్‌స్పెక్టర్! ఇది నా దురదృష్టం. మీరుకూడా ఓ పిచ్చాడి తరఫున మాట్లాడుతూ నన్నుమానిస్తున్నారు'' అన్నాడు రఘుపతి విచారంగా.

# 13

"చూడు కళ్యాణీ! చేసిన నేరం ఒప్పుకుంటే శిక్ష తగ్గే అవకాశముంది. రఘుపతికి తార్చబోయినందుకు కోప గించుకుని రమ నీమీదకు వచ్చింది. మీ ఇద్దరికీ కాసేపు యుద్ధం జరిగింది. ఆత్మరక్షణకోసం నువ్వామెను చంపే కావ్. అవునా?'' అన్నాడు భానోజీరావు.

"లేదు. రమ నాకు తెలియదు'' అంది కళ్యాణి.

"కానీ రమను నువ్వే చంపినట్లు ప్రబల సాక్ష్యం వుంది.''

"ఏమిటది?''

"నువ్వా హత్యను చేస్తూండగా చూసిన వ్యక్తి....''

"ఎవరా వ్యక్తి?"

"రఘుపతి."

కళ్యాణి తెల్లబోయి - "ఏమిటన్నారు?" అంది.

"ఆ హత్య నువ్వే చేశావని రఘుపతిగారు మాకు చెప్పారు."

"అబద్ధం. నేనీమాట నమ్మను."

"నమ్మకపోయినా ఫరవాలేదు. నీకు శిక్ష ఎలాగూ తప్పదు."

"రఘుపతిగారెందుకు నా మీద అలా అబద్ధం చెప్పారు?"

"నిన్ను రక్షించడంకోసమని ఆయన ప్రాణాలమీదకు తెచ్చుకున్నాడు. మీ ఇద్దరిలో ఎవరో ఒకరు హత్యచేసినట్లు మాకు రూఢి అయింది. దానిమీద ఆయన్ను నొక్కించగా అసలు విషయం బయటపెట్టి - "కళ్యాణి చాలాకాలంగా నాకు తోడుగా వుంది. అందుకే ఆమెను రక్షించాలని ఇంతకాలమూ ప్రయత్నించాను. అయినా ఫలితంలేకపోయింది ... అని బాధపడ్డారు" అన్నాడు భానోజీరావు.

"అయితే నా కర్తవ్యం నేనుకూడా నేరవేర్చాలి.... నాకు తెలిసిన నిజం నేనూ బయటపెడతాను." అంది కళ్యాణి.

రమ హత్యనాడు జరిగిన వివరాలన్నీ ఆమె చెబుతూ వుంటే భానోజీరావు టేపు చేశాడు.

"శవాన్ని పాతిపెట్టడం అయ్యేవరకూ నేనక్కడే వున్నాను. హత్య కుపయోగించిన ఆయుధం రఘుపతి గారింట్లో బెడ్రూంలో భద్రంగా దాచాడు. రమ తన మానాన్ని రక్షించుకోవడం కోసం ఆయన్ను తీవ్రంగా

గాయపరచింది. రమ శవాన్ని పాతిపెట్టడమయ్యాక నేను రఘుపతిగారికి కాసేపు మాలీసుచేశాను. ఇంచుమించు స్పృహ కోల్పోయిన స్థితిలో ఓ గంట గడిపారాయన. ఆయన వంటిమీదున్న చాలా దెబ్బలు, గాయాలు ఇంకా మానలేదు. ఆ వివరాలన్నీ ఇవ్వగలను.'' అంది కళ్యాణి ఆవేశంగా.

భానోజీరావు అక్కణ్ణించి లేచి తిన్నగా మరో చోటుకు వెళ్ళాడు. అక్కడ జోగినాథం కోమల వున్నారు.

''వెల్ మిస్టర్ జోగినాథం-అనుకున్నది సాధించావు. నీ పథకం ఫలించింది. రఘుపతిమీద కేసు పటిష్టమైంది'' అన్నాడు భానోజీరావు.

కోమల కళ్ళలో వెలుగు కనిపించింది.

''మీరు చెప్పిన వివరాలన్నీ విన్నాక రఘుపతిలాంటి వాళ్ళను బయటపెట్టడానికి మీ పథకం పనికిరాదనిపించింది. అందుకే దాన్ని తిరగేసి ముందుగానే మీ వివరాలన్నీ రఘుపతికి చెప్పేసి ఆయన అభిమానం సంపాదించుకున్నాను.

నా కారణంగా మీరు జైలుపాలవడంతో రఘుపతికి చాలా నమ్మకం కలిగింది నాపైన. ఆ నమ్మకాన్నలా కాపాడుకుంటూ ఆయనపై అనుమాన బీజాలు పోలీసుల్లో నాటడం మొదలుపెట్టాను.

ముందుగా భానోజీరావుగార్కి మీ గతజీవితంగురించి కొన్ని ఉదాహరణలిచ్చాను. అవి మీ మంచి ఉద్దేశ్యాల నాయనకు తెలియబర్చాయి.

తర్వాత ఒక మంచి అమ్మాయి నాయనకు పంపుతానని రఘుపతికి ఆశ పెట్టాను. అది ఆయన బలహీనత. కాంతి

నాయనదగ్గరకు పంపాను. ఆ విధంగా ఆయనకూ చౌకార్రావుకూ భేదాభిప్రాయాలు సృష్టించాను. ఇన్స్పెక్టర్ భానోజీరావులో ఆ విధంగా రఘుపతిపై అనుమానపు మెలికలు సృష్టించగలిగాను.

ఆ విధంగా ఇన్స్పెక్టర్ భానోజీరావుకు మీపైన బాగా నమ్మకం కుదిరి - కళ్యాణివద్ద మీరాడమన్న నాటకం ఆడాడు. పని జరిగింది'' అంది కోమల, జోగినాథంతో.

''నిన్ను నేను అపార్థం చేసుకున్న మాట వాస్తవం కానీ నీ పథకమే నన్ను కాపాడింది కోమలా! ఏమైనా ఋజువుంటేనే కదా - నిజం నిజమయ్యేది. నీకు నా ధన్యవాదాలెలా చెప్పుకోవాలో తెలియడంలేదు...'' అన్నాడు జోగినాథం.

''మనిషి చచ్చి సాధించేదేమీ లేదు. చావాలనుకున్న వారు చచ్చేటంత ప్రమాదమున్న నిజాల నెదుర్కొని బయటపెట్టడానికి ప్రయత్నించాలి. ఇది నేను మీదగ్గర నేర్చుకున్నదే-మీకే నేను ధన్యవాదాలర్పించుకోవాలి'' అంది కోమల.

''నా ఆశయాలనర్థం చేసుకోగలిగావు. అంతేచాలు. మరి వస్తాను.'' అన్నాడు జోగినాథం.

''ఎక్కడికి వెడతారు?''

''స్నానానికి!''

:- ఐపోయింది :-

# మిత్రుని చంపిన శత్రువు!

సికిందర్

తలుపు నెవరో తడుతోన్నారు....

ఈ హోటల్‌లో రూం బుక్ చేసుకుని గంటైనా గడవలేదు, అప్పుడే ఈ అతిథెవరూ అని ఆలోచించాను. పాల్ జ్ఞాపక మొచ్చాడు. కానీ, అతనిక్కడికి రావడ మెలా సాధ్యం? ఎంత డిటెక్టివ్ అయినా బెంగుళూరు నుంచి నేను హైద్రాబాదుకి వచ్చి ఫలానాచోట బస చేసినట్టు ఎలా తెలుసుకుంటాడు?

టవల్ చుట్టుకుని బాత్‌రూం నుంచి బయటికి వచ్చి తలుపు తీశాను. ఖాకీ యూనిఫాం ధరించిన వ్యక్తి కంట బడ్డాడు.

నా కనుమానం వేసింది. మంచి హోటలులోనే బస చేశానా?

''మిస్టర్ అర్జున్ మీరేనా?'' అడిగాడతను, తీక్షణంగా చూస్తూ.

జారిపోతున్న టవల్‌ని లాక్కుంటూ నేనేనని

చెప్పాను.

అతను నవ్వి లోనికడుగువేసి సోఫాలో కూచున్నాడు.

అతని ప్రవర్తన నాకు నచ్చలేదు. అతను పోలీసు అధికారే, కానీ నా గదిలో జొరబడ్డానికి అధికారం ఎక్కడిది?

ఈ విషయం అడిగాను.

అతను జాలిగా నవ్వి అదోలా చూస్తూ అన్నాడు, "మీరు నాతో హెడ్ క్వార్టర్స్‌కి రావాలి."

"నేనా? - ఎందుకు?"

"మిస్టర్ కృపాల్ మీ స్నేహితుడుకదూ?"

నేను తల వూపాను అయోమయంగా.

"అతను హెడ్ క్వార్టర్స్‌లో వున్నాడు" అన్నాడతను. "మీరతడ్ని గుర్తించడానికి రావాలి-"

"గుర్తించడానికా?"

"యస్, అతని శవం హెడ్ క్వార్టర్స్‌లో వుంది. నేను సార్జెంట్ సుందర్‌ని. క్రైం ఇన్‌స్పెక్టర్ నన్ను మిమ్మల్ని తీసుకురమ్మని చెప్పారు. మీరు త్వరగా రెడీ అయితే-"

"స్టాపిట్! ఏమిటి మీర నేదీ? కృపాల్ మరణించాడా? ఎలా?" అరిచాను అయోమయంగా.

సుందర్ నవ్వాడు, "డిటెక్టివ్‌లకి శత్రువులుండరని మీరనుకుంటున్నారా? అయితే చాలా పొరబడుతున్నారు. మీ మిత్రునికో శత్రువున్నాడు. అతనే ఆ హత్య చేశాడు. ఇక బయలుదేరుదామా?"

నా శరీరం చల్లబడింది. అతి కష్టంమీద గుండె కొట్టుకుంటోంది.

పాల్‌ని హత్యచేశారా! నో, యిందులో పొరపాటు

వుంది. ఆరితేరిన డిటెక్టివ్‌ని తేలిగ్గా చంపడం ఎవరికీ సాధ్యంకాదు. కాని, పాల్‌కి ఇక్కడ శత్రువులెవరున్నారు?

"మిస్టర్ సుందర్, ఏ కృపాల్ గురించి మీరు మాట్లాడేది?"

"యువర్ పార్ట్‌నర్ అండ్ ఫ్రెండ్ మిస్టర్ కృపాల్" అన్నాడతను. "ఓహ్, మిస్టర్ అర్జున్, మిమ్మల్ని చాలా కంగారుపెట్టేస్తున్నాను. ఇందాకే మీరు బాత్‌రూంలో స్నానం చేసి వచ్చారు, ఇప్పుడు చెమటలో చేస్తున్నారు!"

వంటికి పట్టిన చెమటని వణుకుతున్న చేతులతో తుడుచుకుంటూ అతనికేసి చూశాను.

"ఎలా మరణించాడు?" అడిగాను.

"మిస్టర్ అర్జున్, ఇక్కడేమీ నేను చెప్పలేను. మీ ప్రశ్నలకి హెడ్‌క్వార్టర్స్‌లో సమాధానాలు దొరుకుతాయి. వెల్? ఇక పదండి." అతను లేచి బయటకి నడిచాడు.

నేను బట్టలు వేసుకుని గదికి తాళంవేసి అతనివెంట నడిచాను.

కౌంటర్ ఆఫీసర్ మాకేసి అనుమానంగా చూశాడు. మేం ముందుకి సాగిపోయాం.

సుందర్ జీపు స్టార్ట్ చేశాక నేనెక్కి కూచున్నాను. సమయం రాత్రి ఎనిమిదిన్నరయింది. జీపు కొంతదూరము వెళ్ళేవరకూ మేం మాట్లాడుకోలేదు. ఆ తర్వాత నే నడిగాను, "నేనిక్కడ వున్నట్లు మీకెలా తెలుసు?"

"మేం పోలీసులమని మీకు తెలుసా?"

తల వూపాను.

"గుడ్. బెంగుళూరులో మీ ఆఫీసుకి ట్రంకాల్

చేశాం. మీరు హైద్రాబాదుకి బయలుదేరినట్లు మీ సెక్రటరీ చెప్పింది. ఆమె పేరు .... ఆమె పేరేమిటి?_నీరజ! నీరజకదూ?"

మళ్ళీ తల వూపాను.

"తీయని గొంతు!" భుజాలెగరేశాడతను. "మీరు హైద్రాబాదు కెళ్ళినట్లు ఆమె చెప్పింది కాబట్టి మేం రైల్వేస్టేషన్, ఏర్‌పోర్ట్, బస్‌స్టేషన్ చెక్ చేశాం. మీరు నాంపల్లి స్టేషన్‌లో దిగినట్లు తెలిసింది. మిమ్మల్ని ఆ హోటల్‌కి తీసుకెళ్ళిన ఆటో డ్రైవర్ మిమ్మల్ని మీ దగ్గరకు చేర్చాడు."

"గుడ్ జాబ్."

"హైదరాబాదు పోలీసుల గురించి మీకు తెలియదు, మిస్టర్ అర్జున్_"

"మరొక సందేహం వుంది."

"ఏమిటది?"

"బెంగుళూర్‌లో మా ఆఫీసుని మీరెలా ట్రేస్ చేయగల్గారు?"

"పాల్ జేబులోని విజిటింగ్ కార్డ్‌తో."

"హత్యగురించి మీరేమీ చెప్పలేరా?"

సుందర్ అడ్డంగా తల వూపాడు. "ఇన్‌స్పెక్టర్ డేవిడ్ ఆజ్ఞ నేను కచ్చితంగా పాటిస్తాను. ఆయన మిమ్మల్ని తీసుకరమ్మన్నారు, కాబట్టి తీసుకెళ్ళేంత వరకే నా డ్యూటీ. మీరు డిటెక్టివ్. అలా తొందరపడటం మంచిదికాదు. ఏమంటారు?"

నేనేమీ చెప్పలేదు. హెడ్‌క్వార్టర్స్ చేరేవరకూ ఎవరూ మాట్లాడుకోలేదు.

దారిలో పాల్ గురించే తీవ్రంగా ఆలోచించాను.

బెంగుళూరులో మేం డిటెక్టివ్ ఏజన్సీ ప్రారంభించి అయిదేళ్ళు గడిచాయి. మేం జంట డిటెక్టివ్‌లం. కానీ కేసులన్నీ అతనే పరిశోధిస్తాడు. అమోఘమైన అతని తెలివితేటలకి వివరాలు సేకరించి అందివ్వడమే నా పని. ఆ వివరాలతోనే అతని పరిశోధన సాగుతుంది. ఆ వివరాల నుంచే అతను 'క్లూస్' లాగుతాడు. ఆ క్లూస్ అన్నీ ఒక చోట చేర్చి మెదడుకి పని అప్పగిస్తాడు. చురుకైన అతని మెదడు క్షణాలమీద కేసుని తేల్చేస్తుంది. కేసు తేలి పోయిన రోజున నేను డిన్నర్ ఇవ్వాలి. అది మా ఆచారం.

కృపాల్‌కి ముప్ఫై అయిదేళ్ళు. కన్నడజాతికి చెందిన వాడు. కన్నడ, తెలుగు భాషలకి లిపిలో ఎంత దగ్గర సంబంధముందో, అంతకంటే దగ్గర సంబంధం మా యిద్దరిమధ్యా వుంది. అతను మామూలు ఎత్తు, మామూలు లావు వుంటాడు. గోధుమరంగు కళ్ళు. తెల్లటి శరీరవర్ణం. ప్రతిక్షణం సిగరెట్‌కి అలవాటుపడ్డ నల్లటి పెదవులు.

శనివారం నాడు అతడు అకస్మాత్తుగా అదృశ్య మయ్యాడు. అతని జాడ బెంగుళూర్ సిటీలో నేను కనుక్కోలేకపోయాను. సెక్రటరీ నీరజకూడ అతని ఆచూకీ గురించి ఏమీ చెప్పలేకపోయింది.

ఎవరికీ చెప్పకుండా అతనింతవరకూ ఎక్కడికీ వెళ్ళ లేదు. ఒకవేళ అలా వెళితే తర్వాత ఎక్కడనుంచో ఫోన్ చేసి ఫలానచోట వున్నట్లు తెలియజేస్తాడు.

శనివారం నాడు ఆఫీసుకి నేను లేని సమయంలో ఎవరెవరొచ్చారని నీరజని అడిగాను. ఆమె ముగ్గురు నలుగురు పరిచయమున్న క్లయింట్స్ పేర్లు చెప్పింది. ఆ ముగ్గురూ తమ కేసు విషయంలో సలహాతీసుకోడానికి

వచ్చారు గానీ, అవుట్ సైడ్ జాబ్ అప్పగించలేదు.

పాల్ కి తాగుడు అలవాటుంది. ఆ రోజు అన్ని బార్స్నూ గాలించి చివరకు అతడ్ని వెతికే ప్రయత్నాలు మానుకున్నాను.

పాల్ ఏదేనా అపాయంలో చిక్కుకోడమన్నది అసంభవం. అతడికి అపాయం కలిగించే వ్యక్తులు బెంగుళూర్ సిటీలో ఎవరూ లేరు. కమీషనర్ ఆఫ్ సిటీ పోలీస్ నుంచీ కానిస్టేబిల్ వరకు అందరూ అతనికి పరిచయస్తులే.

శనివారం రాత్రంతా నిద్రపట్టలేదు. ఆదివారం ఉదయం నీరజ ఆశ్చర్యకరమైన విషయం నా చెవిలో వేసింది. పాల్ కి గరల్ ఫ్రెండ్స్ వున్నారట.

ఈ విషయం నాకప్పటివరకూ తెలియదు. నీరజ నెల రోజుల క్రితమే కనిపెట్టిందిట. కానీ, నాతో చెప్పకుండా దాచింది. రహస్యాలు దాచడంలో ఆమెది అందెవేసిన చేయి. అందుకే ఆమె అంటే పాల్ కి అమితమైన ఇష్టం.

ఇక కేసు పూర్తిగా తేలిపోయింది! అనుకోకుండా అదృశ్యమైన నా మిత్రుడు ఏ గర్ల్ ఫ్రెండ్ తోనో కాలక్షేపం చేస్తుంటాడు.

ఆదివారం రాత్రి నేను సుఖంగా నిద్రిస్తుండగా ఫోను హాఠాత్తుగా అరిచి, నిద్ర పాడుచేసి, ఆ తర్వాత మెదడుని తినేసింది...

పాల్ హైదరాబాదునుంచి ట్రంకాల్ చేశాడు. వెంటనే నన్ను బయలుదేరి రమ్మన్నాడు. సోమవారం రాత్రి తొమ్మిదిన్నరకి సరోవర్ లో కలుసుకోమన్నాడు. ఒక ముఖ్యమైన కేసులో తను పని చేస్తున్నట్టూ, ఇది చాలా రహస్యంగా దర్యాప్తు చేయాలనీ, ఈ వ్యవహారంలో

కొన్ని లక్షలు ముట్టే అవకాశముందనీ చెప్పి, నేను మాట్లాడే అవకాశమియ్యకుండా లైను కట్ చేశాడు.

ఆ రాత్రంతా నిద్ర పట్టలేదు. ఆ కేసు ఏమిటా అని ఆలోచించడంలేదు. ఎన్ని లక్షలు ముడతాయా అని ఆలోచిస్తోన్నాను. ఫలితంగా ఎంత సమయం గడిచి పోయిందో తట్టలేదు. ఆలోచనల్లోంచి తేరుకుని గమనిస్తే ఉదయం ఎనిమిది గంటలైంది. సెక్రటరీ నీరజ ఈ పాటికి ఆఫీసులో వుంటుంది. ఫోన్ చేసి విషయం చెప్పాను. ఆ తర్వాత ట్రైన్‌లో హైద్రాబాదుకి బయలుదేరాను.

పాల్ హైద్రాబాద్‌లో ఎక్కడ బసచేసాడో చెప్పలేదు. కానీ ఫలానాచోట కలుసుకోమన్నాడు. మరో గంటలో అతడ్ని కలుసుకుంటాననగా ఈ పోలీస్ సార్జెంట్ నన్ను కలుసుకోడం విచిత్రంగా వుంది.

పాల్ శవాన్ని చూసేవరకూ నేను సార్జెంట్ మాటలు నమ్మదలచలేదు.

హెడ్ క్వార్టర్స్ సమీపిస్తోండగా సార్జెంట్ అన్నాడు.

"మిస్టర్ అరుణ్, ఈ హైదరాబాదు పోలీసులగురించి —నో—ఇన్‌స్పెక్టర్ డేవిస్ గురించి మీకేమీ తెలియదు! నాకంతా తెలుసు. ఆయనకి కోపం ఎక్కువ, జాగ్రత్త! మీరు డిటెక్టివ్ అయినా కమీషనరు అయినా ఆయన ముందు అందరూ సమానులే. ఆయన అడిగే ప్రశ్నలకి మీరు సమాధానాలివ్వాలి. ఆయన మీతో మాట్లాడుతున్నప్పుడు మీరు డిటెక్టివ్‌నన్న విషయం మర్చిపోవాలి. ప్రశ్నలడక్కూడదు! మీ రొక్క ప్రశ్న అడిగి చూడండి, ఆ తర్వాత మీరీ సిటీలో వుండరు. అర్థమైందా?"

"అంత కఠినుడా ఇన్‌స్పెక్టర్?" అడిగాను.

"మీరే తెలుసుకుంటారు. మరో విషయం, ఆయన ప్రశ్న అడుగుతున్నప్పుడు మీరు నేలకేసి చూస్తూ సమాధానాలివ్వాలి. ఆయన ముఖాన్ని చూడకూడదు."

"ఐ పిటీ హిమ్!" అన్నాను. "మీ ఇన్‌స్పెక్టర్ ఏదో కాంప్లెక్స్‌తో సతమతమవుతున్నాడనుకుంటాను?"

"ఆయనకి డిటెక్టివ్‌లూ, రచయితలూ నచ్చరు!"

"దటీజ్ ది పాయింట్. నేనీ సిటీకి వచ్చి అయిదేళ్ళు గడిచాయి. ఇక్కడి పోలీసులతో నాకనుభవం లేదు. సార్జెంట్ ఇక్కడి పోలీసులందరూ డేవిడ్‌లాగే వుంటారా?"

"అందరి మనస్తత్వాలూ ఒకేలాగ వుంటాయా?"

"వుండవు. ఉదాహరణకు మీరే. మీ ఇన్‌స్పెక్టర్ ఎంత కఠినుడో మీరంత మాటకారి."

"మీతో ఏకీభవిస్తాను." అన్నాడు సుందర్.

హెడ్‌క్వార్టర్స్ చేరుకున్నాక సుందర్ వర్ణించిన డేవిడ్‌ని నేనెలా ఎదుర్కొంటానా అని కంగారు పడ్డాను. నేనూ, సుందర్ ఒక గదిలోకి అడుగు పెట్టాక చూసిన దృశ్యం ఎవరినైనా ఉలిక్కిపడేలా చేస్తుంది.

తెల్లటి వెంట్రుకలతో, పిల్లి కళ్ళతో, తెల్లగా ఆరడుగుల ఎత్తు వున్న ఇన్‌స్పెక్టర్ డేవిడ్ తన చేతిలోవున్న సీతాకోక చిలక రెక్కలు విరుస్తున్నాడు.

ఆ దృశ్యం చూశాక వెనక్కి తిరిగి వెళ్ళిపోదామనుకున్నాను. కానీ వెనకవున్న సుందర్ వారించాడు.

తీరిగ్గా రెక్కలు విరుస్తున్న డేవిడ్ నిముషం గడిచినా మా ఉనికి పసిగట్టలేదు. నేను సరాసరి అతని

దగ్గరికి వెళ్ళి అతని ముఖంలోకి నవ్వుతూ చూసి, "గుడ్ మార్నింగ్ సర్" అన్నాను వినయంగా,

డేవిడ్ విసురుగా చెయ్యెత్తి ఆ కీటకాన్ని నాముఖం మీదికి విసిరి చెంప మీద గట్టిగా చరిచాడు. నేను తూలి వెనక కుర్చీలో పడ్డాను.

కోపంతో ఎర్రబడ్డముఖంతో నన్ను చూసి సుందర్ తో అన్నాడు డేవిడ్. "హూ ఈజ్ దిస్ ఫెలో!"

"మిస్టర్ అరుణ్. ఎ ప్రైవేట్ డిటెక్టివ్ ఫ్రం బెంగుళూర్ అండ్ మిస్టర్స్ కృపాల్స్ ఫ్రెండ్" గబగబ అప్పజెప్పాడు. సుందర్ నేల చూపులు చూస్తూ.

"డిటెక్టివ్!" హేళనగా అన్నాడు డేవిడ్ వెటకారంగా నవ్వుతూ.

"యస్" అన్నాను నేను.

"ఇక్కడ నీకేం పని?"

"సార్జెంట్ తీసుకువచ్చాడు."

"డామిట్!"! అతని చెయ్యి నాపైకి లేచింది. కానీ వెనక్కి తిరిగి బల్లమీద ఒక్కగుద్దు గుద్దింది. "ఈ సిటీకెందు కొచ్చావని అడుగుతున్నాను."

"మిస్టర్ డేవిడ్, డిటెక్టివ్ లు పోలీసులకి శత్రువులు కాదు. నన్ను కొట్టే అధికారం మీకు లేదు. నా స్థానంలో ఇప్పుడు నా మిత్రుడు వుంటే..."

నా మాటల్ని తుంచేస్తూ డేవిడ్ అర్చాడు, "వాడ్డూ యూ సే? యూ బ్లడీ."

"నెవర్ మైండ్." ప్రశాంతంగా అన్నాను. "ఇన్స్పెక్టర్, నాకు పాల్ ని చూపిస్తారా?"

డేవిడ్ ఆగ్రహాన్ని అదుపులో వుంచుకునేందుకు

తీవ్రంగా ప్రయత్నిస్తూ టేబిల్ మీద పిడికిలి బిగించి మరోసారి గుద్దాడు.

"ఇన్‌స్పెక్టర్, మీరు ఫ్రస్ట్రేషన్ కాంప్లెక్స్‌కి గురయ్యారు." అన్నాను నెమ్మదిగా.

"ఏమిటి నువ్వనేది?" గర్జించాడతను.

"మీరు నిరాశా భావంతో బాధపడుతోన్నారు."

డేవిడ్ ఛటుక్కున సుందర్ దగ్గరికి వెళ్ళి, "గెట్ దిస్ బిచ్ అవుటాఫ్ హియర్ అండ్ షో హిమ్ ది కార్ప్స్!" అంటూ అర్చాడు.

"యస్, సర్" అని బయటికి నడిచాడు సుందర్. అతని వెనక నేను వెళ్ళాను.

మూడు గదులు దాటి నాల్గవ గదిముందు ఆగాక సుందర్ నా ముఖానికేసి ఎగాదిగా చూశాడు కోపంగా. నేను నవ్వాను.

"కష్టాల్ని కొని తెచ్చుకున్నారు." అన్నాడతను కర్కశంగా.

"డిటెక్టివ్‌ల వృత్తి అపాయకరమైనది." అన్నా న్నేను.

ఇద్దరం గదిలోకి నడిచాం. టేబిల్ పైన తలవరకు గుడ్డకప్పిన శవంవుంది. సుందర్ ముఖంమీద గుడ్డ తొలగించి శవాన్ని చూపించాడు. నేను కెవ్వుమని అరుస్తూ వెనక్కి దూకాను. వెంటనే వసారాలో బూట్ల చప్పుడు విన్పించి.

"మీ ప్రాణమిత్రుడుకదూ?" సుందర్ అడిగాడు.

నా కాళ్ళు నేలకి అతుక్కుపోయాయి. శరీరం గజ గజ వణుకుతోంది. గొంతు ఎండిపోయింది. వెన్నులోంచి చలి పుట్టుకొస్తోంది.

డేవిడ్ లోనికి వచ్చాడు. నన్ను చూసి హేళనగా నవ్వి, "ఆక్సిడెంట్‌లో చనిపోయాడు." అన్నాడు.

"ఆక్సిడెంట్! అదెలా జరిగింది?" అతని చేతులు పట్టుకుని అడిగాను.

"కారు కింద తలపెట్టాడు." అన్నాడు డేవిడ్.

"ఏమిటి మీరనేది? సుసైడ్?"

"చూసిన వారు అలా చెప్పడం లేదు, డియర్ యంగ్ బాయ్." అన్నాడు డేవిడ్, సిగరెట్ వెలిగించి "ఆక్సిడెంట్ లిబర్టీ కాంపౌండ్ దగ్గర జరిగింది. వెనక నుంచి ఓ పడవలాటి కారువచ్చి గుద్దింది. అతను అక్కడి కక్కడే."

"పడవలాటి కారు?"

"దటీజ్ రైట్!"

"ఇంపాలా?"

"తెలియదు."

"ఎవరూ చూడలేదా?"

"చూశారు కొందరు ఇంపాలా. కొందరు మెర్సిడిస్ మరికొందరు."

"నెంబర్ ఎవరూ చూడలేదా?"

"ఎవరూ చూడలేదు. దటీజ్ బాడ్‌లక్! లుక్ బాయ్, ఈ కేసులో నీ జోక్యం అనవసరం."

ఉలిక్కిపడి చూశాను డేవిడ్‌ని. అతను నా ముఖం మీదికి సిగరెట్ పొగ గుప్పుమని వదిలాడు.

"అది నీ హెల్త్‌కి మంచిది." అన్నాడతను.

నేను చిన్నగా నవ్వి జేబులోంచి స్టేట్ ఎక్స్‌ప్రెస్ తీసి వెలిగించి, విలాసంగా పొగవదులుతూ అన్నాను, "నా హెల్త్‌కి ఏది మంచిదో నాకు తెలుసు మీ హెల్త్‌కి

క్రోధం మంచిది కాదు.''

''అంటే?'' అన్నాడతను కళ్ళు చిట్లించి. సుందర్ భయంగా చూస్తున్నాడు నాకేసి.

''కోపం.'' అన్నాను మరోసారి పొగవదిలి, ''మీరు నవ్వుతూ మాట్లాడలేరా?''

''డామిట్! షటప్ అండ్ గెటవుట్!''

''ఫ్రస్ట్రేషన్ కాంప్లెక్స్?''

డేవిడ్ హఠాత్తుగా పిడికిలి బిగించి నా కడుపులో గుద్దాడు. బాధతో మెలికలు తిరుగుతూ నేలమీద పడ్డాను. అతనువంగి నా జేబులోంచి సిగరెట్ పాకెట్ లాక్కొని, ''మానర్ లెస్ బ్రూట్.'' అన్నాడు.

నేను నెమ్మదిగా లేచి నిలబడి గోడ కానుకున్నాను. కడుపులో బాధతో ఆయాసం వస్తోంది. వళ్ళంతా చెమటలు పట్టింది.

''ఈ సిటీ కెందుకొచ్చావ్. చెప్పు!'' అన్నాడతను నా దగ్గరికి వచ్చి.

''పాల్ రమ్మన్నాడు.''

''పాల్ ఇక్కడి కెందుకొచ్చాడు? వై?''

''చావడానికి.''

''అయితే నువ్వూ చావు!'' అంటూ నా కడుపులో మళ్ళీ గుద్దాడు. డేవిడ్ నేను కోపం పట్టలేక చెయ్యెత్తి ఇన్‌స్పెక్టర్‌ని కొట్టబోయాను. అతను నా చెయ్యి పట్టుకుని మెలేసి, ''నీకు లా తెలుసా?'' అనడిగాడు.

''ఇన్‌స్పెక్టర్, నా సహనాన్ని పరీక్షిస్తున్నారు!'' అన్నాను ఆవేశంగా.

''ఈ దారుణం నేను సహించలేను. మీ ప్రవర్తన నాకేమీ అర్థం కావడంలేదు. మరోసారి మీ చెయ్యి

నన్ను తాకితే నేను కమీషనర్ దగ్గరికి వెళ్ళవలసి వస్తుంది. మీ అసమగ్రతని సమర్థించుకునేందుకు నా పైన దౌర్జన్యం చేసి తృప్తి చెందకండి...లైసెన్స్‌డ్ డిటెక్టివ్‌ని అకారణంగా కొట్టేందుకు మీకు అధికారం లేదు!"

నా ఉపన్యాసం విని రెండు క్షణాలు తీక్షణంగా చూశాడు డేవిడ్.

"వెల్, వెల్, వెల్, మై బాయ్!". అన్నాడతను నవ్వుతూ.

"నువ్వు పొలిటికల్ లీడర్‌వి గావు! అవునా? దటీజ్ రైట్, ఇకముందు ఇలాంటి ఆవేశ పూరిత ఉపన్యాసా లిచ్చి నన్ను గాభరా పెట్టకు ఏమంటావు?"

"మీ గదిలోకి వెళ్ళి మాట్లాడుకుందాం" అన్నాను.

డేవిడ్ నా వీపుమీద గట్టిగా చరిచి, "కమాన్!" అన్నాడు.

ఎర్రబడ్డ ముఖంతో నేను కోపంగా చూశాను.

## 2

ఇన్‌స్పెక్టర్ డేవిడ్ సిగరెట్ పాకెట్ నాకు తిరిగి ఇచ్చేస్తూ, "భయపడే వాళ్ళకి నేను శత్రువులా కన్పి స్తాను." అన్నాడు.

"నా కెదురు తిరిగిన వాళ్ళకి మిత్రుడిలా కన్పిస్తాను. మైడియర్ బాయ్, ఇక మనిద్దరం మిత్రులం నువ్వేదో కాంప్లెక్స్ అంటున్నావు...అలాంటి దేమీ నాకు లేదు. నాకు డిటెక్టివ్‌లూ, డిటెక్టివ్ రచయితలూ నచ్చరు. ఏ మాత్రం సత్తువ లేని ప్రతి డిటెక్టివూ ఒక షెర్లాక్ హోమ్స్‌లా కన్పించడానికి ప్రయత్నిస్తాడు. నిన్నూ ఇలాగే అంచనా వేసి నీ అసలు రూపమేమిటో తెలుసు

కున్నాను. నీ మీద ఇప్పుడు నాకు నమ్మకం కుదిరింది."

"థాంక్స్."

"నాపైన నీ కెలాంటి దురభిప్రాయమూ లేదు కదా!"

"లేదు."

"వ్యక్తిగతంగా కక్ష లేదు కదా!"

"లేదు."

"అయితే సన్నద్ధం చేసుకున్నావు. గుడ్ ఇక ప్రస్తుత పరిస్థితి గురించి మాట్లాడుకుందాం. పాల్ నీ ఫ్రెండ్ అన్నావు కదూ?"

తలూపాను.

"పాల్ ఇక్కడికెందు కొచ్చాడో ఇకనైనా చెప్తావా?"

"చెప్పలేను."

"నిన్నెందుకు పిల్చాడో చెప్తావా?"

"చెప్పలేను."

"మైడియర్ యంగ్ డిటెక్టివ్, పాల్ ఇక్కడి కెందు కొచ్చాడో తెలిస్తే తప్ప కేసుముందుకు సాగదు!"

"ఎందు కొచ్చాడో మీరు వూహించ లేదా?"

"ఎలా?"

"పాల్ డిటెక్టివ్, అతని వృత్తి నేరాల్ని పరిశోధించటం. ఇప్పుడతను ఇక్కడి కెందు కొచ్చాడో అర్థమెందను కుంటాను?"

"అర్థమైంది. నువ్వు చెప్పనవసరం లేదు. నా ప్రశ్న నీ కర్థంగా లేదు. వెల్, నీకర్థమెయేలా నే నడగలేదు. పాల్ ఏదో కేసు దర్యాప్తు చేయడానికి ఇక్కడి కొచ్చాడని వూహించగలను. కానీ ఆకేసు ఏమిటో వూహించ లేను, మిస్టర్ అరుణ్."

"నేనూ వూహించలేను."

"మనమిలా దాగుడుమూత లాడుతుంటే కేసు కదలదు!" డేవిడ్ బెదిరించాడు.

నేను రెండు క్షణాలు ఆలోచించాను. పాల్ ఏ కేసుని దర్యాప్తు చేస్తున్నాడో ఎవరికి తెలుసు? నాకు తెలియకుండా రహస్యంగా ఈ కేసుని ఒప్పుకునేందుకు కారణం ఏమిటి? చట్టవిరుద్ధమైన పనికి ఒప్పుకున్నాడా లేక క్లయింట్ కోరికపైన ఆ విషయాన్ని రహస్యంగా వుంచాడా? ఆ క్లయింట్ ఎవరు? అతను బెంగుళూరులో వున్నాడా లేక, హైదరాబాదులో వున్నాడా?

"మిస్టర్ డేవిడ్, మీతో దాగుడు మూతలాడడంలో నాకెలాటి ప్రయోజనమూ లేదు" అన్నాను చివరికి. "పాల్ ఇంతవరకు ఇలా ఎన్నడూ చేయలేదు. అవుట్ సైడ్ జాబ్ చూసేది నేను. అతనికి ఆఫీసు కదిలే అవసరం లేదు."

"బ్రతికి వుండగా పాల్‌ని నువ్వు చివరిసారిగా ఎప్పుడు చూశావు?"

"శుక్రవారం రాత్రి."

"శనివారం ఉదయం కన్పించలేదా?"

"లేదు."

"అయితే శనివారం ఉదయం ఇక్కడికి బయలుదేరాడు. అంటే శుక్రవారంరాత్రి బెంగుళూరులో అతడిని ఎవరో కలుసుకున్నారు. ఆ వ్యక్తి ఎవరు?"

"తెలియదు ఇన్‌స్పెక్టర్" అన్నాను. "పాల్ ఎక్కడ బస చేశాడో కనుక్కున్నారా!"

డేవిడ్ తలవూపి, "రాజధాని హోటలులో" అన్నాడు. "అతని పర్సులో హోటలుబిల్లు కన్పించింది."

సొరుగులోంచి పాల్ పర్సుతీసి అందులోంచి ఒక చిన్న కాయితం ముక్క తీసి టేబిలుపైన పర్చాడు డేవిడ్.

గది అద్దె చెల్లించిన తాలూకు రశీదు అది. గది శని వారం మధ్యాహ్నం ఒంటిగంటకి అద్దెకి తీసుకుని, ఆది వారం సాయంత్రం ఆరు గంటలకి తిరిగి అప్పగించాడు.

కానీ సోమవారం సాయంత్రం వరకూ ఎక్కడ వున్నాడు?

నా సందేహాన్ని డేవిడ్ కి వెలిబుచ్చాను.

డేవిడ్ ఇలా అన్నాడు:

"పాల్ శనివారం మధ్యాహ్నం 'రాజధాని'లో గది తీసుకుని ఆదివారం సాయింత్రం ఖాళీ చేశాడు. వెల్, తిరిగి అదేరోజు రాత్రి మళ్ళీ తీసుకున్నాడు. అప్పటినుంచీ మరణించేవరకు ఖాళీ చేయలేదు. నే నా గదిని చెక్ చేశాను. నో క్లూస్!"

"తాళం చెవి ఎక్కడ వుంది?"

"కావాలా?"

తల వూపాను. అతను సొరుగులోంచి ఒక తాళం చెవి తీశాడు. నేను దాన్ని అందుకుని జేబులో వేసుకుని, "నేనొకసారి ఆ గదిని చెక్ చేస్తాను" అన్నాను.

డేవిడ్ తల వూపాడు.

"ఇన్స్పెక్టర్, ఆక్సిడెంట్ ఎలా జరిగిందో వివరి స్తారా?" అడిగాను లేచి నిలబడి.

డేవిడ్ గట్టిగా వూపిరిపీల్చి వదిలాడు. ఆ తర్వాత అన్నాడు:

"సోమవారం మధ్యాహ్నం లిబర్టీలో 'ఫిమర్ ఓవర్ ది సిటీ' మాట్నీ చూసి బయటకి వచ్చాడు పాల్,

సమయం సాయంత్రం అయిదున్నరయింది. జీన్ పాల్ అంటే పడిచచ్చే జనం చాలామంది వున్నారిక్కడ.

ఆ రోజు మాట్నీ హౌస్ ఫుల్ అయింది. కాబట్టి ఆట వదిలాక బయట విపరీతమైన రద్దీ ఏర్పడింది. ఆ రద్దీలో పాల్ కి టాక్సీగానీ, ఆటోగానీ దొరకలేదు.

జనం పూర్తిగా పలచబడ్డా అతను అక్కడే ఆటో కోసం ఎదురు చూస్తున్నాడు. కాస్సేపయాక హిమాయత్ నగర్ వేపు నడక ప్రారంభించాడు. ఇంతలో వెనకనుంచి ఒక 'పడవ' లాటి కారు దూసుకవచ్చి అతడ్ని ఢీకొని ఒక్కక్షణం ఆలస్యం చేయకుండా తప్పించుకుంది.

అక్కడ ప్రత్యక్షంగా ఆ దృశ్యం చూసిన వారెవరూ ఆ కారుగురించి ఏమీ చెప్పలేకపోతున్నారు. అఫ్ కోర్స్, మేం అక్కడికి చేరుకునేసరికి ఆక్సిడెంట్ చూసినవాళ్లెవరూ లేదు. నెమ్మదిగా జారుకున్నారు. వాళ్ళకి సాక్ష్యం ఇవ్వడానికి భయం. నేరస్తులకంటే ముందు పారిపోడానికి ప్రయత్నిస్తారు.

ఆక్సిడెంట్ ప్రదేశాన్ని ఫోటోలు తీశాం. శవాన్ని తీసుకవచ్చేశాం. నువ్వీ శవాన్ని గుర్తించేవరకు పోస్ట్ మార్టమ్ చేయకూడదని నిశ్చయించుకున్నాం."

"ఇన్స్పెక్టర్, ఇది ఆక్సిడెంట్ కాదు, మర్డర్. ఏమంటారు?" అడిగాను.

డేవిడ్ ఆలోచిస్తోన్నాడు.

"ఇన్స్పెక్టర్," మళ్ళీ అన్నాను. "లిబర్టీ నుంచి హిమాయత్ నగర్ వెళ్ళే రోడ్డుని వివరిస్తారా? రోడ్డు విశాలంగా వుంటుందా? ట్రాఫిక్ అధికంగా వుంటుందా? పేవ్ మెంట్ వుందా?"

డేవిడ్ అన్నాడు, "ఆ రోడ్డు విశాలంగా వుంటుంది,

కానీ చిక్కడపల్లి, నారాయణ గూడలో వుందేంకా ట్రాఫిక్ వుండదు. పేవ్ మెంట్ వుంది గానీ, పాల్ ట్రాఫిక్ రూల్సు పాటించరేదు. రోడ్డుమీద నడుస్తున్నాడు.''

''ఆ కారుని మీ రెలా పట్టుకోదల్చారు?''

దేవిడ్ గర్వంగా నవ్వాడు. ''ఏమిటి, నేను స్వయంగా ఆలోచించలేననుకున్నావా? పారిపోయిన సాక్షుల్ని ఆకర్షించి పంజరంలో బంధించే ప్లానొకటి తయారుచేశాను. రేపుదయం పత్రికల్లో ఈ ప్రకటన నీకు కన్పిస్తుంది. జాగ్రత్తగా విను: సోమవారం సాయంత్రం సుమారు అయిదున్నరగంటల ప్రాంతాల లిబర్టీ దగ్గర జరిగిన ఆక్సిడెంట్ గురించి సరైన వివరాలు అందించిన వారెవరైనా సరే వెయ్యిరూపాయల బహుమతికి అర్హులు.

అందించవలసిన వివరాలు:- ఆక్సిడెంట్ చేసిన కారు వివరణ, నెంబరు. ఆక్సిడెంట్ జరగేందుకు దోహదంచేసిన పరిస్థితులు. ఇది అనుకోని విధంగా డ్రైవరుపొరపాటువల్ల జరిగిన ఆక్సిడెంటా లేక, పథకం ప్రకారం చేసిన ఆక్సిడెంటా?...సో అండ్ సో. ఈ వివరాలన్నీ మీరు నేరుగా రాష్ట్ర క్రైంబ్రాంచ్ శాఖకుగాని, లేక మీ చేరువలో వున్న ఏ పోలీస్ స్టేషన్ కైనా గానీ అందించాలి - దట్సాల్.''

ఈ ప్రకటన దేవిడ్ రేడియో అనౌన్సర్ స్టయిలులో చెప్పాడు.

''బాగుంది.'' అన్నాను.

''ఈ హిట్ - అండ్ -రన్ కేసు మీ రెలా దర్యాప్తు చేస్తారో చెప్పమని ప్రెస్ రిపోర్టర్స్ ప్రాణాలు తీయగా వాళ్ళకీ ప్రకటన ఇచ్చి తృప్తిపరచాను.'' అన్నాడు

డేవిడ్.

ఆ తర్వాత నేను సెలవు తీసుకుని బయటకి వచ్చేశాను. ఆవరణదాటి రోడ్డెక్కుతోండగా వెనకనుంచి సుందర్ పరిగెత్తుకొచ్చాడు. నా చేతులు పట్టుకుని, "మీరు చాలా సాహసం చేశారు!" అన్నాడు కళ్ళు పెద్దవిచేసి.

నేనతడి భుజంతట్టి, "మేం స్వయం ప్రతిపత్తిగల నేరపరిశోధకులం." అన్నాను, "మేం ఎవరి ఆదేశాలనీ లక్ష్యపెట్టనవసరం లేదు. ఎవరికీ భయపడనవసరంలేదు. మీరు మీ అధికారికి భయపడకపోతే ఉద్యోగం వుండదు."

సుందర్ మెరుస్తున్న కళ్ళతో చూస్తూ, "ఐ కంగ్రాచ్యులేట్ యూ!" అన్నాడు. నేను 'థాంక్స్' చెప్పి బయలుదేరాను.

## 3

బేరర్ బిల్లు తెచ్చిపెట్టాడు. నేను ఇరవై రూపాయల నోటు అందించి పొమ్మన్నట్టు సైగ చేశాను. హెడ్ క్వార్టర్స్ నుండి బయలుదేరినప్పటినుంచీ మనసంతా అస్వస్థంగా తయారైంది.

మాటిమాటికీ పాల్ రూపం కళ్ళముందు మెదులుతోంది.

పాల్ నవ్వని క్షణంలేదు. చిరునవ్వే అతని ఆయుధం. మంత్రించినట్టు వుండే తన చిరునవ్వుతో నేరస్తుల్ని పట్టుకోడం అతనికి చాలా తేలిక. అతని కళ్ళలోకి సూటిగా చూస్తే మీరు హిప్నటిజానికి గురికాగలరు!

సార్జెంట్ శవంమీద గుడ్డ తొలగించినప్పుడు నేను చూసిన దృశ్యాన్ని వర్ణించలేను.

అమోఘమైన తెలివితేటలతో నిగూఢ రహస్యాల్ని

ఛేదించకల పాల్ తల పచ్చడయింది. అతని నల్లటి పెద్ద వుల్ని చూస్తే తప్ప పాల్ అని గుర్తించలేం! కపాలం పగిలి మెదడు భాగాలన్నీ బయటికి వచ్చాయి. ముఖం నిండా రక్తం గడ్డకట్టుకుంది.

ఎంత ప్రయత్నించినా ఆ దృశ్యాన్ని మనసులోంచి తొలగించలేక పోతున్నాను. ఆకలి చచ్చిపోయింది. ఇటువంటి పరిస్థితిలో విస్కీ సేవిస్తేగానీ మనిషిని గాలేను. కాబట్టి బార్‌లో కూచున్నాను.

ఇది ఆక్సిడెంట్ కాదు, హత్య అని స్పష్టమవుతోంది. ఈ సిటీలో పాల్‌కి శత్రువులు లేరు. అతని క్లయింట్‌కి చెందిన వ్యక్తులు తప్ప! ఆ క్లయింట్ ఎవరో తెలుసుకోడం ఒక సమస్యగా మారింది.

నన్ను ఆ క్లయింట్ దగ్గరికి చేరవేసే క్లూ ఏదైనా పాల్ వదిలాడా?

బెంగుళూరులో నా కెలాటి క్లూ దొరకదన్నది నిశ్చయం!

ఇక్కడ క్లూస్ సంపాదించేందుకు ఎలాటి ప్రయత్నాలు చేయాలో అర్థంకావడంలేదు. ఇన్‌స్పెక్టర్ ఆ కారుని ట్రేస్ చేసేవరకు నేను సహనం వహించలేను.

నా మిత్రుని చంపిన శత్రువుని వీలైనంత త్వరలో పట్టుకుని, శవాన్ని తీసుకుని బెంగుళూరు కెళ్ళిపోవాలి.

పాల్ హోటల్ రూమ్ ఖాళీచేసి మళ్ళీ ఎందుకు తీసుకున్నాడు? అతడు ఎవరికీ తెలియకుండా బెంగుళూరు విడిచాడు. ఇక్కడ తను చేయవలసిన కార్యం ఆదివారం సాయంత్రానికల్లా పూర్తిచేశాడు. అతనికెవరి సహాయమూ అవసరం లేకపోయింది. పని ముగిశాక రూం ఖాళీ చేశాడు. కానీ మళ్ళీ బుక్ చేశాడు. ఎందుకు?

అతను కనుక్కొన్న వివరాలు, లేదా పూర్తి చేసినపని అప్‌సెట్ అయింది. అతనికి నా సహాయం అవసరమని పించింది. అందుకే నాకు ట్రంకాల్ చేశాడు! అందుకే రూమ్ మళ్ళీ బుక్ చేసుకున్నాడు!

ఛటుక్కున లేచి, బార్‌లోంచి బయటికొచ్చి ఆటో వాడికి సైగచేసి, 'రాజధాని'కి పోనివ్వమన్నాను.

ఏడు నిముషాల్లో హోటల్ చేరుకుని, ఆటోవాడికి ఫేర్ చెల్లించి చకచక లోనికి నడిచాను. కౌంటర్‌లో వున్న క్లర్క్ నన్ను కస్టమర్ అనుకుని ఆహ్వానించాడు. అతని ముఖంలో చిరునవ్వు నేను నా ఐడెంటిటీ కార్డు చూపించినంత సేపేవుంది. ఛటుక్కున వెనక్కి జరిగి, "డిటెక్టివ్?" అన్నాడు ఆశ్చర్యపోతూ.

నేను అవునని చెప్పి, ఇన్‌స్పెక్టర్ డేవిడ్, పాల్ గది సోదా చేసిన విషయం అడిగాను.

"సర్, మిస్టర్ పాల్ ఎక్కడ వున్నారో, ఆయన కేమయిందో మా కంతుబట్టడం లేదు. మీ పోలీసుల రాక పోకలు చూస్తే ఆయన స్మగ్లింగ్ బిజినెస్‌లో వున్నారా అనిపిస్తోంది. ఈ మధ్య సిటీలో హషీష్ వ్యాపారం జోరుగా సాగుతోందని—" అతని మాటలకి అడ్డుతగిలి నేను అన్నాను, "మిస్టర్ పాల్ డిటెక్టివ్ అని మీకు తెలియదా? డిటెక్టివ్‌ని హత్యచేయడమన్నది పోలీసు అధికారిని చంపడంతో సమానం. మిస్టర్...?"

"జోగిందర్"

"మిస్టర్ జోగిందర్, డిటెక్టివ్ కృపాల్ హత్య చేయబడ్డాడు. ఇది చాలా సీరియస్ కేసు, మీరు నాతో సహకరిస్తారా? పాల్ నా ఫ్రెండ్."

అంతవరకూ ఆశ్చర్యంగా వింటోన్న క్లర్క్ జోగిందర్,

సన్నగా వణుకుతూ అస్పష్టంగా గొణిగాడు, "మర్డర్!"

"నేను రిజిస్టర్ చెక్ చేయాలి" అన్నాను.

అతను షాక్ నుంచి తేరుకుని రిజిస్టర్ తెరిచాడు.

రిజిస్టర్‌లోని వివరాలు కాయితం ముక్క మీద వ్రాసుకున్నాను.

పాల్ శనివారం మధ్యాహ్నం ఒంటిగంటకి రూం తీసుకున్నాడు. బిజినెస్ పనిమీద బెంగుళూరునుంచి వచ్చినట్టు అందులో వుంది. బెంగుళూరులో ఇచ్చిన అతని అడ్రసు తప్పుడు అడ్రస్. ఆటోమోబైల్ బిజినెస్ డీల్ చేస్తున్నట్టు ఆ రిజిస్టర్‌లో వుంది. ఆ తర్వాత, ఆదివారం సాయంత్రం రూం ఖాళీ చేసినట్టువుంది.

జోగిందర్ మరో పేజీ తిప్పాడు.

ఆదివారం రాత్రి తొమ్మిది గంటలకి మళ్ళీ రూమ్ బుక్ చేసినట్టు అందులో వుంది.

"జోగిందర్, అతన్ని ఎవరైనా ఇక్కడ కలుసుకునేవారా?" అడిగాను.

"లేదు."

"ఫోన్ కాల్స్?"

"నో ఫోన్ కాల్స్. ఈ హోటల్లో వుండగా ఆయనకి ఒక్కసారికూడా ఫోన్ కాల్ రాలేదు. ఆయనకూడా ఫోన్ వుపయోగించలేదు. సర్, ఈ సిటీ ఆయనకు కొత్త అనుకుంటాను."

"ఆ అనుమానం ఎందుకొచ్చింది?"

"ఈ రోజు ఉదయం ఆయన లిబర్టీ థియేటర్ ఎంత దూరంలో వుందని అడిగారు."

"వెల్, అతను తరచు బయటికి వెళ్ళేవాడా, గదిలోనే వుండేవాడా?"

"పగలంతా గది కదిలేవాడు కాదు. రాత్రంతా బయట వుండేవారు. ఆయన బిజినెస్ నాకర్థంకాలేదు. స్మగ్లర్ కావచ్చని అనుమానించాను."

"ఆదివారం రాత్రి గదిలో వున్నాడా?"

"లేరు. ఉదయం నాలుగు గంటల ప్రాంతాల వచ్చారు."

"థాంక్స్ జోగిందర్, నేనొకసారి రూం చూసి వస్తాను." అన్నాను జేబులోంచి తాళం చెవి తీసి.

"విత్ ప్లెజర్. రూమ్ ట్వంటీ ఫోర్" అన్నాడతను.

రూం ట్వంటీ ఫోర్ తలుపుని తాళంచెవితో తెరిచి లోనికి తొంగిచూశాను. చీకటిగా వుంది. తడుముకుంటూ లోనికెళ్ళి స్విచ్ నొక్కాను.

హఠాత్తుగా గదిలో పరుచుకున్న వెలుతురులో ప్రతి వస్తువూ యథాస్థానంలో కన్పించాయి. గది నీట్ గా అలంకరించి వుంది. ఫోంబెడ్, పక్కన టీపాయ్ పైన టెలిఫోన్, టెలిఫోన్ డైరక్టరీ, గది మధ్య సోఫాసెట్, గదికి పడమటివైపున బాత్ రూం, గదికి తూర్పు దిక్కున అద్దాల కిటికీలూ...

ఇవన్నీ నన్ను ఆకర్షించలేదుగానీ, బెడ్ మీద బ్రీఫ్ కేసు కొట్టొచ్చినట్లు కనబడుతోంది.

గబగబ అడుగులేసి బెడ్ పైన కూచుని బ్రీఫ్ కేసుని ముందుకి లాక్కున్నాను. పాల్ ఈ బ్రీఫ్ కేసుని స్విట్జర్లండ్ లో కొన్నాడు. ఇందులో ఒక రహస్యమైన అర వుంది. దాన్ని ఎవరూ కనిపెట్టలేరు, పోలీసులుకూడా! ఈ బ్రీఫ్ కేసు గురించి డేవిడ్ కు తెలియదు. కాబట్టి అతనికి ఏ క్లూ దొరకలేదు.

జరగబోన్న గాడ్ మర్డర్ కేసులో ఈ బ్రీఫ్ కేసు చాలా

ముఖ్యమైన పాత్ర వహించింది. పాల్ పొరపాటువల్ల అది నిందితుని చేతిలో పడింది. అందులోని రహస్యమైన అరలో నిందితుడ్ని పట్టిచ్చే సాక్ష్యం వుంది. బ్రీఫ్ కేసు నిందుతున్ని చేతిలోపడ్డా ఆ సాక్ష్యం మాత్రం చెక్కు చెదరకుండా వుంది, తిరిగి ఆ బ్రీఫ్ కేసుని సంపాదించే వరకూ.

బ్రీఫ్ కేసు క్లిప్స్ తొలగించి మూత తెరిచాను.

తెల్లటి షర్టు, నల్లటి ప్యాంటు కన్పించాయి. వాటిని తోసి బెడ్ పైన పెట్టాను. ఆ తర్వాత రెండుమూడు ఆంగ్ల పత్రికలు కన్పించాయి. వాటిని గబగబ తిరగేసి చూశాను. ఆధారాలేమీ దొరకలేదు. ఆ తర్వాత బ్రీఫ్ కేసులోని ఒక్కో వస్తువునీ తీయసాగాను. టూత్ బ్రష్, పేస్టు, షేవింగ్ సెట్... మొదలైనవి వున్నాయి.

బ్రీఫ్ కేసు ఖాళీ అయ్యాక 'రహస్యఅర' తెరిచాను. ఛెంగున ఎగిరిపడ్డాను. ఛటుక్కున లేచి తలుపులోపలి నుంచి గడియవేశాను. గుండె వేగంగా కొట్టుకోనారంభించింది. తడబడుతున్న అడుగులతో బెడ్ చేరుకుని బ్రీఫ్ కేసులోకి తొంగిచూశాను.

అదే! సందేహంలేదు, అదే క్లూ! వణుకుతున్న చెయ్యి బ్రీఫ్ కేసులోనికి కెళ్ళింది. ఆ క్లూని బయటికి తీశాను.

ఇర్వింగ్ వాలెస్ – "ది సెవెన్ మినిట్స్," ఆ పుస్తకంమీది అక్షరాలు కొట్టవచ్చినట్టు కనబడుతో న్నాయి. గబగబ పేజీలు తిరగేశాను. పేజీలమధ్య ఏమీ కన్పించలేదు. మొత్తం అయిదువందల తొమ్మిది పేజీలున్న ఆ పుస్తకాన్ని ఓపిగ్గా తిరగేయసాగాను. నాకేమీ అర్థంగావడం లేదు. ఈ పుస్తకంలో ఏముంది?

హఠాత్తుగా ఒకచోట నా చూపులు నిల్చాయి. 318 వ పేజీలో ఒక పేరాగ్రాఫ్ చుట్టూ గీత గీసివుంది. అందులో ఇలా వుంది:—

"She has no other person to speak to in a foreign country, to tell of her un-happy love or troubles or problems. Her family and friends were not in Paris. She was a stranger, an alien. She needed some one trust worthy and sympathetic with whom she might - how do you say? - get things off her chest. Because I was sympathetic, she confided in me, yes, and because I was sorry for her, I listened"

ఇది చదివాక నేను వేగంగా ఆలోచించాను. ఏమిటి దీని అర్థం? మళ్ళీ అకస్మాత్తుగా నా చూపులు మరోచోట నిలిచాయి. అదే పేజీ క్రిందిభాగంలో ఫుట్ నోట్ లో కొన్ని అంకెలున్నాయి: 622722. ఇవి ఇంకులో వ్రాయబడ్డాయి.

పనిచేయడం మానివేసిన నా మెదడు తక్షణం తన కర్తవ్యం గుర్తించి ఆ అంకెలు ఫోన్ నెంబర్ వి అని తెలుసుకుంది.

మరి ఆ పేరాగ్రాఫు అర్థమేమిటి?

వంటికి పట్టిన చెమట ఆరడానికి ఫుల్ స్పీడులో ఫ్యాను పెట్టి తిరిగి ఆలోచనల్లో పడ్డాను. ఈ క్లూ ఎంతో సందర్భానుసారంగా వుంది. ఈ క్లూ అతడ్ని కలుసుకున్న

క్లయింట్ గురించి వివరాలు వెల్లడిస్తోందనడంలో సందేహం లేదు.

ఈ పేరాగ్రాఫుని నేనిలా అనువదించి, పరిస్థితుల కనుగుణంగా అన్వయించాను:-

'తన విఫలమైన ప్రేమగురించీ, కష్టాలూ సమస్యల గురించీ చెప్పుకోడానికి ఆమెకి ఇలాటి పరాయి ప్రదేశంలో ఇంకెవరూ లేరు. ఆమె కుటుంబ సభ్యులుగానీ, స్నేహితులుగానీ బెంగుళూరులో లేరు. ఆమె ఈ సిటీకి కొత్త. పరాయి రాష్ట్రానికి చెందింది. తన గుండెలపైన బరువును తొలగించడానికి ఆమెకి సానుభూతి చూపించే, నమ్మకమైన మనిషి అవసరం వుంది. నాకు సానుభూతి వుంది కాబట్టి, ఆమె నన్ను నమ్మింది. అవును, ఆమెపై నాకు జాలి ఏర్పడింది కాబట్టి, ఆమె చెప్పింది విన్నాను.'

ఇప్పుడు నా మెదడు ఒక క్రమపద్ధతిలో ఆలోచిస్తోంది. ఈ క్లూ అందివ్వడానికి పాల్ కి సందర్భోచితమైన వివరణ దొరకడం నాకాశ్చర్యకంగా వుంది. బహుశ అతను పగలంతా గదిలో కూచోని ఈ పుస్తకం చదువుతోండగా తనకి వర్తించే ఈ పేరాగ్రాఫు ఎదురైందేమో, యధాలాపంగా పెన్నుతో చుట్టూ గీశాడు.

ఇది యధాలాపంగా జరిగి వుంటే ఈ పుస్తకాన్ని రహస్యంగా ఎందుకు దాచాడు? యీ పేజీ క్రింద ఫోన్ నెంబరు ఎందుకు వ్రాస్తాడు?

పుస్తకం మిగతా పేజీలు తిరగేశాను. ఒక చిన్న కాయితం ముక్క దొరికింది. అందులో కన్నడ భాషలో యిలా వుంది:

నా ప్రియమైన అర్జున్ ...

ఈ క్లూ ఏమిటో తెలుసుకున్నాక దాన్ని నాశనం చేయడం మరువక!

నాకింకా ఆశ్చర్యంగా వుందిప్పుడు. ఎలాటి పరిస్థితిలో అతను ఈ ఉత్తరం వ్రాశాడో నా కిప్పుడు బోధపడు తోంది. తన ప్రాణానికి మోసం వుందన్న అనుమానంతో పాల్ ఇలాటి పనిచేశాడు. ఈ క్లూ సహాయంతో నేను అతని శత్రువుని పట్టుకుంటానని అతని నమ్మకం. ఈ ఫోన్ నెంబర్ అతడ్ని కలుసుకన్న స్త్రీదా లేక, శత్రువుదా? తెలుసుకోడం కష్టమేమీ కాదు. కానీ తన ప్రాణాలమీద తనకే నమ్మకం లేకుండా పాల్ ఇలాటి కేసుని ఎందుకు చేబట్టాడు?

అతనికి ఆడవాళ్ళంటే చెప్పలేనంత జాలి. వారి కష్టాల్ని చూడలేడు.

అతడిని కలుసుకున్న స్త్రీ ఏవో చిక్కుల్లో పడింది. ఆమె గుండెలపై బరువు తొలగించడానికి తగిన మనిషి కావాలి.

ఏమిటా గుండెలపైన బరువు? బ్లాక్ మెయిల్? ఆమె ప్రేమలో విఫలమయి వుంటే ఎవరు బ్లాక్ మెయిల్ చేస్తారు? 'ప్రేమలో విఫలం' అంటే ఆమెని ప్రేమించిన వాడు మోసం చేశాడా? ఇప్పుడామె గర్భవతా? ఈ విషయం తెలుసుకుని ఎవరైనా బ్లాక్ మెయిల్ చేస్తున్నారా? అయితే ఆ బ్లాక్ మెయిలర్ పీడ తొలగించ బూనుకొన్నాడా పాల్.

ఏదేమైనా ఆ స్త్రీ ధనవంతురాలని వూహించుకో వచ్చు. ఈ కేసులో కొన్ని లక్షలు ముట్టే అవకాశం వుందని పాల్ నాతో ఫోన్ లో చెప్పాడు. లక్షలుముట్టే

కేను ఇంతవరకు మాకు తగల్లేదు. అందుకే పరుగుపెట్టి ప్రాణాలు పోగొట్టుకుని వుంటాడు పాల్.

ఆలోచనల్లోంచి తేరుకుని టెలిఫోన్ రిసీవర్ అందుకుని, పక్కన డైరక్టరీ చూసి విరమించుకుని రిసీవర్ పెట్టేశాను.

ఈ నెంబర్ హంతకుడిదైతే ఏం మాట్లాడాలి? ఆ స్త్రీదైతే ఏం మాట్లాడాలి? అవతల మాట్లాడేది ఎవరైనదీ తెలుసుకోడమెలా?

ఒక అయిడియా తట్టింది. ఇక అక్కడ్నుంచి వెళ్ళిపోవాలని నిశ్చయించుకున్నాను.

# 4

తిరిగి నా హోటల్ రూంకి చేరుకునే సరికి రాత్రి పదిన్నరయింది.

బట్టలు మార్చుకుని బెడ్ పైన మేనువాల్చాను. వేగంగా తిరుగుతోన్న సీలింగ్ ఫాన్ కేసి చూస్తూ మళ్ళీ ఆలోచించసాగాను.

పగలంతా గదిలో - రాత్రంతా బయట.

పాల్ ఇలా చెయ్యడానికి కారణమేమిటి? ఎక్కడికెళుతున్నాడు? ఎవరిని కలుసుకుంటున్నాడు? బ్లాక్ మెయిలర్ కి బుద్ధిచెప్పేందుకు రాత్రి సమయం ఎందుకు? అతడ్ని ఢీకొన్న పడవలాటి కారు బ్లాక్ మెయిలర్ దేనా? అంత ఖరీదైన కారు బ్లాక్ మెయిలర్ దేనా? అంత డబ్బున్న మనిషి బ్లాక్ మెయిలింగ్ కి ఎందుకు తలబడ్డాడు?

లేక, ఆ కారు ఆ స్త్రీదా? ఆమె కారుని దొంగిలించి బ్లాక్ మెయిలర్ తనకి అడ్డుగా వున్న పాల్ ని చంపాడా?

ముందు ఈ ఫోన్ నెంబర్ ఎవరిదో కనుక్కోవాలి.

పక్కకి తిరిగి టీపాయ్ పైన వున్న టెలిఫోన్ రిసీవర్

అందుకని చెవిదగ్గర పెట్టుకున్నాను.

"యస్?" అంది ఆపరేటర్ గొంతు.

"622722 ఎవరిదో తెలుసుకోవాలి" అన్నాను.

"ఆ నెంబరెవరిదో మీకు తెలియదా?" అడిగిందామె.

"తెలియదు.ఎక్స్ఛేంజికి డయల్ చేసికనుక్కుంటారా, దయచేసి?"

"మంచిది."

రెండు నిముషాల తర్వాత మళ్ళీ ఆమె గొంతు విన్పించింది. ఆమె గొంతు చెప్పలేనంత కంగారుగావుంది.

"ఈ నెంబర్ మీకెక్కడ దొరికింది?! మీరు... మీరు..."

"అది టెలిఫోన్ నెంబర్ కాదా?"

"ఏ నెంబరైనా టెలిఫోన్ నెంబర్ అవుతుంది. మీరిచ్చింది సరైన నెంబరేనా?"

"మీరెందుకంత గాభరాపడుతున్నారు? ఆ నెంబర్ ఎవరిదో నాకు తెలియదు!"

"థాంక్ గాడ్! అయితే మరీ మంచిది. ఇలాటి సాహసాలు ఇక చేయకండి!"

"ఆపరేటర్ ఏమిటిది?"

"చూడండి, ఈ నెంబర్ ఒక పెద్ద ఇండస్ట్రియలిస్టది. ఇది అన్‌లిస్టెడ్ టెలిఫోన్ నెంబర్. డైరక్టరీలో దొరకదు! మీకెక్కడ దొరికిందో నాకు తెలియదు. మీరు నిజంగా డిటెక్టివేనా?"

"లైసెన్స్ చూపిస్తాను."

ఆపరేటర్ నిట్టూర్చింది, "మిస్టర్ జమునాదాస్ మీకు తెలుసా?"

"ఈ సిటీ నాకు కొత్త."

"ఈ నెంబర్ ఆయన ప్రైవేట్ రూం టెలిఫోన్ ది. ఆయనకి ఎంతో సన్నిహితులైతే తప్ప ఎవరికీ తెలియదు! అన్‌లిస్టెడ్ టెలిఫోన్ నెంబర్ అంటే ఏమిటో మీకు తెలుసనుకుంటాను. వీటిని పెద్ద పెద్ద బిజినెస్ మనుషులకి, పొలిటికల్ లీడర్స్‌కీ, ఇతర పెద్ద మనుషులకే కేటాయిస్తారు. మిస్టర్ జమునాదాస్ పెద్ద పారిశ్రామిక వేత్త. దేశం నలుమూలలా ఆయనకి పరిశ్రమలున్నాయి. ప్రస్తుతం మీరున్న హోటల్ ఆయనదే!"

నేను అదిరిపడి అర్చాను, "వాట్!"

పకపక నవ్వింది ఆపరేటర్. "ఇంకా చెప్తాను వినండి, ఆయన గొప్పతనం! దేశం మొత్తంమీద ఆరు హోటల్సు వున్నాయి ఆయనికి. కొడైకెనాలు హిల్ స్టేషన్‌లో ఆరు కేబిన్స్ వున్నాయి. తిరుపతి కొండలపైన మూడు కాటేజిలున్నాయి. ఈ సిటీనుంచి వెలువడే 'నైఫ్' పత్రిక ఆయనదే...ఇంకా_"

"స్టాపిట్!" అర్చాను, "మీరేం చేస్తున్నారో తెలుసా?"

"నాకు తెలిసింది చేస్తున్నాను."

"మీ యజమానికి మోసం చేస్తున్నారు!"

"నా యజమాని నన్ను మోసం చేసినప్పుడు_"

"ఏమిటి మీరనేది?"

"ఆయనవల్ల నేను మోసపోయాను."

"మీరు ఆయన డబ్బుని చూసివుంటారు."

"ఆయన ఎందర్ని మోసం చేశారో మీకు తెలియదు!" అర్చిందామె.

నాకు పాల్‌ని కలిసిన స్త్రీ జ్ఞాపకం వచ్చింది. ఆమె

ప్రేమలో వైఫల్యం పొందింది జమునాదాస్ వల్లనేనా? అయితే ఆ కారు జమునాదాస్ దేనా? నా గుండె వేగంగా కొట్టుకుంది...

అతడిని నేను ఎదుర్కోగలనా!

తేరుకుని ఫోన్ లో అన్నాను, "చూడండి ఆపరేటర్, మీ పేరేమిటి?"

"రేవతి" అందామె.

"వెల్, మీ డ్యూటీ ఎప్పటివరకు?"

"మరో అరగంట."

"అప్పుడు మనం ఏకాంతంగా కలుసుకోవచ్చా?"

"ఎక్కడ?"

"మీరే చెప్పండి."

రెండు క్షణాలు మౌనం తర్వాత అందామె, "మా యిల్లు చిక్కడపల్లిలో. ఇక్కడనుంచి బయలుదేరి నడిచి వెళదాం. దారిలో మాట్లాడుకోవచ్చు. ఏమంటారు? మీ కభ్యంతరం లేకపోతేనే ఒప్పుకోండి."

నేను థాంక్స్ చెప్పి లైను కట్ చేశాను.

ఏం చేయాలో తోచలేదు. బిజినెస్ మాగ్నెట్ జమునాదాస్ పేరు, అతని వివరాలు వినగానే నా ప్రాణా లెగిరిపోయాయి. ఇక ధైర్యం ఎక్కడిది? అతడు హంతకు డని నేను నిరూపించినా అందరూ నవ్వి హేళన చేస్తారు. సమాజంలో ఇలాటి వ్యక్తుల స్థానం ఏమిటో నాకు తెలుసు.

పోలీసు సహాయంతో విజయం సాధిస్తానన్న నమ్మకం కూడా నాకు లేదు! నేనెవరినో, ఎందుకొచ్చానో దాస్ కి తెలిస్తే నా ప్రాణాలు నాకు దక్కుతాయన్న నమ్మకం కూడా లేదు! పాల్ కి పట్టిన గతి నాకూ పట్టవచ్చు.

ఇప్పుడు నా ఆలోచనలు మరో విధంగా రూపుదిద్దు కున్నాయి. ఆ స్త్రీని ఎవరూ బ్లాక్ మెయిల్ చేయటం లేదు. జమునాదాస్ ఆమెని మోసంచేశాడు. ఆమెదగ్గర ఆధారాలున్నాయి. ఆమె అతడిని తప్పకుండా పెళ్ళి చేసుకోవాలి. అందుకు పాల్ ని ఎన్నుకుంది. తన సమస్యని చెప్పింది.

పాల్ ఆ ఆధారాలతో దాస్ ని ఆమెతో పెళ్ళికి బలవంతం చేశాడు. ఆ ఆధారాలు దాస్ పరువుకి సంబంధించినవి. అతను పెళ్ళికి ఒప్పుకోకపోతే పాల్ తాపీగా పత్రికాఫీసుకి వెళ్ళి ఆ వివరాలని అందిస్తాడు. ఇక దేశంలో ఎక్కడా దాస్ కి పరువు మిగలదు! అందుకే పాల్ ని చంపాడు.

ఈ కేసులో వున్న సగం మిస్టరీ తేలిపోయింది...

సరిగ్గా పదకొండు గంటలకి హోటలు బయటకివచ్చి నిలబడ్డాను ఆమెకోసం ఎదురుచూస్తూ. రెండు నిమిషాల తర్వాత ఆమె కన్పించి చెయ్యి వూపింది. నేనామెను సమీపించాను.

ఆమెకి ఇరవై ఏళ్ళుంటాయి, సుమారు నా అంత ఎత్తు వుంది. చామన చాయ వర్ణం. ఎప్పుడూ నవ్వే ముఖం. పెద్ద కళ్ళు.

"నమస్తే" అందామె. నేను ప్రతి నమస్కారంచేసి "పదండి" అన్నాను.

ఇద్దరం నడక ప్రారంభించాం. నేను బస చేసిన హోటలు పేరు ఇరోస్. తిలక్ రోడ్ లో వుంది. తిలక్ రోడ్ నుంచి చిక్కడపల్లి వెళ్ళాలంటే చాలాదూరం. నడిచి వెడితే గంటకి పైగా సమయం పడుతుంది.

"నాకేమీ అర్ధంగావటంలేదు" అన్నాను సంభాషణ

ప్రారంభిస్తూ.

"జమునాదాస్ గురించి నేను చెప్పింది అర్థమైందను కుంటాను?" అందామె రోడ్డుకేసి సూటిగా చూస్తూ.

నేను తలవూపి, "మీ గురించి అర్థం కాలేదు" అన్నాను.

ఆమె నిట్టూర్చింది, "దాస్ నాపైన దౌర్జన్యం చేశాడు!"

"అయితే ఆ హోటలులో ఎందుకు పనిచేస్తున్నారు?"

"విధిలేక! ఇంకెక్కడా ఉద్యోగం దొరకలేదు. పైగా దాస్‌మీద దెబ్బతీయాలని చూస్తున్నాను."

"మీ రహస్యాల్ని నాకు ధైర్యంగా ఎలా వెల్లడిస్తున్నారు మీరు?"

"డిటెక్టివ్‌లు రహస్యాలు దాచగలరు కాబట్టి. నాకు మీ సహాయం కావాలి కాబట్టి."

"వెల్, నేను మీకు ఏం సహాయం చేయాలో వివరిస్తారా?" అన్నాను.

"వివరిస్తాను."

"నేను మీకు సహాయం చేయగలనని ఎలా అనుకున్నారు?"

ఆమె నవ్వింది, "మీరా టెలిఫోన్ నెంబర్ గురించి అడిగినప్పుడే నా కనుమానం వేసింది. ఆ నెంబర్ ఎవరికీ తెలిసే వీలులేదు! నేను వెంటనే కీబోర్డ్ చూసాను. రూమ్ ట్వంటీఫోర్‌లో డిటెక్టివ్ అర్జున్ వుంటున్నట్టు తెలుసుకున్నాను. ఆ నెంబర్‌తో డిటెక్టివ్‌కి పనేమిటి? నా అనుమానం ధృవపడింది. దాస్ ఏదో చిక్కుల్లో పడ్డాడు. పైగా మీరు బెంగుళూర్ నుండి వచ్చారు. దాస్‌మీద మీరేదో వలపన్నుతున్నారు. అందువల్ల నాకు

సహాయపడతారని అనుకున్నాను."

"వెరీగుడ్. నేనేం చేయాలి?"

"ఈ హోటల్లో నేను మూడు నెలల నుండి పని చేస్తున్నాను. పదిహేనురోజుల క్రితం డ్యూటీదిగాక రిక్షాలో యింటికెళుతోన్నాను. దారిలో నన్ను ఒక కారు అటకాయించింది. అందులోంచి ఒకవ్యక్తి దిగాడు. అతడ్ని అంతకుముందెన్నడూ నేను చూడలేదు. ఆ తర్వాతా ఎప్పుడూ చూడలేదు. అతడిపేరు రజాక్ అని తెలిసింది. రెడ్ కలర్ బెంజ్ కారు.

అతడు నన్ను బెదిరించి కార్లో ఎక్కించాడు. రిక్షా వాడ్ని బెదిరించి పంపేశాడు. కారెక్కడికి వెళ్ళిందో నాకు తెలియదు, కానీ, ఆరాత్రి నాపైన దౌర్జన్యం చేసిన వ్యక్తి జమునాదాస్ అని తెలిసింది. జమునాదాస్ని నేనెప్పుడూ చూడలేదు. నన్నీ హోటల్లో మేనేజరు నియమించాడు. మీరు దాస్ని పట్టి శిక్షిస్తే నాకు సహాయం చేసిన వారవుతారు."

"జమునాదాస్ నార్త్ ఇండియనా?"

"అవును. అతనికి పాతికేళ్ళ భార్యవుంది—రేణుక. అతనికి ఏభైయేళ్లుంటాయి. ఆమె రెండవ భార్య."

కొంతదూరం మౌనంగా నడిచాక మళ్ళీఅంది, "నిజంగా మీకు దాస్ని ఎదుర్కొనే ధైర్యం వుందా? అతడేం చేశాడు?"

"హత్యచేశాడు, నా సహ డిటెక్టివ్ పాల్ని."

"గాడ్!"

"దాస్ని వదలిపెట్టను. రేవతీ, అతని క్యారెక్టర్ మంచిది కాదా?"

"ఈ సిటీలో అంతటి దుర్మార్గుడెవరూ లేరు,"

ఆ తర్వాత ఈ కేసుని నేనెలా హాండిల్ చేయాలో ఆలోచించుకుని ఆమె పైన ప్రశ్నల వర్షం కురిపించాను.

"రెడ్ కలర్ బెంజి జమునాదాస్ దేనా?"

"అవును."

"లైసెన్స్ నెంబర్ తెలుసా?"

"తెలుసు. ఆ కారుని రెండు మూడుసార్లు చూశాను. MSQ 9000."

"జమునాదాస్ ప్రయివేట్ రూం ఎక్కడుంది?"

"అతనింట్లోనే రెండవ అంతస్తులో."

"ఇల్లెక్కడ వుంది?"

"బంజారా హిల్సులో."

"అడ్రసు చెప్పండి."

చెప్పిందామె.

"మీరు నన్ను కలుసుకున్నారని దాస్‌కి తెలిస్తే ఏమవుతుంది?"

"మీరెవరో ఆయనకి తెలియదు."

"కీబోర్డులో నా పేరు వుంది."

"ఆయన హోటలుకి రారు!"

"వెరీగుడ్" అన్నాను. "దాస్ అంతు చూసేవరకు నేను హోటలు కదలను. రేపుదయం నేనతడి యింటికి వెళ్ళి కలుసుకుంటాను. ఏ సమయంలో యింట్లో వుంటాడు?"

"ఉదయం తొమ్మిదివరకు." అందామె. "మిస్టర్ అరుణ్, నాకు చాలా భయంగా వుంది. దాస్‌ని రొజ్జు కొట్టడం మీతరం కాదు. అతడితో ఢీకొన్న పోలీసు వాళ్ళే నామరూపాల్లేకుండా పోయారు! మీదగ్గర ఏ సాక్ష్యంవుంది, అతడిని హంతకుడిగా నిరూపించడానికి?"

"ఏమిలేదు. రేపుదయం నేనతడ్ని పరిచయం చేసుకో బోతున్నాను. దోపిగా పట్టుకోవడంలేదు" అన్నాను.

"కానీ మీ స్నేహితుడికి పట్టిన గతి మీకూ..."

"మీరు భయపడకండి! సాహసం మగవాడి లక్షణం. నో ఆర్గ్యుమెంట్" అన్నాను.

ఆమెని ఇంటికి చేరవేసి, ఆటోలో హోటలు చేరు కున్నాక జమునాదాస్ గురించి తీవ్రంగా ఆలోచిస్తూ నిద్రపోయాను.

# 5

బంజారా హిల్సులో జమునాదాస్ భవనం అధునాత నంగా నిర్మించబడింది.

మెయిన్ గేటునుంచి భవనం చేరుకోవాలంటే రెండు ఫర్లాంగులు వెళ్ళాలి. చుట్టూ వున్న ప్రహరీగోడ నాను కుని పొడవాటి వృక్షాలు పెరిగాయి. కాబట్టి బయటనుంచి భవనం కన్పించదు. కానీ గేటుముందు గూర్ఖా కన్పిస్తాడు.

ఆ గూర్ఖాకో స్టేట్ ఎక్స్ప్రెస్ ఆఫర్ చేసి పేరు తెలుసుకున్నాను.

"దిలావర్ సింగ్" చెప్పాడతను.

నేనతని ముఖంలోకి పరీక్షగా చూశాను, నాకు పనికి వచ్చే లక్షణాలేమైనా వున్నాయేమోనని. తెల్లటి అతని ముఖంలో ఇట్టే ఆకర్షించగల గుణముంది. కానీ నేనతడ్ని ఆకర్షించాలి. అందుకు ఏ మంత్రం ప్రయోగించాలి? అతడి లోని బలహీనతని ఎలా కనిపెట్టాలి?

మళ్ళీ అతడి ముఖాన్ని చూశాను.

ఉషారుగా కాలుస్తున్నాడు సిగరెట్. అతడి కళ్ళలో తృప్తి కన్పిస్తోంది.

"ఈ సిగరెట్ నా మిత్రులకి తప్ప ఆఫర్ చేయను,"

అన్నాను.

"నిజం?"

"నూరుపాళ్ళు."

"నేను మీ స్నేహితుడ్నా? నాకు తెలియదే? మిమ్మల్నింతవరకు_"

"ఇప్పుడు చూశావుగా? వెల్, నీతో స్నేహం మంచి కాలక్షేపం. ఇక్కడ కూచోడం తప్ప నీకేపనీ వుండదు. కాస్సేపు కబుర్లాడుకుందామా?"

దిలావర్ మెరుస్తున్న కళ్ళతో చూశాడు.

"ఇది గొప్ప అదృష్టం!" అర్చాడాతను. "ఈ బంజారా హిల్సు ప్రాంతమంతా మార్షల్ లా విధించినట్టు చడీచప్పుడూ లేకుండా - సరే, మచ్చుకి ఒక్కమనిషి కన్పించడు ఈ వీధుల్లో. నేనిక్కడ ఎంత విసుగెత్తి పోయానో - సరే, ఏమన్నారు? మీతో కబుర్లా!?"

"అవును" అన్నాను. అతని ముఖం హఠాత్తుగా విచారంగా మారింది.

"వ్చ్, లాభంలేదు. కబుర్లాడాలంటే నా ఎదురుగా టీ కప్పు వుండాలి." అన్నాడతను. ఈ చుట్టుపక్కల టీ ఎక్కడా దొరకదు!

అతని వీక్‌పాయింట్ కనిపెట్టేశాను. "అయితే ఒక పని చేద్దాం" అన్నాను మరో సిగరెట్ అందిస్తూ. "సాయంత్రం మనం హోటల్లో కలుసుకుందాం. కావలసినంత టీ తాగు. కానీ కబుర్లుమాత్రం చెప్పు!"

దిలావర్ కిచకిచమని నవ్వాడు. "ఏ హోటల్లో కలుసుకుందాం?"

"నీ యిష్టం."

అతడు కుడిచెయ్యి నుదుటి కానించుకుని కాస్సేపు

ఆలోచించాడు.

"గోల్కొండ క్రాస్ రోడ్స్‌లో ఒక హోటలు వుంది, అక్కడికి వస్తారా? అక్కడికి నా యిల్లు దగ్గర. సాయంత్రం ఆరు గంటలకి నా డ్యూటీ పూర్తవుతుంది. ఏమంటారు?" అడిగాడతను.

ఇంతలో ఒక కారు గేటులోంచి బయటికి వచ్చింది. ఉలిక్కిపడ్డాను. రెడ్ కలర్ బెంజ్: MSQ 9000.

డ్రైవింగ్ సీట్‌లో ఒక వ్యక్తి వున్నాడు. కార్లో ఇంకెవరూ లేరు. బ్లూ కలర్ జీన్స్‌లో వున్న ఆ మనిషి చాకులా వున్నాడు. పిల్లి కళ్ళు, నున్నగా గీసుకున్న గడ్డం, చెంపల కిందివరకు వచ్చిన సైడ్ లాక్స్, వుంగరాల జుత్తు. ఇదంతా గమనిస్తోన్న నేను హఠాత్తుగా వులిక్కిపడ్డాను.

అతడి లావాటి పెదవుల మధ్య బీడీముక్క వుంది.

కారు దూసుకుపోయాక దిలావర్‌ని అడిగాను, "అతడెవరు?"

"మా బాస్‌కి నమ్మకమైన మనిషి" అన్నాడు దిలావర్. "అతడికి వంద గజాల దూరంలో వుంటే ఎవరికైనా మంచిది."

"పేరేమిటి?"

"రజాక్."

రజాక్! రక్తప్రసరణ ఆగిపోయింది. కార్లో అతడ్ని అనామకుడిగా చూసినప్పుడు నాకు భయం వేయలేదు. కానీ పేరు తెలుసుకున్నాక చెప్పరాని భయంపట్టుకుంది.

"దిలావర్, నేను లోనికెళ్ళడానికి ఎవరి అనుమతి తీసుకోవాలి?" అడిగాను వెంటనే.

"నా అనుమతి" అన్నాడతను.

ఛటుక్కున గేటులోంచి లోనికెళ్ళి చకచక నడిచాను. లోపలి పరిసరాలు నాలోని భయాన్ని దూరం చేశాయి. కానీ బంగళా మెట్లు ఎక్కుతుండగా నా కాళ్ళు సహకరించకుండా వణకసాగాయి.

వసారాలో వరసగా సోఫాలున్నాయి. ఆ సోఫాల్లో ఆరుగురు కూచొని వున్నారు. పెద్ద బిజినెస్ మాగ్నెట్ అని వాళ్ళ వాలకం చెబుతోంది. వాళ్ళంతా నాకేసి తదేకంగా చూస్తోంటే నేను తల వాల్చుకుని గబగబ వెళ్ళి వాళ్ళ పక్కన కూచున్నాను.

ఇంతలోనే లోపలినుంచి ఒక వ్యక్తి బయటికి వచ్చి, "మిస్టర్ పరోటా, యూ ఆర్ వెల్కమ్" అన్నాడు. సన్నగా పొడుగ్గా సూట్లోవున్న వ్యక్తి లేచి లోనికెళ్లాడు. అతడ్ని పిల్చిన వ్యక్తి నా దగ్గరికి వచ్చి ఎగాదిగా చూసి "ఎవరు మీరు?" అన్నాడు హిందీలో.

"మిస్టర్ దాస్‌ని కలుసుకోవాలి" అన్నాను.

"మీ పేరు?"

చెప్పాను.

"మీ పేరులో అపాయింట్ మెంట్ లేదే?"

"నేను అత్యవసరంగా వచ్చాను."

"ఏ అవసరంలో వచ్చినా ముందు అపాయింట్ మెంట్ కావాలి" అన్నాడతను కఠినంగా.

"మీ రెవరు?" అడిగాను నెమ్మదిగా.

"మిస్టర్ దాస్ సెక్రటరీని."

నేను జేబులోంచి విజిటింగ్ కార్డు తీసి, "ఇది ఆయన కిస్తారా?" అన్నాను.

అతడాశ్చర్యపోయి కార్డు లాక్కుని ఛటుక్కున లోని కెళ్ళాడు. మరు నిముషం తర్వాత మిస్టర్ పరోటా విసు

వస్తూంటూ బయటికి వచ్చాను. ఏం జరిగి వుంటుందో నాకు తెలుసు. నా కార్డు చూసి అతడ్ని పంపించేశాడు దాస్.

మరో నిముషం గడిచాక సెక్రటరీ తిరిగివచ్చి నన్ను పిల్చాడు.

నా శరీరం చల్లబడింది.

గుండెలో సుత్తి పోట్లు ప్రారంభమయ్యాయి. లోనికి అడుగులేస్తోంటే నేను క్షేమంగా తిరిగి రాగలనా అని అనుమానం కలిగింది.

సెక్రటరీ ముందు నడుస్తున్నాడు. అతనో గది ముందాగి స్వింగ్ డోర్ ముందుకు నెట్టాడు. రివ్వుమని చల్లటిగాలి ముఖానికి కొట్టింది. గుండె వేగంగా కొట్టుకుంది. శరీర మంతా చల్లబడి వణుకు ప్రారంభమైంది.

"లోనికెళ్ళండి." అన్నాడతను, డోర్ తెరిచి పట్టుకుని.

నేనతడ్ని చూసి బలహీనంగా నవ్వి లోనికి అడుగే శాను.

విశాలమైన ఆ గది అలంకరణ చూడగానే కళ్ళు చెది రాయి. ఎదురుగా ఖరీదైన టేబిలు వెనక భారీ మనిషిని చూడగానే ప్రాణాలెగిరి పోయాయ్.

ఖరీదైన సూట్‌లో వున్న ఆ మనిషికి నలభై అయిదే ళ్ళుంటాయి. తల వెంట్రుకలు చాలావరకు నెరిశాయి తెల్లటి వర్ణం, చురుకైన కళ్ళు, పొట్టి చేతులు, వెడల్పాటి చెవులు, ఎర్రటి పెదవులు.

అతని ఎడమచేతివేపు వరసగా నాలుగు టెలిఫోన్ లున్నాయి. కుడిచేతివేపు ఆష్‌ట్రే, ఎదురుగా కొన్ని ఫైళ్ళు, ఇతర కాయితాలూ వున్నాయి.

టేబిలు ముందు నాలుగు ఖరీదైన కుర్చీలున్నాయి.

అతని చురుకైన నల్లటి కళ్ళు నన్నొకసారి ఆపాద మస్తకమూ పరికించాయ్. ఆ తర్వాత అతని ఎర్రటి పెదవులు విచ్చుకుని చిరునవ్వు వెలువడింది.

నేను ధైర్యంగా వెళ్ళి అతని ఎదురుగా కుర్చీలో కూచున్నాను. రెండు క్షణాలు నా ముఖంలోకి తన చూపుల బాణాలు విసిరి ట్రేలో వున్న విజిటింగ్ కార్డ్ అందుకున్నాడు. నేను వూపిరి బిగబట్టాను.

"ఈ కార్డు మీదేనా?" అడిగాడతను.

"అవును" అన్నాను.

"వెల్, వచ్చిన పనేమిటి?"

"నా కో-డిటెక్టివ్ మీకు తెలుసనుకుంటాను?"

అతని కళ్ళు ఉలిక్కిపడ్డాయ్. "నన్ను కలుసుకున్న మొదటి డిటెక్టివ్ మీరే!" అన్నాడతను.

"నో సర్, మీరు పొరబడ్డారు. పాల్ డిటెక్టివ్ అని మీకు తెలియదు. మిమ్మల్ని కలుసుకున్న మొదటి డిటెక్టివ్ అతనే!" అన్నాను.

జమునాదాస్ ఉగ్రుడయాడు. అతని బొటనవేలు కాలింగ్ బెల్ ను నొక్కింది. తలుపు తెరుచుకుని సెక్రటరీ వచ్చాడు.

"రజాక్ ని పిలువ్!" అర్చాడు దాస్. నేను గజగజ వణికాను. రజాక్ బయటికి వెళ్ళినట్లు గుర్తుంది. ఇప్పుడు తిరిగి వచ్చాడేమో.

సెక్రటరీ తలవూపి అదృశ్యమయాడు. రెండు నిముషాల తర్వాత రజాక్ తో ప్రత్యక్షమయాడు.

రజాక్ ని చూసి దాస్ చిటికవేసి సైగచేశాడు. రజాక్ బూట్లు టకటక లాడించుకుంటూ నా దగ్గరికి వచ్చాడు.

వెన్నులోంచి చలిపుట్టుక వచ్చింది. అతను నా వెనక నిలబడివున్నాడు. గట్టిగా కళ్ళు మూసుకుని తెరిచాను, అంతే!

రజాక్ నా ముఖంలో ముఖం పెట్టి చూస్తున్నాడు. ఛటుక్కున భయంతో ముఖం తిప్పుకున్నాను. అతను విషపునవ్వు నవ్వి, తలవూపి వెళ్ళిపోయాడు.

ఇదంతా ఏమిటో నా కర్థంకాలేదు.

కానీ, నేను బయటికెళితే కళ్ళు హూనమవడం ఖాయమని తర్వాత వూహించాను.

"డిటెక్టివ్ గారూ, మీరు దారితప్పి ఇటు వచ్చారని నా అనుమానం."

జమునాదాస్ మాటలకి తేరుకుని అతని ముఖంలోకి చూశాను.

"లుక్, యూ పూర్ డిటెక్టివ్!" మళ్ళీ అన్నాడతను. ఈసారి అతని గొంతులో హెచ్చరిక వుంది, "నా విలువైన కాలాన్ని ఇప్పటికే చాలా వేస్ట్ చేశావు! నేనెవరినో ఇంకా సరిగా నీకు తెలియదు. సేఠ్ జమునాదాస్ పేరు ఈ సిటీలో ఎవరైనా వింటే గజగజలాడతారు. నువ్వు నన్ను అపాయింట్ మెంట్ లేకుండా ధైర్యంగా కలుసుకోడం నాకానందంగా వుంది! ఆనందంగా వుంది! వెల్, మిస్టర్ పాల్ ఎవరో నాకు తెలియదు, దయచేస్తావా?"

అతను ఏకవచనంలో సంబోధిస్తోంటే పరిస్థితి విషమించిందని వూహించాను.

లేచి నిలబడి అతనికి నమస్కారం చేశాను.

"మిస్టర్ దాస్, దురదృష్టవశాత్తు నిన్న సాయంత్రం మీ కారు నా స్నేహితుడిని ఢీకొంది. అతను మరణించాడు. మీ కారు తప్పించుకుంది. ఆ పేపర్లో మీరు ప్రకటన

చదివే వుంటారు. ఇక మీ కారు, మీరూ తప్పించుకునే అవకాశం లేదు. డ్రైవర్ పొరపాటువల్ల ఆక్సిడెంట్ జరిగిందని మీరు ఒప్పుకుంటారనుకున్నాను. అలా జరగ లేదు. ఇక ఈ ఆక్సిడెంట్ కావాలని చేసిందని అనుకో వచ్చా?" అనడిగాను.

"వాట్ నాన్సెన్స్ యూ ఆర్ స్పీకింగ్!"

"మీరు మర్డర్ కేసులో ఇరుక్కుంటారు. నేరం ఒప్పు కుంటే శిక్ష తగ్గవచ్చు."

"నువ్వు ఎవరి తరఫున వచ్చావు?"

"ఎవరి తరఫునా రాలేదు. పాల్ కి న్యాయం జరగడం కోసం వచ్చాను."

పగలబడి నవ్వాడు దాస్.

"అలాగా? ఈ సిటీలో ఏ కానిస్టేబిలునయినా అడుగు, నాగురించి ఏం చెబుతాడో? 'జమునాదాస్! ఆయనజోలికి వెళ్ళే ధైర్యం చేయం!' "

నేను నవ్వాను.

"మీ గురించి కమీషనర్ని అడిగి తెలుసుకుంటాను, ఆయన ఏం చెబుతాడో - డియర్ దాస్, పాల్ చని పోయినప్పుడే మీ జాతకం తిరగబడిందని తెలుసుకోండి" అన్నాను.

దాస్ ఏదో అనబోయాడు, నేను వెనక్కి తిరిగి తలుపు వేపుకి నడిచాను. కానీ, బయటికివెళితే ఎలాటి పరిణామం ఎదుర్కోవాలో అంతుబట్టలేదు. రజాక్ అకస్మాత్తుగా నాపైన దాడిచేస్తే నా బ్రతుకు ఇక్కడే క్లైమాక్స్కి చేరుకుంటుంది. నా శవం ఆరడుగుల గోతిలోకి వెళుతుంది.

చెమట తుడుచుకుని వెనక్కి తిరిగి అన్నాను, "మిస్టర్ దాస్, మిమ్మల్ని ఎదిరించేవారు ఈ సిటీలో లేక

పోవచ్చు. ఇండియాలో ఇదొక్కటే సిటీకాదనీ, ఇంత కంటే పెద్ద సిటీలున్నాయని మరువకండి!''

# 6

దిలావర్ చెయ్యి పట్టుకుని గోడపక్కకి లాగాను.

అతను ఆశ్చర్యపోయి చూశాడు. నేను చిన్నగానవ్వి, ''కొన్ని విషయాలు మాట్లాడాలి'' అన్నాను.

ఏమిటన్నట్టు చూశాడతను.

''నీ బాస్ భార్య ఎక్కడ వుంది?''

''నన్నడక్కండి! నాకు భయం!'' వెనక్కి జరిగిపోయి అన్నాడతను.

''ధైర్యానికి గూర్ఖాలని మించినవారు లేరనుకున్నాను. నువ్విలా...''

''ష్‌ష్!'' నా నోరు మూశాడు. ''ఆయన భార్యతో పనేమిటి?''

''ఆమె అంటే నీకు భయమా?''

''బాస్‌కే భయం! మొదటిభార్య చాలా మంచిది. ఈ రెండవభార్య, రేణుక, ఈ కాలపు అమ్మాయి. చాకులాంటి అమ్మాయి. ఇరవై ఐదేళ్ళుంటాయి. ఆమె ఈ మధ్య ఏదో...అదోలా వుంటోంది. కారణం ఎవరికీ తెలియదు!—''

''ఆమెని కలుసుకోవాలి!''

''ఎందుకు?''

''నేను పోలీసు మనిషిని.''

తటాలున వెనక్కి చూశాడు దిలావర్. అతని ముఖం వివర్ణమైంది.

''భయపడకు. మన స్నేహం చెడదు. నీకు రాత్రి మంచి డిన్నర్ ఇస్తాను...ఆమె ఎక్కడ వుంది?''

నన్నొకసారి ఆపాదమ స్తకమూ చూశాడు దిలావర్.

"ఉస్మాన్ సాగర్‌లో. అక్కడ ఒక పిక్నిక్ కాటేజిలో వుంటోంది."

"థాంక్స్" అన్నాను. ఆ తర్వాత దాస్ రజాక్‌ని చిటికవేసి సైగ చేయడం, రజాక్ నా ముఖంలోకి చూసి నవ్వి వెళ్ళిపోవడం...ఇదంతా అతనితో చెప్పాను.

అంతా విని అతను ఉలిక్కిపడ్డాడు. అతని పెదవులు వణుకుతున్నాయి.

"ఒక మాట చెప్పనా?" అన్నాడతను.

"ఏమిటి?" అన్నాను.

"తక్షణం ఈ ఊరునుంచి ఉడాయించండి!"

"ఎందుకు?"

దిలావర్ కాస్సేపు సందేహించి అన్నాడు, "బాస్ చిటిక వేసి సైగచేశారంటే స్వర్గానికి సిగ్నల్ ఇచ్చేశారన్న మాటే!"

"అలాగా? అయితే ఏం జరుగుతుందో చూద్దాం!" అన్నాను.

"చూడండి, నన్ను మీ గొడవల్లో ఇరికించకండి!" దిలావర్ ప్రాధేయపడుతూ అన్నాడు. "నేను మీలో రాను! మీతో స్నేహం చేయను! పరిస్థితేమిటో నాకర్థమైంది! మీరు వెళ్ళిపోండి! తుమ్‌జావో!"

దిలావర్ నాతో సహకరించాలంటే నా ఒకేఒక్క మంత్రం ప్రయోగించక తప్పలేదు.

"దిలావర్, నీ బాస్ మర్డర్ కేసులో ఇరుక్కున్నాడు" అన్నాను. "నువ్వు నాతో సహకరించకపోతే నిన్నూ ఇరికిస్తాను. సహకరిస్తే దాస్ నుండి రక్షిస్తాను. ఇక్కడ ఉద్యోగం మానేసి, నాతోపాటు బెంగుళూరికి రావచ్చు.

ఏమంటావు?''

దిలావర్ కుడిచెయ్యి నుదుటకానించుకుని కాస్సేపాలో చించాడు. నేను మౌనంగా సిగరెట్ పీల్చాను.

''సరే, నేనేం చేయాలి?'' అన్నాడు చివరకి.

''సాయంత్రంహోటల్ లో కలుసుకుందాం''అన్నాను.

''రజాక్ ___''

''అతడు నన్ను వెంబడిస్తాడేమో కనిపెడతాను. క్షేమంగా వుంటే సాయంత్రం నిన్ను కలుసుకుంటాను,'' అన్నాను.

ఆ తర్వాత హెడ్ క్వార్టర్స్ కి బయలుదేరాను.

జమునాదాస్ దగ్గర సెలవుతీసుకొని బయటికి వచ్చాక రజాక్ ఎక్కడ ఎదురుపడి కొడతాడోనని విపరీతంగా భయపడ్డాను. కానీ రజాక్ అయిపూ జాడాలేడు! నా కాళ్ళు మాత్రం వణుకుతూనే వున్నాయి.

హెడ్ క్వార్టర్స్ కి చేరుకోగానే ఇన్ స్పెక్టర్ డేవిడ్ నన్ను పట్టుకుని కిందామీదా చేశేసాడు. నేను కంగారు పడి, ''ఏమిటిదంతా?'' అని అర్చాను.

''నువ్వు క్షేమంగా వున్నావా?'' అడిగాడతను, నన్ను విడిచిపెట్టి.

''ఎందుకొచ్చిందా అనుమానం?'' అడిగాను.

''నీ రూమ్ కి ఆరుసార్లు ఫోన్ చేశాను. సమాధానం లేదు. నో రెస్పాన్స్! ఏదో జరిగివుంటుందని సుందర్ ని పంపించాను. అసలక్కడ నువ్వులేవు!''

''జమునాదాస్ ని కలుసుకున్నాను'' నెమ్మదిగా అన్నాను.

''వాట్!'' విస్తుపోయాడు డేవిడ్. ''దట్ మిలియనీర్!''

తలవూపాడు.

"ఎందుకు?"

"ఆకారు అతనిదే."

డేవిడ్ కొయ్యబారిపోయాడు.

"ఆ పడవలాంటి కారు రెడ్ కలర్ బెంజ్. లైసెన్స నెంబర్ MSQ 900C. దాని యజమాని జమునాదాస్. ఆ కారుని నేను ప్రత్యక్షంగా చూశాను" అన్నాను.

"ఆకారు ఆక్సిడెంట్ చేసిందని ఆధారాలున్నాయా?" అడిగాడు డేవిడ్.

"మీ సాక్షులు పంజరంలో పడితే, వాళ్ళ కథనమే ఆధారం" అన్నాను.

"వాళ్ళ కథనం వేరుగా వుంటే?"

"అంటే?"

"కమాన్!" నా చెయ్యిపట్టుకొని పక్క గదిలోకి లాక్కెళ్ళాడు డేవిడ్.

ఆ గదిలో సుందర్, మరో పధ్దెనిమిదేళ్ళ అమ్మాయి కూచొనివున్నారు.

డేవిడ్ ఆమెకి నన్ను పరిచయం చేసి, "ఈమె నా పారిపోయిన సాక్షి" అన్నాడు. "పేరు సుచిత్ర. హిమాయత్ నగర్‌లో నివాసం. నిన్న సాయంత్రం కాలేజీ నుంచి వస్తూ ఆక్సిడెంట్‌ను కళ్ళారా చూసింది. ముఖ్యమైన విషయమేమిటంటే ఈమె 'లా' విద్యార్థిని. ఆక్సిడెంట్ చేసిన కారు నెంబర్ చాకచక్యంగా నోట్ చేసుకుంది. కానీ భయపడి తక్షణం అక్కడనుంచి వెళ్ళిపోయింది, అది మైనర్ ఆక్సిడెంట్ కాదని తెలిసి."

డేవిడ్ యింకా చెప్పాడు, "ఈ ఉదయం ఆమె పేపర్‌లో ప్రకటన చూసింది. ఆ రాత్రంతా ఆమెకు

నిద్రలేదట. రక్తం మడుగులో మనిషి. దూసుకుపోయిన ఎర్రటి కారు, ఇవే కళ్ళముందు కనిపిస్తున్నాయట. 'లా' విద్యార్థినిగా తను ఎవిడెన్స్‌ని దాచడం మనస్కరించక యిక్కడికి వచ్చింది."

"థాంక్యూ వెరీమచ్ సుచిత్రా, చాలా సహాయం చేశారు. కోర్టులో మాకు ప్రధాన సాక్ష్యంగా నిలబడే ధైర్యం మీకుందా?" అడిగాను.

ఆమె తలవూపింది.

"వెల్, ఆ కారు నెంబరు చెప్పండి?"

"APX 720050."

"APX 720050? మీరు చెప్పింది కరెక్టేనా?"

"మీరు విన్నదికూడ కరెక్టే!"

"ఏ కారు?"

"బెంజ్."

"ఏ కలరు?"

"రెడ్."

"మీరు పొరబడ్డారు సుచిత్రా. అక్సిడెంట్ చూసిన కంగారులో MSQ 9000 కి బదులు APX 720050 వ్రాసుకున్నారు. నా వుద్దేశం మీరు మరో కారు నెంబర్ వ్రాసుకున్నారు."

డేవిడ్ మధ్యలో అడ్డుతగిలి, "ఇకచాలు, నీ మెదడు చెడిపోయింది, పద!" అన్నాడు.

నేనతని వెంట నడిచాను.

ఆఫీసుగదిలోకి వెళ్ళాక డేవిడ్ అన్నాడు: "నువ్వు జేమ్స్‌బాండు ఫోజులు కొడుతున్నావ్!"

"నేనేం చేశాను?"

"జమునాదాస్ మీద యుద్ధం ప్రకటించావు. నీ చివరి

రోజులు దగ్గర పడ్డాయి."
"అలాగా? అతనీ సిటీకి నవాబా?"
"డేవిడ్ నా వైపొకసారి కోపంగా చూసి, "ఉగాండా అధ్యక్షుడు, అమీన్ తెలుసా" అనడిగాడు.
తలవూపాను.
"అమీన్‌కీ దాస్‌కీ తేడాలేదు" అన్నాడు డేవిడ్. "ఇక్కడ నీకెవరూ పరిచయంలేదు. పరాయి ప్రదేశం. ఇక్కడి పరిస్థితులూ, వాతావరణమూ నీకేమి తెలియవు. కొత్త ప్రదేశాలకు వెళ్ళినప్పుడు ఆరోగ్యం జాగ్రత్తగా కాపాడుకోవాలి. ఏమంటావు?"
"ఇవి పోలీసులు చెప్పే మాటలు కావంటాను" అన్నాను. దాస్ అంటే మీకు భయమా? నా వుద్దేశం పోలీసుశాఖ మొత్తానికే భయమా? పోలీసుల్ని మధ్య పెట్టేమనిషి బెంగుళూర్‌లో ఎవడూ లేడే!"
"అర్జున్! మేం ఏమి చేయలేని స్థితిలో వున్నాం" అన్నాడు డేవిడ్ నిస్పృహగా.
"దాస్‌మీద ఎన్నో ఆరోపణలు వస్తున్నాయి. కానీ నిరూపణలు లేవు. అతని హోటల్స్‌లో భారీ ఎత్తున గాంబ్లింగ్ సాగుతుంది. హాషీష్ స్మగ్లింగ్ జరుగుతోంది. కానీ పట్టుబడకుండా జాగ్రత్త పడుతుంటారు. మేం రైడింగ్ చేసే సమయానికి అక్కడేమీ వుండదు. ఫూల్సు అవుతాం. ఇంతవరకు అతనిమీద వచ్చే ఆరోపణలకి సరయిన నిరూపణ దొరకలేదు. యిక దొరకదని మా నమ్మకం."
"రాజకీయాల్లో అతని హస్తముందా?"
"పొలిటికల్ పార్టీలకి భారీ ఎత్తున విరాళాలిస్తాడు. ఎన్నికల్లో తన మనిషిని గెలిపించి మంత్రి పదవి వచ్చేలా

చేసి తన చెప్పుచేతల్లో వుంచుకుంటాడు."

"క్రిమినలుగా మీరతడ్ని పట్టుకోలేరా?"

"అవకాశంకోసం ఎదురు చూస్తున్నాం."

"ఇది అనువయిన అవకాశం కాదా?"

"ఏది?"

"ఆక్సిడెంట్ కేసు."

డేవిడ్ భుజాలెగరేశాడు, "వెల్, నీకుమరో విషయం చెప్పాలి" అన్నాడతను. "సుచిత్ర నోట్ చేసుకున్న కారు నెంబర్ సరయినదే. అది దాస్ కారుది కాదు."

"ఎలా?"

"మూడునెలల క్రితం ఇన్‌స్పెక్టర్ కిస్కిందర్ నల్లకుంటలో ఒకకారు ఆక్సిడెంట్‌లో చనిపోయాడు. ఆ కారు ఇంతవరకు దొరకలేదు. అది రెడ్ కలర్ బెంజ్. నెంబర్ APX 720050. వెనకనుంచి ఢీకొని తప్పించుకొంది.

ఆ లైసెన్స్ నెంబర్‌ని మేం చెక్ చేశాం. కానీ ఆ కారు ఈ సిటీలో దొరకలేదు. దేశం మొత్తం బెంజ్ కార్లను చెక్ చేశాం. దొరకలేదు. అరుణ్, APX 720050 ఆంధ్రప్రదేశ్‌లో రిజిస్ట్రేషన్ చేయబడింది కాదు. మరెక్కడా దాని రిజిస్ట్రేషన్ వివరాలు లేవు. అది ఫేక్ నెంబర్. అదేకారు మళ్ళీ ఇప్పుడు ప్రత్యక్షమైంది. దాన్ని పట్టుకోడం కష్టం."

"ఇన్‌స్పెక్టర్‌ని బుద్ధిపూర్వకంగా ఆక్సిడెంట్ చేసి చంపారా?"

"అవును."

"డ్రయివర్‌ని ఎవరయినా చూశారా?"

"లేదు."

"సుచిత్ర చూసిందా?"

"లేదు."

"వెల్, ఇన్‌స్పెక్టర్. MSQ 9000 జమునాదాస్‌దే కదూ?"

"అవును. అది మద్రాసు లైసెన్స్ ప్లేట్."

"దాన్ని తొలగించి ఆంధ్ర లైసెన్స్ ప్లేట్ పెట్టవచ్చు, కదూ?"

"జమున కారుకా!"

"ఎస్. సిటీలో యెన్ని బెంజి కారులున్నాయి?

"పదకొండు," అన్నాడు డేవిడ్, "అర్జున్, దాస్ పాల్నెందుకు చంపుతాడు?"

"అది మీకూ నాకూ వూహాకందని విషయం. ఇన్‌స్పెక్టర్, పాల్‌ని కలుసుకున్న స్త్రీ యెవరో మనకు తెలిస్తే దాస్, పాల్‌ని యెందుకు చంపాడో తెలుస్తుంది. నేనిప్పుడు దాస్ భార్య రేణుకను కలుసుకోబోతున్నాను."

"ఆమెనా? ఎందుకు!"

"ఆమె చాకులాంటి అమ్మాయిట. నాకు చూడాలని వుంది."

"ఎక్కడ వుందామె?"

"ఉస్మాన్‌సాగర్ పిక్నిక్ కాటేజిలో."

ఇన్‌స్పెక్టర్ నన్ను కోపంగా చూస్తూ అన్నాడు, "నువ్వు జెట్ స్పీడులో దూసుకుపోతున్నావు, నిన్ను కంట్రోలులో వుంచలేను! గో అన్!"

## 7

అటెండర్ నన్ను చూసి, "కాటేజి కావాలా?" అని అడిగాడు.

నేను అడ్డంగా తలవూపి, "ఒక మనిషి కావాలి" అన్నాను.

నిరుత్సాహంగా "ఎవరు?" అని అడిగాడతను.

నేను చుట్టూ ఒకసారి చూశాను. వాతావరణం బాగుంది. సమయం మధ్యాహ్నం పన్నెండు కావస్తోంది. విశ్రాంతి అనుభవించడానికి వచ్చిన జనంతో అక్కడంతా కిటకిట లాడిపోతోంది.

"మిసెస్ జమునాదాస్" అన్నాను.

"క్షమించండి, ఆమెని డిస్టర్బ్ చేయకూడదు" అన్నాడు అటెండర్ వెళ్ళిపోతూ. నేనతని చెయ్యి పట్టుకుని వెనక్కి లాగాను.

'ఎవరు చెప్పారు?" అడిగాను.

'ఆమే చెప్పారు. ఆమె మనసు బాగాలేదు. ఆమెని డిస్టర్బ్ చేయకూడదు!"

"వెల్, అయితే ఒకపని చేయి. ఈ విజిటింగ్ కార్డు ఆమెకు చూపించు. ఆమె ఏం చెబుతుందో నాతో చెప్పు. ఏ కాటేజిలో వుంటోందామె?" అన్నాను.

అతను కార్డునందుకుంటూ, "నెంబర్ ఫోర్"అన్నాడు.

"ఇక్కడ కాఫీ దొరుకుతుందా?"

అతను ఎదురుగావున్న రెస్టారెంట్ చూపించి వెళ్ళిపోయాడు. రెస్టారెంటు దగ్గర బోర్డు చదివాను:

బ్లూసీ పిక్నిక్ కాటేజెస్ అండు రెస్టారెంట్.

ఆ తర్వాత లోనికెళ్ళి కూచున్నాను. కాఫీతాగడం పూర్తయాక అటెండర్ తిరిగివచ్చాడు. "మిమ్మల్ని రమ్మన్నారు" అన్నాడతను.

నేను బయటకువచ్చి అయిదురూపాయల నోటు అతని చేతిలో పెట్టి కాటేజి నెంబర్ ఫోర్ వేపు నడిచాను.

కాటేజి చేరుకుని డోర్ బెల్ నొక్కాను.

"ఎస్, కమిన్ ప్లీజ్" ఒక స్త్రీ కంఠం పలికింది లోపలినుంచి.

నేను తలుపు నెట్టి లోనికి ప్రవేశించాను. ఆమెను చూసి సందేహిస్తూ నిలబడ్డాను. రేణుక గార్డెన్ ఛేర్‌లో కాలుమీద కాలు వేసుకుని కూర్చొని వుంది.

ఆమె చేతిలో "రీడర్స్ డైజెస్ట్" వుంది. ఆకుపచ్చ కళ్ళద్దాలు పెట్టుకున్న రేణుక నన్ను చూసి బలహీనంగా నవ్వి, 'సిడవున్" అంది.

నిశ్శబ్దంగా వెళ్ళి ఆమె ఎదురుగా కూచున్నాను. నన్నొకసారి పరిశీలనగా చూసి, "మిస్టర్ అర్జున్, డిటెక్టివ్?" అనడిగింది.

"యస్, మాడమ్." అన్నాను.

ఆ తర్వాత మా సంభాషణ హిందీలో సాగింది.

"మిస్టర్ అర్జున్, నాకోసం మీరు బెంగుళూర్‌నుంచి వచ్చారా? ఆశ్చర్యంగా వుంది." అందామె. "నేనిక్కడ వున్నట్టు మీ కెలా తెలిసింది? నన్నెందుకు కలుసుకున్నారు? నాకు తెలిసినంతవరకు నేనే నేరమూ చేయలేదే?"

"నాకు తెలిసినంతవరకు మీరే నేరమూ చేయలేదు, మిసెస్ రేణుక." అన్నాను. "నేరం మీ భర్త శ్రీదాస్ చేశారు. మీతో కొన్ని విషయాలు మాట్లాడేందుకు వచ్చాను. మీ మనసు బాగా లేదని నాకు తెలిసింది. మిమ్మల్ని డిస్టర్బ్ చేయడం ఈ పరిస్థితుల్లో తప్పదు!"

"నా భర్త ఏం నేరం చేశారు?" అడిగిందామె కంగారుగా.

"మిసెస్ రేణుక, ముందు నేను ప్రశ్నిస్తాను; మీరు సమాధానాలివ్వండి. ఆ తర్వాత మీ ప్రశ్నలకి నేను

సమాధానాలిస్తాను."

ఆమె అయోమయంగా చూసింది.

"నాకేమీ అర్థమవడం లేదు!"

"మీ భర్త క్యారెక్టర్ ఎలాంటిది?" అడిగాను.

"షటప్ అండ్ గెటవుట్!" రెచ్చిపోయి అరిచిం దామె.

"ఎక్స్‌క్యూజ్ మీ మాడమ్." జాగ్రత్తపడుతూ అన్నాను. "నా ఫ్రెండ్, పార్టనర్, మిస్టర్ పాల్ మీ భర్త కారుకింద పడి చనిపోయాడు–"

"పాల్!" అస్పష్టంగా గొణిగిందామె.

"మీకు తెలుసా?" చటుక్కున అడిగాను.

ఆమె త్రుళ్ళిపడి, "తెలియదు!" అంది.

"వెల్, వెల్. మీరంతగా భయపడనవసరంలేదు. ఈ ఆక్సిడెంట్ కేసులో మీకు సంబంధంలేదు. నా పార్టనర్ డిటెక్టివ్ పాల్ ఏదో కేసు విషయమై ఇక్కడికి వచ్చాడు. అతడి క్లయంట్ ఒక స్త్రీ. రహస్యంగా కేసు దర్యాప్తు చేస్తున్నాడు. ఈ విషయం నాకు తెలియదు. నన్నిక్కడికి రమ్మని ట్రంకాల్ చేశాడు. నేనిక్కడికి వచ్చి అతని మరణవార్త విన్నాను."

"అవును. ఈరోజు పేపర్లో చదివాను." అందామె.

"మిసెస్ రేణుక, మీ భర్త క్యారెక్టర్ గురించి చాలా చెడుగా విన్నాను. ఆయనగురించి మీకేమీ తెలియదా?"

"ఆయన క్యారెక్టరికీ ఆక్సిడెంట్ కీ సంబంధమేమిటి?"

"మీ భార్యాభర్తల మధ్య మనస్పర్థలు రేకెత్తించ డానికి నా కిష్టంలేదు. ఆయన క్యారెక్టర్ గురించి మీరు చెప్పకపోతే, నేనే చెప్తాను."

"చెప్పండి."

"ఆయన క్యారెక్టర్ మంచిది కాదని తేలిస్తే మీరేం చేస్తారు?"

"విడాకులిస్తాను."

నేను ఆశ్చర్యపోయాను.

"అంత త్వరగా నిర్ణయానికి వచ్చేస్తారా?" అడిగాను.

"నా సంగతి మీకు తెలియదు."

ఆమె గురించి డిలాకర్ చెప్పిన మాటలు గుర్తు వచ్చాయి.

"వెల్, మీ హోటల్లో పనిచేసే అమ్మాయిపైన మీ భర్త దౌర్జన్యం చేశారు" అన్నాను.

ఆమె ఉలిక్కిపడింది.

"ఆ అమ్మాయి స్వయంగా నాతో చెప్పింది."

"నిరూపించగలదా?"

"నాకు తెలియదు."

"ఆమెపైన నా భర్త దౌర్జన్యం చేసినట్టు నిరూపిస్తే నేను విడాకులిస్తాను."

"ఆయన్ని క్షమించరా?"

"అసహ్యించుకుంటాను." ఆమె ముఖం కోపంతో ఎర్రబడింది.

"నిజంగా మీకు పాల్ తెలియదా?"

ఆమె కొయ్యబారింది. ఛటుక్కున కళ్ళద్దాలు తీసి టీపాయ్‌పైన పెట్టింది.

"నన్నెందు కనుమానిస్తున్నారు?" ఆందోళనగా అడిగిందామె.

"మీరిందాక 'పాల్!' అని గొణిగారు. అంటే మీకు తెలిసే వుండాలి."

ఆమె ముఖమంతా చెమట పట్టింది.

“పాల్ అంటే మీ కంత భయమా?” అడిగాను.

ఆమె చేతిలోవున్న పుస్తకంతో గాలి విసురుకుంటూ, “భయమా? ఎందుకు!” అంది మూగపోయిన గొంతుకలో.

నేను నవ్వి ఏదో అనబోయాను, కానీ కొయ్యబారి పోయాను.

ఆమె గాలి విసురుకుంటోన్న పుస్తకంలోంచి ఒక విజిటింగ్ కార్డు జారి ఒళ్ళో పడింది.

నేను చటుక్కున ఆ కార్డు అందుకొని చూశాను. ఆ కార్డు కృపాల్ ది.

ఆమె అవమానంతో, తల వంచుకుంది.

“మిసెస్ రేణుక, మీ పరిస్థితి నేనర్థం జేసుకుంటాను. మీకేం భయంలేదు. పాల్ మిమ్మల్ని సహాయపడడానికి ఒప్పుకున్నాడు. నేనూ మీకు సహాయం చేస్తాను” అన్నాను.

“థాంక్స్” అందామె మెరుస్తున్న కళ్ళతో. “కానీ నేనిలా జరుగుతుందనుకోలేదు!”

“ఎలా?”

“పాల్ మరణిస్తాడనుకోలేదు.”

“పాల్ ని మీరెందుకు కలుసుకున్నారు?”

ఆమె గొంతు సవరించుకుని అంది, “నా భర్త నుంచి విడాకులు తీసుకోడానికి. ఆయన క్యారెక్టర్ మంచిది కాదు. నేను మోసపోయాను.”

“ఆయన వయసు మీ వయసుకి రెట్టింపు. ఏం చూసి పెళ్ళి చేసుకున్నారు?”

“డబ్బు.”

“పెళ్ళికాకముందు ఆయనగురించి మీకు తెలీదా?”

“తెలియదు.”

"మీ దేవూరు?"

"కళ్యాణ్ సిటీ, మహారాష్ట్ర. పెళ్ళయాక యిక్క డికి వచ్చాను."

"మీ పెళ్ళెప్పుడయింది?"

"సంవత్సరం క్రితం. పెళ్ళయిన నెలరోజులకే ఆయన అసలు రంగు పసిగట్టాను. పెళ్ళయాక నేనాయనతో గడిపింది ఒక్కరోజే—మొదటి రాత్రి."

"ఐసీ."

"నేనంటే ఆయనకి ఇష్టంలేదు. నిర్లక్ష్యం. మొదటి రాత్రి తర్వాత నన్నింతవరకూ తాకలేదు!"

"దారుణం!"

"నేను విసిగి పోయాను. ఆయన వందలాది ప్రియు రాళ్ళలో నేనొక్కతెని! ఆయన భార్యనుకాను! నాకు విడాకులు కావాలి! ఈ నరకంనుంచి బైట పడాలి!"

"అందుకేం చేసారు?"

"ఆయనన్నుంచి విడాకులు తీసుకోడం అంత సులభం కాదు. పటిష్టమయిన ఆధారాలు సంపాదించాలి. బైట ఆయన సాగించే ప్రేమకలాపాల్లో ఏ ఒక్కదాన్నిరుజువు చేసినా కోర్టు నాకు విడాకులు మంజూరు చేస్తుంది. కాబట్టి ఒక ప్రయివేట్ డిటెక్టివ్ సహాయం కోరాను. పెద్ద మొత్తం ఆశ చూపెట్టాను కాబట్టి అతను ఒప్పు కున్నాడు."

"అయితే ఏం జరిగింది?"

రేణుక అంది, "పదిహేను రోజులక్రితం నేను కళ్యాణ్ వెళ్ళాను, ఇక్కడ ఎండలు భరించలేక. ఆ డిటెక్టివ్‌కి అన్నీ వివరించి చెప్పాను నేను తిరిగి వచ్చే వరకు చక్కటి ఆధారం సిద్ధం చేయాలని. నేను వూరికి

వెళ్ళిన రాత్రే ఆయన హోటల్లో పనిచేసే అమ్మాయిని ఇంటికి తీసుకువచ్చి దాంపత్యం చేశారు. ఆ దృశ్యాన్ని ఫోటోలు తీయబోయిన డిటెక్టివ్‌ని కెమేరా లాక్కుని కొట్టాడు రజాక్. సిటీ వదిలి పారిపోకపోతే ప్రాణాలు వదలక తప్పదని బెదిరించాడట.

ఈ విషయం వెంటనే నాకు ట్రంకాల్ చేసి చెప్పాడు డిటెక్టివ్. నేను బైలుదేరి వచ్చేశానిక్కడికి. ఇక ఈ సిటీలో వుండేందుకతను ఎంతమాత్రమూ ఒప్పుకోలేదు. నేను పదివేలిచ్చాను. వైజాగ్ వెళ్ళి పోయాడు."

"ఆ తర్వాత?"

"నాలో పట్టుదల పెరిగింది. డబ్బుని మించింది సుఖమని బోధపడింది. ఎలాగయినా విడాకులు తీసుకోవాలి. ఇక్కడి డిటెక్టివ్‌లు నాకు సహాయంచేసే సాహసం చేయరని తేలింది. అందువల్ల బెంగుళూరు కెళ్ళాను. ఆ సిటీకి మీరిద్దరు ఫేమస్ డిటెక్టివ్‌లని తెలిసి కృపాల్‌ని శుక్రవారం రాత్రి ఇంటిదగ్గర కలుసుకొని సహాయం అర్థించాను. ఈ విషయం రహస్యంగా వుంచమని కోరాను. మర్నాడుదయం మేమిద్దరం కలిసి యిక్కడి కొచ్చాం. ఆయన 'రాజధాని'లో రూం తీసుకొన్నాడు. నేను ఈ కాటేజి అద్దెకి తీసుకున్నాను."

రేణుక యింకా అంది, "ఆయన పని పగలంతా హోటలులోవుండి రాత్రంతా నా భర్తని కనిపెట్టడం. నాకు విడాకులు లభించేందుకు ఆయన తోడ్పడితే రెండు లక్షలిస్తానని వాగ్దానం చేశాను.

శనివారం రాత్రి ఆయన నా భర్తని షాడో చేశాడు. ఆ తర్వాత నన్ను కలుసుకుని బలమైన ఆధారాలు సంపాదించినట్టు చెప్పాడు. నా భర్త ఒక అమ్మాయితో కలసి

వుండగా ఫోటోలు తీసినట్లూ, వాటిని ఆదివారం సాయంత్రం నాకు అందించగలననీ చెప్పాడు. చెప్పిన ప్రకారం ఆదివారం సాయంత్రం రూమ్ ఖాళీచేసి ఫోటో లతో నా దగ్గరకి వచ్చాడు. ఫోటోలు నాకిచ్చి డబ్బు తీసుకుని ప్లేన్ ఎక్కాలని అనుకున్నాడు. కానీ–కానీ–"

"ఏం జరిగింది?" ఆత్రుతగా అడిగాను.

"ఆ ఫోటోలో వున్నది నా భర్తకాదు!"

"అదెలా జరిగింది?"

"పాల్ పొరబడ్డాడు" అంది రేణుక, "శనివారం రాత్రి పదిగంటలకి ఆయన నా భర్త కారుని ఇంటిదగ్గర వెంటాడాడు. కారులోవున్నది నా భర్తే. కారు ఇరోస్ ముందు ఆగింది. ఆయన కారుదిగారు. పక్కనవున్న నల్లటి అంబాసిడార్ ఎక్కారు. అందులో ఎవరో అమ్మాయి వుంది. కారు బయలుదేరింది. పాల్ టాక్సీలో వెంబడిం చాడు. చీకటి వీధుల్లో- ఆ కారునంబర్ గుర్తించలేక పోయాడు పాల్. నల్ల అంబాసిడార్ కొంతదూరం వెళ్ళాక హఠాత్తుగా అదృశ్యమైంది. ఈ విషయం పాల్‌కి తెలియదు. అదే కారనుకొని మరో నల్ల అంబా సిడార్‌ని వెంబడించాడు. ఫలితంగా వ్యవహారం తారుమా రయింది."

"ఆ తర్వాత ఏం చేశాడు?"

"ఆదివారం సాయంత్రం మళ్ళీ అదే హోటల్‌లో రూం తీసుకున్నాడు. జరిగిన పొరపాటుకి క్షమించ మన్నాడు. ఆదివారం రాత్రి ఎలాగైనా పని పూర్తిచేస్తా నన్నాడు. కానీ, ఆ రాత్రి నా భర్త ఎక్కడికీ వెళ్ళలేదు! పాల్ సోమవారం రాత్రి కనిపెట్టాలనుకున్నాడు. కానీ, అతను ఆక్సిడెంట్‌లో మరణించాడని నాకు ఈ ఉదయం

పేపర్‌లో చదివేదాకా తెలియదు!''

రేణుక చెప్పడం పూర్తిచేసి నాకేసి చూసింది.

"మీ భర్త కారు నెంబర్ మీకు తెలుసా?"

"MSQ 9000."

"డూప్లికేట్ నెంబర్ వాడుతున్నట్లు తెలుసా?"

"తెలియదు."

"థాంక్స్, రేణుకా" అన్నాను లేచినిలబడి. "చాలా ముఖ్యమైన వివరాలు అందించారు. దాస్‌ని పాల్ షాడో చేయడంవల్ల హత్యచేయబడ్డాడు. అతని ప్రాణం విలువ రెండు లక్షలు! వెల్, ఫరవాలేదు. ఆడవాళ్ళంటే అతనికి జాలి ఎక్కువ. మీకావలసింది విడాకులు. పాల్ ఇచ్చిన మాటను నేను నిలబెడతాను. దాస్‌ని చట్టానికి అప్పగించి, మిమ్మల్ని ఈ నరకంనుంచి విడిపించి, ఇక్కడ నుంచి వెళతాను. గుడ్ బై!"

# 8

ఈ ఉదయం నేను దర్యాప్తు చేసిన వివరాలు దేవిడ్‌కి చెప్పాను.

"అర్జున్, నిన్ను మెచ్చుకోవాలో హెచ్చరించాలో అర్థంగావడం లేదు!" అన్నాడు దేవిడ్ అంతా విని. "నువ్వు దాస్‌ని హంతకుడిగా ఎలా పట్టుకుంటావో అంతు చిక్కడంలేదు. నీకైనా తెలుసా?"

"తెలియదు."

"మరి?"

"ఒక పని చేయండి," అన్నాను. "ఈవినింగ్ ఎడిషన్‌కి డెడ్‌లైన్ దాటిపోయే ముందు పత్రికలకి ఒక ప్రకటన ఇవ్వండి: నిన్న సాయంత్రం లిబర్టీ దగ్గర పాల్ అనే డిటెక్టివ్‌ని గుద్ది తప్పించుకున్న కారు నెంబర్

APX 720050. అని తెలిసింది. అది రెడ్ కలర్ బెంజ్. దాని ఆచూకీ తెలిపిన వారికి పదివేలు బహుమతి. ఈ విషయంలో ప్రజలు పోలీసులతో సహకరిస్తారని ఆశిస్తున్నాం."

"కానీ, బహుమతి ఎవరిస్తారు?"

"రేణుక."

"ఇలా చేయడంవల్ల ప్రయోజనం ఏమిటి?" అడిగాడు డేవిడ్. "అది ఫేక్ నెంబరని మనకు తెలుసుకదా? కారెలా దొరుకుతుంది."

"కారు దొరకదు" అన్నాను. "కానీ ఆ నెంబర్ ప్రజలకందరికీ తెలిసిపోతుంది. హడావుడి మొదలవుతుంది బహుమతికోసం. ప్రతి రెడ్ కలర్ బెంజ్‌ని, యజమానిని కనిపెట్టి వుంటారు. సిటీలో రెడ్ కలర్ బెంజ్‌లెన్ని వున్నాయి?"

"మూడు."

"ఆ లైసెన్స్ ప్లేట్లు దాస్ దగ్గరవున్నాయని నా అనుమానం. ఇంకా కొన్ని వివరాలు కనుక్కుని మీకు తెలియజేస్తాను. అయితే ఆ కారుగురించి వివరాలు ఈ రాత్రి 9 గంటలలోపు మాత్రమే అందించాలని ప్రకటించండి. ఆ బహుమానం ప్రజలకేకాదు, డిటెక్టివ్‌లకీ, పోలీసులకీ వర్తిస్తుంది. ఎటువంటి వివరాలూ అందవని నాకు తెలుసు. దాస్‌ని పట్టుకునేందుకు ప్రజల్లో ఇలాంటి అలజడి రేపడం అవసరం. ఏమంటారు?"

"ఎలా పట్టుకుంటావు! నాకు నవ్వు వస్తోంది!"

"ఎలా పట్టుకుంటానో తొమ్మిది గంటలకి తెలియజేస్తాను. వెల్?"

నేను అక్కడనుండి హోటలుకి బయలుదేరాను.

మధ్యాహ్నం మూడు గంటలకి నిద్రపోయాను. కానీ సరిగా నిద్రపట్టలేదు.

రజాక్ గురించి ఆలోచనలు నిద్రపోనివ్వడం లేదు. అత డెక్కడ వున్నాడో, ఏం చేస్తున్నాడో అంతుబట్టలేదు. నాపైన దాడికి అత డెలాంటి ప్రయత్నాలు చేస్తున్నాడో అర్థంకాలేదు. నన్ను చంపాలని అతను నిశ్చయించుకుంటే పాల్ ని చంపినట్టే చంపుతాడా? అలా జరిగితే దాస్ బెంజ్ కి మళ్ళీ ఫేక్ నెంబర్లు తగిలిస్తాడు.

కానీ, సాయంత్రం పేపర్లో ప్రకటన చదివితే ఏం చేస్తాడు? ఆ నెంబర్ ప్లేట్లు కారుకి తగిలించి, నన్ను చంపే ధైర్యం చేస్తాడా? లేక విరమించుకుని మరో మార్గం ఎన్నుకుంటాడా! ఏ అర్ధరాత్రో ఈ హోటల్ కి వచ్చి నన్ను కాల్చి చంపుతాడా? అలా చేయడు. ఈ హోటల్ దాస్ ది. అయితే ఏ నడి వీధిలోనో పబ్లిగ్గా కాలుస్తాడా? అందుకవకాశం వుంది.

ఏడు గంటలకి నేను దిలావర్ ని కలుసుకోబోతున్నాను. నాపైన రజాక్ అఘాయిత్యం జరపాలంటే అప్పుడే అవకాశం వుంటుంది.

కానీ సాయంత్రం ఏడు గంటలకి నేను గోల్కొండ క్రాస్ రోడ్సులో క్షేమంగా బస్సుదిగాను. బస్సులోగాని, బస్సు వెనకగానీ రజాక్ నన్ను వెంటాడలేదు.

ఆ సాయంత్రం పత్రికల్లో ప్రకటన చదివాక ప్రజలు తమ పన్లు మానుకుని, ప్రకటించిన కారుని వెతకడంలో బిజీగా వున్నారు. ఎటుచూసినా ఆ కారుగురించి వ్యాఖ్యానాలే. ఎవరి ముఖంలో చూసినా చెప్పలేనంత ఉత్సాహం.

బస్సుదిగి చుట్టూ తిరిగి చూశాను. బస్ స్టాప్ కెదురుగా

ఒక హోటల్ వుంది. దిలావర్ బయటనిలబడి నవ్వుతూ చెయ్యి వూపుతున్నాడు. నేను అటు వేపు అడుగులేశాను. సంతోషంగా నా చెయ్యి పట్టుకుని లోనికి లాక్కెళ్ళాడు. లోపల విపరీతమైన రద్దీ వుంది.

మేం ఓ మూల కూచున్నాం.

దిలావర్ ముఖంలో చెప్పలేనంత ఆనందం కన్పిస్తోంది. ఎందుకో చాలా ఉషారుగా వున్నాడు. స్టేట్ ఎక్స్‌ప్రెస్ ఆఫర్ చేసి కారణం అడిగాను.

అతను అదోలా నవ్వి వూరుకున్నాడు.

ఇంతలో కస్టమర్స్‌లో కలకలం బయలుదేరింది. అంతా గుంపుగా చేరి దేనికోసమో ఎగబడుతోన్నారు. అందులో వూపిరాడక నలిగిపోతున్న మనుషులు చేతుల్లో కాయితం ముక్కలతో బయటపడుతున్నారు.

ఆ కాయితం ముక్కలు సాయంత్రం ఎడిషన్ న్యూస్ పేపర్ తాలూకువి.

దిలావర్ నన్ను చూసి మరోసారి నవ్వి, "ఫూల్స్!" అన్నాడు.

"ఎందుకు?" అన్నాను.

దిలావర్ మళ్ళీ నవ్వి వూరుకున్నాడు. నేను మాటాడలేదు. అప్పటికి చీకటిపడింది. హోటల్లో లైట్లు వెలిగాయి. సర్వర్ రెండు టీలు తెచ్చిపెట్టాక నెమ్మదిగా తాగసాగాం.

దిలావర్ నావేపు మాటిమాటికి దొంగ చూపులు చూస్తూ టీ తాగుతున్నాడు. నేనతడ్ని ఓ కంట కనిపెట్టాను.

"నేను నేపాల్ వెళ్ళిపోవాలనుకుంటున్నాను" అన్నాడతను టీ తాగాక.

"ఎందుకు?" అడిగాను.

"బిజినెస్ చేయాలని వుంది."

"పెట్టుబడి వుందా?"

"సంపాదిస్తాను."

అతని ఉద్దేశ్యం నా కర్థమైంది. ప్రకటించిన బహుమతి దక్కించుకోడానికి ఎత్తులు వేస్తున్నాడు. ఆ లైసెన్స్ ప్లేట్స్ గురించి అతనికి తెలుసు.

"ఆ కారు నీకు తెలుసా?" ఏమీ తెలియనట్టు అడిగాను.

అతను తృప్తిపడి, "ఏ కారు?" అని అడిగాడు.

"నువ్వు బహుమతి సంపాదించే కారు" అన్నాను.

"మీరెలా వూహించారు?"

"నేను పోలీసు మనిషిని."

దిలావర్ ఫకాలున నవ్వి, "మరో టీ తెప్పించండి" అన్నాడు.

సర్వర్ తెచ్చి పెట్టాడు.

"వెల్, దిలావర్. ఇక బిజినెస్ మాట్లాడుకుందాం" అన్నాను. అతను తల వూపాడు.

"దిలావర్, ఇక మనిద్దరం స్నేహితులం. మోసానికి ఆస్కారం ఉండకూడదు. నువ్వు నీ బాస్‌కి మోసం చేయదల్చుకున్నావు. అంటే నీ ప్రాణాలతో చెలగాట మాడుతున్నావు. బాస్‌కి నీపైన అనుమానం వస్తే నువ్వు కాదు, నీ శవం నేపాల్ వెళుతుంది. అంటే నీకు బహుమతి దక్కదు. నీ భార్యాపిల్లలకి నీ శవం బహుమతిగా వెళుతుంది. ఆలోచించు."

"ఆలోచించాను." అన్నాడు వెంటనే దిలావర్' "ఇక మన బిజినెస్ గురించి మాట్లాడండి."

నేనతడ్ని సూటిగా చూసి, "ఆకారు ఎక్కడ

వుంది?" అన్నాడు.

"ఆకారు బాస్‌దే" అన్నాడు దిలావర్. "కానీ, అప్పుడప్పుడు లైసెన్స్ ప్లేట్లు మారుతుంటాయి."

"అంటే, ఆ రోజూ ఆక్సిడెంట్ తప్పదన్నమాట?"

"అవును."

"వెల్, ఆ ప్లేట్స్ గురించి చెప్పు."

"అవి ఎప్పుడూ కారుగ్యారేజ్‌లో టూల్‌బాక్స్‌లో వుంటాయి. ఈ ప్లేట్లు మార్చడం ఎప్పటినుంచి జరుగుతోందో నాకు తెలియదు. కారు నెంబర్ రోజూ చూసే అవసరం నాకేముంది? కానీ, మూడు నెలల క్రితం కారు బయటకి వెళుతున్నప్పుడు అనుకోకుండా నంబర్ చూశాను. నాకేమీ అర్థంకాలేదు. నెంబర్ మారివుంది. కారు మార్చారేమో అనుకున్నాను. ఆ తర్వాత తరచు ఆ ప్లేట్స్‌తో కారు బయటకు వెళ్ళడం చూశాను. ఒక రోజు రాత్రి రహస్యంగా గ్యారేజి చెక్ చేశాను. అసలు విషయం అర్థమైంది. కానీ అంతగా పట్టించుకోలేదు."

"ఆ ప్లేట్స్ ఇప్పుడెక్కడ ఉంటాయి?"

"తప్పకుండా గ్యారేజిలో వుంటాయి."

"నమ్మకమేనా?"

"వెళ్ళి చూడండి."

"ఆల్‌రైట్ దిలావర్, మోసానికి ఆస్కారముండకూడదని ముందే చెప్పుకున్నాం. నువ్వు చెప్పినట్టుగా అక్కడ ఆ ప్లేట్స్ వుంటే, పోలీసులు స్వాధీనం చేసుకున్నాక నీకు బహుమతి అందుతుంది. అంతేకాదు, నీకు పోలీసు రక్షణకూడా ఉంటుంది. కాబట్టి నువ్వు భయపడనవసరంలేదు___"

నేను ఉలిక్కిపడి మాటలాపేశాను.

ద్వారంలో రజాక్! అతని వెనుక ముగ్గురు రౌడీలు!

నావళ్లు చల్లబడి చెమటలు కారుతున్నాయి. కాళ్లు చేతులు విపరీతంగా వణుకుతున్నాయి. గొంతు ఎండి పోయింది. నాపరిస్థితిచూసి గాభరాపడి "ఏం జరిగింది?" అన్నాడు దిలావర్.

"ర_జా_క్!" అస్పష్టంగా గొణిగాను. దిలావర్ హోటల్ ద్వారంకేసి చూసి తృళ్ళిపడి తటాలున లేచి బయటికి ఉరికాడు.

కానీ రజాక్ అతడ్ని పట్టుకుని లోనికి విసిరేశాడు. దిలావర్ గట్టిగా అరుస్తూ టేబిల్ మీద పడ్డాడు. టేబుల్ మీది కప్పులూ, గ్లాసులూ క్రిందపడి పగిలాయి. జనం భయంతో కేకలేస్తూ బయటికి పారిపోయారు.

నేను పారిపోవడానికి ప్రయత్నించడం కంటే ఎదు ర్కోవడం మంచిదని నిశ్చయించుకున్నాను.

టేబిల్ మీదపడ్డ దిలావర్ ఛటుక్కునలేచి వాళ్ళ మీదికి దూకాడు. కానీ వాళ్ళంతా కలసి అతడ్ని నా మీదికి విసిరారు. నేనూ దిలావర్ వెనక్కి పడ్డాం.

అంతే, ఇక తీవ్రమయిన పోరాటం ప్రారంభమైంది. రజాక్ నన్ను పట్టుకుని ఎక్కడపడితే అక్కడ కొడు తున్నాడు. నేను టేబిల్ మీదవున్న టీ కప్పును అతని ముఖంమీదికి విసిరాను. రజాక్ కెవ్వుమని కేకవేసి కాలితో నా డొక్కలో తన్నాడు. నేను బాధతో అరుస్తూ నేలమీదపడి కళ్ళుమూసుకున్నాను,

రజాక్ నాపైనదూకి కంఠం పట్టుకున్నాడు. దిలా వర్ అతని తలకేసి నాలుగు గ్లాసులు విసిరాడు. అంతే! ఇక నేనూ దిలావరూ కలిసి గ్లాసులూ, కప్పులూ వాళ్ళ మీదికి విసరడం ప్రారంభించాం.

మా దాడిని తట్టుకుంటూ రజాక్ జేబులోంచి కత్తి తీశాడు. మేం ఛటుక్కున వెనక్కి తిరిగి బయటికి పరుగు తీశాం. వాళ్ళంతా అరుస్తూ మా వెంట బడ్డారు.

మెయిన్ రోడ్ మీదకాక హోటల్ పక్కసందు లోకి మేం ఉరికాం. వీధి దీపాల్లేవు. చీకటిగావుంది. మా అరుపులు విని అందరూ తలుపులూ, కిటికీలూ మూసు కుంటున్నారు.

మాకు యాభైగజాల వెనుకవుంది రజాక్ ముఠా. మేం తప్పించుకోకపోతే ప్రాణాలు దక్కవు. చీకటిగా ఉన్న పక్కవీధిలోకి తిరగబోయి కుప్పగా పోసివున్న కంకరాళ్ళమీద పడ్డాం.

అంతే! మరుక్షణం ఆలస్యం చేయకుండా శత్రువుల పైన రాళ్ళవర్షం కురిపించాం.

# 9

ఇన్‌స్పెక్టర్ మమ్మల్ని చూసి గాభరాపడ్డాడు.

మేం రజాక్ ముఠానుంచి తప్పించుకొని సరాసరి హెడ్‌క్వార్టర్స్‌కి వచ్చిపడ్డాం వళ్ళంతా గాయాలూ, రక్తంతో.

భయం భయంగా చూస్తోన్న ఇన్స్పెక్టర్‌ని చూసి నేను నవ్వాను. అప్పటికి సమయం ఎనిమిది దాటింది. డేవిడ్ ఏదో చెప్పడానికి తడబడుతున్నాడు కానీ ఏమీ చెప్పలేకపోతున్నాడు.

"పేపర్ ప్రకటన బాగా పనిచేసింది" అన్నాను సంభాషణ ప్రారంభిస్తూ.

డేవిడ్ రెచ్చిపోయి, "ఏం జరిగింది! ఏమిటిదంతా!" అంటూ అర్చాడు.

అతని ఎర్రబడ్డ ముఖాన్ని చూసి నేను తల దించు

వున్నాను. డేవిడ్ నా దగ్గరకివచ్చి గడ్డం పట్టుకొని నా కళ్ళలోకి తీక్షణంగాచూస్తూ, "నీవు బ్రతకాలని లేదు! మేంచేయలేని సాహసాన్ని మతిచెడి నువ్వు చేస్తున్నావు. అర్జున్, నిన్ను అదుపుచేయలేము!" అన్నాడు నిస్పృహాగా.

నేను కాసేపు మౌనం వహించి ఆ తర్వాత జరిగిందంతా వివరించాను. అంతా విన్న డేవిడ్ నుదుటిపైన చెమటలు పట్టాయి.

ఫేక్ లైసెన్స్ ప్లేట్స్ గురించి నాకు దిలావర్ చెప్పిందంతా డేవిడ్‌కి తెల్లడించాను. అతను ఆసక్తిగా విని, "ఇక ఆలస్యం ఎందుకు? రైడింగ్ చేద్దాం!" అన్నాడు.

"రైడింగ్ చేస్తే ఆ ప్లేట్స్ దొరుకుతాయి, కానీ దాస్ దొరకడు" అన్నాను.

"అదెలా? వివరించు."

"దాస్‌ని రెడ్ హాండెడ్‌గా, క్రిమినల్‌గా పట్టుకోవాలంటే ఒకే ఒక్క మార్గం వుంది" అన్నాను. "అతడ్ని ఏదైనా ట్రాప్‌లో బంధించడం."

"ఏమిటా ట్రాప్?"

"ఆలోచించాను" అన్నాను. "బాగా ఆలోచించే ఈ నిర్ణయానికి వచ్చాను. పటిష్టమైన ప్లాను తయారు చేశాను. ఇందులో కమీషనర్ సహకారం చాలా అవసరం. మీరు ఆయనతో చెప్పండి. నేను తయారుచేసిన ప్లాను ఈ రాత్రి తొమ్మిదిన్నరకి ప్రయోగించబోతున్నాం. ఈ ప్లాను గనుక ఫెయిల్ అయితే ఇక దాస్ ఎన్నటికీ దొరకడు!"

"వెల్, నీ ప్లాను చెప్పు."

"కాయితం కలం ఇవ్వండి" అన్నాను.

డేవిడ్ వాటిని అందించాడు.

ఆ కాయితంపైన కలంతో నేనిలా వ్రాశాను:—

"పట్టణ పౌరులకు ఒక ముఖ్య ప్రకటన!

ప్రముఖ డిటెక్టివ్ కృపాల్ హత్యకేసుకి సంబంధించి ఈ సాయంత్రం పత్రికల్లో పోలీసులు ఇచ్చిన ప్రకటన ఎలాటి సత్ఫలితాలనూ ఇవ్వలేకపోయింది. కోరిన వివరాలు అందించడానికి నిర్ణయించిన సమయం దాటిపోయినందున, ఎలాటి వివరాలు అందనందున పోలీసులు ఒక నిర్ణయానికి వచ్చారు.

ఆక్సిడెంట్ చేసి తప్పించుకున్న రెడ్ కలర్ బెంజి కారు నెంబరు APX 720050 కాదనీ, అది పోలీసుల్ని పెడదారి పట్టించడానికి ఉపయోగించిన నకిలీ నెంబర్ అనీ అనుమానిస్తున్నారు.

కాబట్టి ఈ రాత్రి సరిగ్గా 10 గంటలకి నగరంలోవున్న మూడు రెడ్ కలర్ బెంజికారుల యజమానుల ఇంటికి వెళ్ళడానికి నిశ్చయించుకున్నారు. ఆ యా యజమానులు ఇళ్ళని సోదాచేయడానికి తమతో సహకరించాలని పోలీసులు కోరుతున్నారు. సోదా రాత్రి సరిగ్గా 10 గంటలకి ప్రారంభమవుతుంది.

ప్రకటన సమాప్తం!"

వ్రాసింది ఒకసారి చదివి డేవిడ్ కి అందించాను. అతను ఆసాంతం చదివి నొసలు చిట్లించాడు.

"ఏమిటది?"

"రేడియో ప్రకటన. ఈ రాత్రి సరిగ్గా 9.30కి వెలువడాలి—మూడు భాషల్లో! ఇంగ్లీషు, తెలుగు, హిందీ" అన్నాను.

"ఏమిటి నీ ఉద్దేశ్యం?"

"ఇన్‌స్పెక్టర్, ఈ ప్రకటన విన్నాక దాస్ బోనులో పడ్డ పులి అవుతాడు. ఏం చేయాలో తోచదు. ఆ లైసెన్స్ ప్లేట్స్‌ని నాశనం చేయకపోతే రాబోతున్న ప్రమాదం నుంచి తప్పించుకోలేడు. ప్లేట్స్ గ్యారేజీలో వున్నట్టు దిలావర్ చెప్తున్నాడు. కానీ అక్కడ వుండవనుకుంటాను. ఎక్కడ వున్నా దాస్ మనల్ని వాటి దగ్గరికి దారి చూపిస్తాడు. మనం రెడ్‌హాండెడ్‌గా అతడ్ని పట్టుకోవచ్చు."

"వెల్, బాగుంది." అన్నాడు డేవిడ్. "ఈ ఆపరేషన్‌ని ఎలా నిర్వహించాలో వివరంగా చెప్పు."

నేను చెప్పాను.

"దాస్ ప్రకటన వింటాడని గ్యారంటీ ఏమిటి?" అనివ్వాడు డేవిడ్.

"వినమని నేను చెప్తాను. విని తీరుతాడు!" అని రిసీవర్ అందుకుని దాస్ నెంబర్ డయల్ చేశాను. కొన్ని క్షణాల్లో దాస్ లైన్‌లోకి వచ్చాడు.

"హల్లో దాస్, బాగున్నారా"' అన్నాను హిందీలో.

"హూ ఆర్యూ?" అర్చాడతను.

"మిస్టర్ అర్జున్, ది డిటెక్టివ్."

"ఓ, నువ్వా! సత్కారం బాగా జరిగిందనుకుంటాను?"

"మీ రజాక్‌కి నా తరఫున థాంక్స్ చెప్పండి."

"షటప్! వాటీజ్ ది మాటర్?"

"మీకో ముఖ్యమైన విషయం చెప్పాలి."

"ఏమిటి?"

"ఈ రాత్రి సరిగ్గా తొమ్మిదిన్నరకి—"

"తొమ్మిదిన్నరకి?"

"రేడియో పెట్టండి" తక్కున లైను కట్ చేశాను. దాస్ తికమకపడ్డాడని నాకు తెలుసు. ఈ తతంగం ఏమి

టన్న క్యూరియాసిటీతో తప్పకుండా రేడియో ఆన్ చేస్తాడు. ఇది నిశ్చయం!

నవ్వుతూ డేవిడ్‌ని చూశాను. "సక్సెస్" అన్నాను. "ఈ దెబ్బతో దాస్ ఆటలుకట్టు! మీరు త్వరగా రేడియోకి ప్రకటన ఇవ్వండి. ఆ తర్వాత ఏర్పాట్లు చూడండి!"

డేవిడ్ ఇంకా నమ్మనట్లుగా చూశాడు నావంక.

# 10

కమీషనర్, డేవిడ్‌నీ, మరో యిద్దరు ఇన్‌స్పెక్టర్లనీ, నన్నూ చూశాడు. చీకట్లో అతనికళ్ళు మెరుస్తున్నాయి. మేం ఇప్పుడు జీపులో సేఠ్ జమునాదాస్ బంగళా ప్రాంతాల వున్నాం.

డేవిడ్ మెడలో ఫ్లాష్‌బల్బ అమర్చిన కెమెరా వుంది. నా ఒడిలో వెస్టన్ టేప్‌రికార్డర్ వుంది. ఆ యిద్దరు ఇన్‌స్పెక్టర్ల చేతుల్లో రివాల్వర్స్ వున్నాయి.

దాస్ బంగళా ఫర్లాంగు దూరంలో వుండగా మేం జీపుదిగి నడక ప్రారంభించాం. ఆ ప్రాంతం బ్లాక్ అవుట్ అవడానికి సమయం ఇంకా అయిదు నిమిషాలే వుంది.

మేం గబగబ నడిచి బంగళా గేటు చేరుకున్నాం. గేటు దగ్గర రాత్రిడ్యూటీ చేస్తోన్న గూర్ఖా బీడీ అవతలకి విసిరేసి విస్తుపోయి చూశాడు. ఇన్‌స్పెక్టర్ ఖాదర్ అతనికి రివాల్వర్ చూపించాడు.

"గుడ్!" అన్నాడు కమీషనర్. "ఖాదర్, యీ గూర్ఖాతో మీరిక్కడే వుండండి. మేం నలుగురము లోనికి వెళతాం."

హఠాత్తుగా బంగళాలోని దీపాలు ఆరిపోయాయి. చుట్టూతిరిగి చూశాను. ఎక్కడా దీపాల్లేవు. ఆ ప్రాంత

మంతా చీకట్లో కలిసిపోయింది.

"కమాన్, క్విక్!" అన్నాడు కమీషనర్, గేటు లోంచి లోనికి ఉరుకుతూ. మేం అతని వెంట వురికాం. సమయం చకచకా గడిచిపోతోంది. ఆరు నిముషాల్లో దీపాలు వెలుగుతాయి. ఈ లోపున మేం బంగళా చేరుకోవాలి. ఆవరణ అంతా చడీచప్పుడు లేకుండావుంది.

లైట్లు వెలగడానికి ఒక్క నిముషం వుందనగా మేం బంగళా వెనకభాగం చేరుకున్నాం. ఒక చెట్టు వెనుక నిలబడి ఆయాసం తీర్చుకుని నెమ్మదిగా బంగళా వేపు కదిలాం. లైట్లు వెలిగాయి.

ఇప్పుడా ముగ్గురు అధికారుల చేతుల్లో రివాల్వర్స్ వెలుగుతున్నాయి.

"సర్, దాస్ ఏ గదిలో వున్నాడో కనుక్కొని వస్తాను" అన్నాను కమీషనర్‌తో.

అతను తలవూపాడు.

నేను బంగళా ఎడమవేపు కదిలాను. రెండంతస్తుల ఆ బంగళాలో కింది భాగంలో వరసగా చుట్టూ కిటికీలున్నాయి వెలుపలినుంచి.

ఒక్కొక్క కిటికీవద్ద ఆగుతూ ముందుకు కదిలాను. మొత్తం పన్నెండు కిటికీలు దాటాక పదమూడో కిటికీ దగ్గర ఆగిపోయాను.

ఆ కిటికీలోంచి వెలుతురు బయటకి వస్తోంది. కిటికీ నానుకుని పూలకుండీలున్నాయి. నేను వాటిచాటున నక్కి లోనికి తొంగిచూశాను. గుండె వేగంగా కొట్టుకుంది.

గది మధ్యలో దాస్ పడక కుర్చీలో కూచొని ముందుకీ వెనక్కీ వూగుతూ సిగార్ కాలుస్తున్నాడు.

అతని కెదురుగా ఆత్రుత నిండిన ముఖంతో నిలబడి వున్నాడు రజాక్.

టీపాయ్ పైన ట్రాన్సిస్టర్ వుంది.

దాస్ క్షణక్షణానికీ గడియారం చూస్తూ అసహనంగా గదుపుతోన్నాడు.

నేను వెనక్కి తిరిగాను. రెండు నిముషాల్లో అధికారులను వెంటబెట్టుకుని తిరిగివచ్చాను.

ప్రకటన వెలువడడాని కిప్పుడు సమయం రెండు నిముషాలేవుంది. దాస్ కుర్చీలోంచి లేచి కాలుకాలిన పిల్లిలా తిరుగుతూ కసురుకుంటున్నాడు. రజాక్ తదేకంగా ట్రాన్సిస్టర్ నే చూస్తున్నాడు.

మేంవూపిరి బిగబట్టి కాచుకున్నాం.

తిరుగుతున్న వాడల్లా తక్కున ఆగిపోయి గడియారం చూశాడు దాస్. ఒకే ఒక్క నిముషంవుంది. వెంటనే అర్చాడు, "ఆన్ చెయ్!"

రజాక్ ఛటుక్కున వంగి ట్రాన్సిస్టర్ ఆన్ చేశాడు. అక్కడి ఉద్రిక్త వాతావరణాన్ని శాంత పరచాలని కాబోలు, శాస్త్రీయ సంగీతం వెలువడింది.

దాస్ కోపంగా, "ఓహ్, నాన్సెన్స్!" అని కసిరాడు.

శాస్త్రీయ సంగీతం ఆగిపోయింది. లేడి అనౌన్సర్ కంఠం వెలువడింది:

పట్టణ పౌరులకు ఒకముఖ్య ప్రకటన...

తెలుగులో ప్రకటన చదువుతోందామె. దాస్ కేమీ అర్థంగావడంలేదు. రజాక్ ముఖంలో రంగులు మారుతుతున్నాయి.

ప్రకటన పూర్తిగా వినకుండానే అతను అర్చాడు, "బాస్ కొంప మునిగింది!"

"ఏం జరిగింది?" అడిగాడు దాస్ గాభరాగా.

ఇంతలో హిందీలో ప్రకటన ప్రారంభమయింది. రజాక్ నోరు తెరిచి అలాగే వుండిపోయాడు. దాస్ చెవులు రిక్కించాడు. అతని ముఖకవళికలు వేగంగా మారుతు వున్నాయి. ప్రకటన ముగిసినా షాక్ నుంచి తేరుకోలేదు.

"బాస్!" రజాక్ కేకేశాడు. "ఇప్పుడేం చేయాలి?"

నేను టేప్ రికార్డర్ ఆన్ చేశాను.

"బాస్టర్డ్! ఇంకేం చేస్తావ్! ఆ ప్లేట్స్ యెక్కడ వున్నాయోతీసి నాశనం చేయ్!" దాస్ అర్చాడు.

రజాక్ కళ్ళు తళుక్కున మెరిశాయి. అతని పెదవుల పైన విషపునవ్వు నిలిచింది. అతడ్ని చూసి భయపడ్డాడు దాస్.

"బాస్టర్డ్! ఇంకేం చూస్తావ్! పరిగెత్తు!!"

రజాక్ పకపకమని నవ్వాడు. దాస్ షాక్ తిన్నాడు అతడి ధోరణికి.

"బాస్, మీరెందుకంత భయపడుతున్నారు?"అన్నాడు రజాక్. "నాశామాత్రం తెలియదా? బాస్, మీరు నన్ను చాలా తక్కువగా అంచనా వేస్తున్నారు! ఇది దారుణం!"

"ఏమిటి నువ్వనేది?"

"పదిలక్షలివ్వండి. ఆ పని చేస్తాను."

దాస్ రజాక్ మాటలువిని స్థాణువయాడు.

"యూ డర్టీ బిచ్! బ్లాక్ మెయిల్ చేస్తున్నావా?"

రజాక్ వెకిలిగానవ్వి "నేను అవకాశవాదిని. ఎలాంటి అవకాశాలనీ వదలను. బాస్, టైంగడిచిపోతోంది!

నేను చెప్పినట్టు మీరుచేస్తే, మీరు చెప్పినట్టు నేను చేస్తాను."

"నోర్ముయ్! ఆ ప్లేట్స్ ఎక్కడ పెట్టావు?"

"పదిలక్ష లివ్వండి!"

దాస్ తటాలున ముందుకు దూకి రజాక్ దవడమీద గుద్దాడు. బాధతో కీచుమన్నాడు రజాక్.

"బేటా, దారికొచ్చావా?"

"నో సేర్, నో!" బాధనీ, కోపాన్నీ అణుచుకుంటూ అన్నాడు రజాక్.

"మీరు పది లక్షలివ్వకపోతే నా దారిన నేను పోతాను గానీ, మీ దారికి రాను. ఆ తర్వాత ఏం జరుగుతుందో మీకు తెలుసు. మరో ఇరవై నిముషాల్లో పోలీసులు ఇక్కడికి వచ్చేస్తారు. ఇల్లంతా గాలిస్తారు. ఆ నకిలీ నెంబర్ ప్లేట్స్ దొరుకుతాయి. అంతే! ఆ తర్వాత ఏం జరుగుతుందో మీకు తెలుసా? జైలుకెళతారు! బహుశా ఉరి శిక్ష తప్పదు. హాహా హాహా!"

"అలాగా? సరే, నేను జెయిలు కెళతాను, కానీ నువ్వు అరడుగుల గోతిలో కెళతావు!" అన్నాడు దాస్ సొరుగులోంచి రివాల్వర్ తీస్తూ.

అది చూసి బెదిరిపోయి రజాక్ దాస్ మీదికి దూకి రివాల్వర్ లాక్కున్నాడు.

"ఇప్పుడు దారి క్లియరైంది కదూ, సేర్?" గర్వంగా నవ్వుతూ అన్నాడు రజాక్. "మీ భవిష్యత్ నా చేతిలో వుంది. పదేళ్ళుగా మీరు నాపైన వుంచిన విశ్వాసాన్ని నేను వమ్ము చేసినందుకు విచారించకండి! ఇంతకాలం మీ సుఖంకోసం నేనెంత శ్రమించానో మీకు తెలుసు. అమ్మాయిల్ని తార్చే బ్రోకర్ గా, స్మగ్లింగ్ బిజినెస్ లో

మీ ఏజెంటుగా, మీ శత్రువుల్ని హతమార్చే హంతకుడిగా నేను చాలా నీచమైన పనులుచేశాను. నాపైన నాకు అసహ్యం ఎప్పుడు ఏర్పడిందో తెలుసా? మీ భార్య రేణుక స్థితి చూసినప్పటినుంచీ. ఆమె లైఫ్‌ని మీరు పాడు చేశారు! అప్పటినుంచీ మీపైన నాకున్న గౌరవం, భక్తి పోయాయి. మీకు బుద్ధిచెప్పాలని నిశ్చయించుకున్నాను. నేను అవకాశవాదిని. ఇప్పుడవకాశం దొరికింది, కాబట్టి బుద్ధిచెప్తాను. ఆ ప్లేట్స్ పోలీసులకి దొరక్కుండా వుండా లంటే మీరు రెండు షరతులకి ఒప్పుకోవాలి. ఒకటి: పిచ్చి తిరుగుళ్ళుమాని, మీ భార్యని ప్రేమించాలి. రెండు: నాకు పది లక్షలివ్వాలి. ఈ వెధవ బ్రతుక్కి ఇక్కడే సమాధికట్టి విదేశాలకెళ్ళి బ్రతుకుతాను. ఓ.కే?"

"ఆ ప్లేట్స్ ఎక్కడ వున్నాయి?"

"వెల్, ఇది మంచి ప్రశ్న!" అన్నాడు రజాక్. "ఈ ప్రశ్న మీరు అరగంట క్రితం అడిగివుంటే చెప్పివుండే వాడ్ని."

దాస్ అసహాయపు చూపులు చూశాడు. రజాక్ చేతిలో రివాల్వర్ వుంది.

"సరే, రజాక్!" చివరికి అన్నాడు దాస్. "నన్ను మోసం చేశావు! పది లక్షలు నా ఆస్తిలో పదోవంతు కూడా కాదు! ఆ డబ్బు నీ ముఖాన కొడతాను. ఆ ప్లేట్స్ నాకిచ్చేయ్! ఆ తర్వాత చూడు, ఆట నువ్వు ప్రారంభిం చావు, నేను ముగిస్తాను. ఈ ప్రపంచంలో నా కళ్ళుగప్పి నువ్వెక్కడా దాక్కోలేవు! అనుక్షణం భయంతో ఛస్తావు!!"

"మీ రెప్పుడూ తెలివిగల వారనుకోకండి. నేను అవక వాదిని" అన్నాడు రజాక్, "డబ్బు తీయండి, బిజినెస్

సెటిల్ చేసుకుందాం, టైం దగ్గరపడుతోంది."
జమునాదాస్ బీరువాలోంచి డబ్బుతీసి అందించాడు, ఓ బ్రీఫ్ కేసులో.
"గుడ్!" అన్నాడు రజాక్. "మీ భార్యని ప్రేమించడం మరవకండి! ఇక పదండి, ఆ ప్లేట్స్ దగ్గరికి దారి చూపిస్తాను."
రజాక్ బయటికి నడిచాడు.
కమీషనర్, డేవిడ్ బంగళా ముందు వేపుకు వురికారు. నేను టేప్ రికార్డర్ ఆఫ్ చేసి వాళ్ళ వెనక వురికాను. నా వెనక మిగిలిన ఇన్ స్పెక్టర్ వచ్చాడు.
అప్పటికి రజాక్ బంగళాలోంచి ఆవరణలోకి ప్రవేశించాడు. అతని వెనక దాస్ వచ్చాడు. ఇద్దరూ ఎడమవేపువున్న గ్యారేజికేసి చకచక నడుస్తోన్నారు.
సమయం పది గంటలకి పది నిముషాలుంది.
వాళ్ళు గ్యారేజి చేరుకునేవరకు మేం అక్కడే ఆగి ఆతర్వాత ముందుకు సాగాం. ఇంతలో వాళ్ళు గ్యారేజి తలుపు తెరిచి లోనికి ప్రవేశించారు. మేం అడుగుల శబ్దం కాకుండా వేగంగా పరుగెత్తి గ్యారేజి చేరుకున్నాం.
లోపల గుడ్డిగా బల్బు వెలుగుతోంది. రజాక్ దాస్ల ఆకారాలు అస్పష్టంగా అగపడుతోన్నాయి. దాస్ నిలబడి వున్నాడు. రజాక్ కూచోని నేలమీదవున్న టూల్ బాక్స్ విప్పుతున్నాడు.
కమీషనర్ డేవిడ్ సైగచేశాడు డేవిడ్ కెమెరాతో. ఆంగిల్ సిద్ధం చేసుకున్నాడు.
టూల్ బాక్స్ తెరవబడింది.
రజాక్ చెయ్యిపెట్టి రెండు లైసెన్స్ ప్లేట్లు బయటికి తీశాడు. దాస్ ఛటుక్కున వంగి వాటిని లాక్కున్నాడు.

అంతే! తళుక్కుమన్న వెలుగుతో బాటు 'క్లిక్' మన్న శబ్దం వినబడింది, డేవిడ్ కమేరాలోంచి.

హతాశుడైన దాస్ కెవ్వుమని కేక వేశాడు. జరిగిం దేమిటో గ్రహించిన రజాక్ రివాల్వర్ తో మెరుపుదాడి చేశాడు. ఈ పరిణామం వూహించని డేవిడ్ భుజం పట్టు కుని నేలమీద పడ్డాడు.

మరుక్షణం ఉగ్రుడైన కమీషనర్ రివాల్వర్ లోని బుల్లెట్ రజాక్ గుండెలో చోటు చేసుకుంది...

రజాక్ చావుకేకకి గ్యారేజి కంపించిపోయింది. ప్రాణ రక్షణకోసం జమునాదాస్ చేతులు పైకెత్తాడు.

*　　　*　　　*

మర్నాటి ఉదయం పత్రికల్లో సేఠ్ జమునాదాస్ అరెస్టువార్త వెలువడింది. దాస్ స్వంత పత్రిక 'నైఫ్' రాత్రికి రాత్రే మూతపడింది. అతని హోటల్స్ అన్నీ స్వాధీనం చేసుకోబడ్డాయ్. బంగాళాలోంచి లెక్కకు అందని గుప్తధనం బయటపడింది.

పోలీసు హెడ్ క్వార్టర్స్ లో దేశం నలుమూలలనించి ప్రెస్సు రిపోర్టర్స్, జర్నలిస్టులు వచ్చి వాలారు. ఉదయం పదిగంటలకి కమీషనర్ కార్యాలయంలో కాన్ఫరెన్స్ ఏర్పాటు చేయబడింది.

కాన్ఫరెన్స్ లో కమీషనర్ నన్ను మెచ్చుకొన్నా డని ఇక్కడ చెప్పక తప్పడంలేదు. నన్ను మెచ్చుకున్న కమీషనర్ కి చేతులు జోడించి నమస్కరించాను.

తర్వాత రేణుకను కలుసుకున్నాను. ఆమె ఆనందంగా "ఇక విడాకులు సులభం!" అంది.

పాల్ ప్రాణాలు బలితీసుకున్నందుకు చాలా విచారిం చింది రేణుక. అందుకు క్షమించమని ప్రాధేయపడింది. ఆమె రెండు లక్షలకు చెక్కు ఇవ్వబోగా నాకు దిలా

వర్ జ్ఞాపకంవచ్చి, ఒకలక్షా తొంభైవేలకి ఒక చెక్కూ, మిగిలిన పదివేలకి ఒక చెక్కూ ఇవ్వమని కోరాను.

వాటిని తీసుకుని బంగళా దాటుతుండగా దిలావర్ ఎదురుపడి చెయ్యిజాపాడు.

మధ్యాహ్నం ఫ్లైట్ అందుకోవాలంటే చాలా త్వరగా ఇక్కడి పనులు ముగించాలి.

ఆ తర్వాత హెడ్ క్వార్టర్స్‌కి బయలుదేరాను. రజాక్ పోస్టుమార్టమ్ రిపోర్ట్ పరిశీలిస్తున్నాడు యిన్స్‌పెక్టర్ డేవిడ్. నన్ను హైదరాబాద్‌లోనే స్థిరపడిపొమ్మని కోరాడు డేవిడ్. నేను అభ్యంతరం చెప్పాను.

ఆ తర్వాత అతనితో మార్చ్యురీకి వెళ్ళి కృపాల్ శవం వశం చేసుకున్నాను...

ఈ హైద్రాబాదుకి వచ్చి విజయం సాధించినందుకు ఆనందంగా వుంది కాని, ఇప్పుడు బెంగుళూరికెళ్ళి ఎంత బెంగపడాలో ఆలోచిస్తూంటే మతిపోతోంది.

నా మిత్రుడు, పేరుమోసిన డిటెక్టివ్, కృపాల్ లేని ఆఫీసుగది ఎంత బోసిగా వుంటుందో వూహించలేను. అతని శవంతో బెంగుళూరులో అడుగుపెట్టిన క్షణంనుంచి అక్కడి అధికారులు వేసేప్రశ్నలకి ఎలా తట్టుకోవాలో, ఏం సమాధానం చెప్పాలో తోచడంలేదు.

ఇదంతా ఆలోచిస్తోంటే మళ్ళీ హైదరాబాదులోనే వుండిపోవాలనిపిస్తోంది.

కానీ, తాను ఎక్కడ మరణించినా తనశవంమాత్రం బెంగుళూర్ మెడికల్ కాలేజీకి అప్పగించాలన్న కృపాల్ మాటలు జ్ఞాపకం వచ్చి, భుజం చరుచుకుని విమానాశ్రయానికి ప్రయాణమయ్యాను...

—:అయిపోయింది:—

# ఆమెను చంపాలి!

## టెంపోరావ్

విశ్వమోహన్ ఖరీదయిన సూటులో వున్నాడు. కుషన్డ్ రొకింగ్ కుర్చీలో కూర్చుని సిగరెట్ పీకను యాష్ట్రేలో పడేసి మరో సిగరెట్ వెలిగించాడు.

ఎదురుగా కుర్చీలో కూర్చున్న రాజా యాష్ట్రే వైపు చూశాడు. సిగరెట్ పీకలు పైదాకా వున్నాయి!

"రాజా, మనం యేదో చెయ్యకపోతే అహల్య హత్యలో నేను యిరుక్కుంటాను," అన్నాడు విశ్వమోహన్.

"అహల్యను ఎవరి చేతనయినా చంపించమని నేను ఆరోజే మీకు సలహా యిచ్చాను. నామాట వినకుండా పరిగెత్తావు. కొరివితో తల గోక్కున్నావు!"

"షటప్ రాజా!" అరిచాడు విశ్వమోహన్.

"అహల్య నన్ను మోసం చేసింది. అందుకే యీ చేతుల్తో ఆమెను చంపాలనిపించింది. ఏడుస్తూ, బాధతో ఆమె చస్తూంటే చూడాలనిపించింది,"

"అయితే యిప్పుడేం చేద్దాం? నువ్వామెను చంపుతుంటే లత చూసింది. లత పోలీసుల చేతుల్లోవుంది. ఆమె నోరువిప్పి నిజం చెపితే, నీకు ఉరిశిక్ష తప్పదు" అన్నాడు రాజు.

"లత నోరు నొక్కాలి!" అన్నాడు విశ్వమోహన్.

"ఇప్పుడది సాధ్యం కానిపని. పోలీస్ కస్టడీలోవున్న లతను ఎవరు చంపగలరు?"

విశ్వమోహన్ రెండు గ్లాసుల్లో విస్కీ పోసి సోడా కలిపాడు. ఇద్దరూ గ్లాసులు అందుకున్నారు.

ఏర్ కండిషన్డ్ గదిలో చల్లగా, ప్రశాంతంగా వుంది. విశ్వమోహన్ విస్కీ సేవిస్తూ తన జీవితం గురించి సింహావలోకనం చేసుకోసాగాడు...

ఒకప్పుడు తను పేవ్ మెంట్లమీద పడుకొనేవాడు. స్మగ్లర్ దీనదయాళ్ తో అతడికి పరిచయమైంది. అటుపైన అతడు వేగంగా మెట్లెక్క సాగాడు.

పదేళ్ళలో తనొక కోటీశ్వరుడయ్యాడు. కొన్ని వేల మంది తనకోసం ఇప్పుడు అనేకచోట్ల పనిచేస్తున్నారు! మద్రాస్ లో బ్రహ్మాండమైన ఫైవ్ స్టార్ హోటల్ని అతడు కట్టించాడు, హోటలు మూన్ లైట్! తన స్మగ్లర్ జీవితానికి తెరగా వుండేందుకు అనేక వ్యాపార సంస్థలను అతను నడుపుతున్నాడు.

ఇంతవరకూ తను ఎందర్నో చంపించాడు కాని స్వయంగా తనెప్పుడూ యిరుక్కో లేదు. ఇప్పుడీ ప్రమాదం నెత్తిన పడింది!

విశ్వమోహన్ టైమ్ చూశాడు. పది దాటింది. గ్లాసుల్లో రాజు మళ్ళా విస్కీ పోసి, సోడా కలిపాడు. అతడి కుడి భుజం రాజు.

"మనం ఆలస్యంచేస్తే లాభంలేదు. ఈ పని ముకుంద్‌కి అప్పజెప్పాలి," అన్నాడు రాజు.

"ముకుంద్‌కా! వాడో దుర్మార్గుడు. త్రాచుపాము లాంటి వాడు!" అన్నాడు విశ్వమోహన్.

"రహస్యంగా కాటేయడానికి మనకు త్రాచుపామే కావాలి."

విశ్వమోహన్ సూటిగా రాజు కళ్ళలోకి చూశాడు.

"ముకుంద్ ఎక్కడున్నాడో తెలుసా?"

"అతడు బొంబాయి నుంచి మద్రాస్ వచ్చాడు' ప్రస్తుతం మన హోటల్లోనే గది తీసుకుని వుంటున్నాడు'. అన్నాడు రాజు.

"అతడి కిక్కడేం పనుంది?"

"ఏమో!" అన్నాడు రాజు.

క్షణకాలం విశ్వమోహన్ మౌనంగావుండి పోయాడు. "రాజూ, అతడిని రమ్మను! మాట్లాడిమాద్దాం," అన్నాడతను.

రాజు కుర్చీలోంచి లేచి గదిలోంచి బయటకు వెళ్ళి పోయాడు.

విశ్వమోహన్ కుర్చీలో వెనక్కివాలాడు. గ్లాసులోని విస్కీని గడగడ తాగేసాడు.

ముకుంద్! దేవాంతకుడు! డబ్బుకోసం అతడు యెవ ర్నైనా చంపగలడు! ఎవ్వరికీ సాధ్యంకాని హత్యను అవలీలగా సాధించి రాగలడతను!

తలుపునెవరో తట్టారు. స్ప్రింగ్ తలుపునులాగి ఒక తను లోపలకు తొంగిచూశాడు.

"కమిన్!" అన్నాడు విశ్వమోహన్.

అతడు మెల్లిగా లోపలకు వచ్చాడు. ఎదురుగా

వున్న కుషన్డ్ కుర్చీలో కూర్చున్నాడు. సన్నగా, పొట్టిగా వున్నాడతను. అతడి బరువు నూరుపౌండ్ల లోపున వుంటుంది.

కోలమొహం, నల్లటి శరీరం, చిన్నకళ్ళు. అతడు ధరించిన సూటు లూజుగావుంది. అతడే ముకుంద్.

"ఏం కావాలి?" అన్నాడతను.

అతడి కంఠంలో తీయదనం లేదు. మృత్యు కంఠంలా వుంది!

"మిస్టర్ ముకుంద్, నీ సహాయం కావాలి" అన్నాడు విశ్వమోహన్.

ముకుంద్ తన జుత్తును నిమురుకున్నాడు.

"ఏమిటో చెప్పు!"

"అహల్యా హత్య గురించి నీకు తెలుసుగదా?" అన్నాడు రాజు లోపలకు వస్తూ.

"పేపర్లలో చూశాను!"

"పోలీసులు నన్ను అనుమానిస్తున్నారు. హత్య చేస్తుంటే లత అనేయువతి నన్ను చూసిందట. ఆమె పోలీసు కస్టడీలోవుంది. ఈకేసు కోర్టుదాకా వెళ్ళకుండా చెయ్యాలి. ఆమెను చంపాలి!" చెప్పాడు విశ్వమోహన్.

"నాకెంత వస్తుంది?"

"యాభైవేలు," అన్నాడతను.

ముకుంద్ విచిత్రంగా నవ్వాడు. "కేసు పెద్దది. పని కష్టతరమైనది. లక్షరూపాయలిస్తే గాని నా పిస్టలు పల్కదు!" అన్నాడతను.

"ఆల్ రైట్, లక్షయిస్తాను."

ముకుంద్ సిగరెట్ కేస్ జేబులోంచి తీశాడు. గోల్డు కేస్ మెరుస్తోంది. మెల్లిగా సిగరెట్ వెలిగించాడు.

"క్యాష్ తెప్పించు!" అన్నాడు.

విశ్వమోహన్ కుర్చీలోంచి లేచాడు. వెనక నున్న గాడ్రేజ్ స్టీలుబీరువా తెరిచి నాలునోట్ల కట్టలను తీసు కున్నాడు. తనకుర్చీ దగ్గరకువచ్చి కట్టలను టేబులుమీద పడేశాడు. ముకుంద్ వాటిని తన కోటుజేబులో పెట్టు కున్నాడు.

సిగరెట్ పొగవదులూ ముకుంద్ అతడివంక చూశాడు. "అత ఎప్పుడు చావాలి?"

"వీలైనంత తొందరగా! చంపలేకపోతే డబ్బు నాకు వాపసు చెయ్యాలి!" అన్నాడు విశ్వమోహన్.

"నా హోటలుగది బీరువాలో యీ డబ్బు అలాగే వుంటుంది. నేను ఫెయిలయితే నా గదికెళ్ళి ఆ డబ్బును నువ్వు తీసుకోవచ్చు," అన్నాడు ముకుంద్.

"పోలీస్ కమీషనర్ కి విశ్వమోహన్ అంటే గిట్టదు. ఎంతకాలం నుంచో అతడిని దేనిలోనయినా యిరికించా లని తాపత్రయ పడుతున్నాడు. ఇది కమీషనర్ కి గొప్ప అవకాశం," అన్నాడు రాజు.

ముకుంద్ మాట్లాడలేదు. సిగరెట్ పొగపీల్చి, బయ టకు వదులూ కూర్చున్నాడు.

టెలిఫోన్ మ్రోగింది. రిసీవర్ని ఎత్తాడు విశ్వమోహన్. ఎవరితోనో మాట్లాడి అతడు రిసీవర్ని పెట్టేశాడు.

అతడు ముకుంద్ వైపు సూటిగా చూశాడు.

"పరిస్థితులు విషమించాయి. పోలీసులు ఆమెను రహ స్యంగా ఎక్కడికో తీసుకుపోయి దాచారట. ఆమె ప్రస్తుతం ఎక్కడ దాగివుందో మనకు తెలియదు..." అన్నాడు విశ్వమోహన్.

"ఎక్కడుందో కనుక్కుంటాను. వారం రోజుల్లో

హతమారుస్తాను'' అని ముకుంద్ కుర్చీలోంచి లేచి బయటకు కదిలాడు.

## 2

హోటల్ గంగా! పదమూడంతస్తుల భవనం!

పదమూడో అంతస్తులోని 265 నంబరు గదిలో వుంది లత.

ఆమె సోఫాలో కూర్చుని వుంది. ఎదురుగా ఇన్‌స్పెక్టర్ నాయర్, పోలీస్ కమీషనర్ అరవింద్ ఆశీనులై వున్నారు.

గది బయట నలుగురు సాయుధ పోలీసులు కాపలా వున్నారు. ఇన్‌స్పెక్టర్ నాయర్ ఆమెవంక చూశాడు.

''మిస్ లతా, నాతో చెప్పినదంతా పోలీస్ కమీషనర్ గారికి చెప్పు,'' అన్నాడు నాయర్.

''అహల్య హత్యను నేను చూశాను,'' అందామె.

''ఎలా చూడగలావు?''

''రాత్రి తొమ్మిదింటికి నేనామె యింటికి వెళ్ళాను. తన పడగదిలోకి ఆమె నన్ను రమ్మంది. ఆమెతో మాట్లాడుతూ కూర్చున్నాను. ఎవరో వస్తున్న బూట్ల చప్పుడైంది. కాస్సేపు వెనక రూంలో వుండమందామె. నేను వెనక గదిలోకి వెళ్ళి తలుపు మూసుకున్నాను.''

''తర్వాత ఏమైంది?'' అడిగాడు పోలీసు కమీషనర్.

''తలుపుకు తాళం చెవి పెట్టే చిల్లుంది. ఆ చిల్లులోంచి చూస్తూ నిలబడ్డాను. పొడుగ్గా, లావుగా వున్నతను లోపలకొచ్చాడు' అతడిని ఆమె నవ్వుతూ ఆహ్వానించింది. క్షణంలో అతడామెను కత్తితో పొడిచాడు. ఆమె అతడితో పోట్లాడింది. చివరకి కిందపడింది'' అందామె.

''కీ హోల్లోంచి అతడి రూపం మీకు కనపడిందా?''

ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్ నాయర్.

"అతడిని మళ్ళీ చూస్తే పోల్చగలను" అందామె.

ఇన్‌స్పెక్టర్ నాయర్ ఆమెకు పది ఫోటోలు ఇచ్చాడు. "అహల్యను చంపినతని ఫోటో వాటిలో వుందేమో చూడు" అన్నాడు నాయర్.

ఆమె ఫోటోలను చూసింది. విశ్వమోహన్ ఫోటోను తీసి దానివైపు చూపించింది.

"ఇతనే!" అందామె.

ఇన్‌స్పెక్టర్ నాయర్ నవ్వుతూ పోలీస్ కమీషనర్ వైపు చూశాడు.

"ఈసారి అతడు మనకు చిక్కాడు!" అన్నాడు కమీషనర్.

ఇన్‌స్పెక్టర్ నాయర్ ఆమెవైపు తిరిగాడు.

"తర్వాత ఏమైందో చెప్పు!"

"అదంతా చూసి నేను చాలా భయపడిపోయాను. రెండు నిమిషాల తర్వాత బయట గదిలోకొచ్చాను. అహల్య శవం తివాసీమీద రక్తం మడుగులో పడుంది. నేను వెంటనే బయటకు వెళ్ళిపోయాను."

"ఆటుపైన నువ్వేం చేశావు?"

"ఒక పబ్లిక్ బూత్ నుంచి పోలీసులకు టెలిఫోన్ చేసి అహల్యహత్యగురించి చెప్పాను. నా పేరు చెప్పకుండా రిసీవర్ని పెట్టేశాను."

"విశ్వమోహన్ హత్య చేస్తూంటే చూశానని చెప్పడానికి యింత ఆలస్యం ఎందుకు చేశావు? మొదటిరోజే నువ్వు చెప్పివుంటే యీపాటికి అతడిని అరెస్టు చేసివుండే వాళ్ళం" అన్నాడు కమీషనర్.

"అతడిని అరెస్టు చేయలేదా?"

"అతడు తన హోటల్ మూన్‌లైట్‌లో లేడు. ఏ వూరో వెళ్ళాడట. తిరిగి రాగానే అరెస్టు చేస్తాం" అన్నాడు నాయర్.

"అతడు ఇదే పట్నంలో నాలాగే దాగివున్నాడేమో!" అందామె.

"శాశ్వతంగా దాక్కోలేడు!"

పోలీసు కమీషనర్ ఆమెకేసి నవ్వుతూ చూశాడు. "మిస్ లతా, ఈ గదిలో నీకు ఏ ప్రమాదమూ రాదు. నువ్వు భయంలేకుండా వుండొచ్చు. ఈ కేసు అయ్యాక నీకు మా డిపార్ట్‌మెంట్ అన్నివిధాలా సహాయపడ్తుంది" అన్నాడతను.

"థాంక్స్, సార్" అందామె.

ఒక నర్సు గదిలో కొచ్చింది.

"మిస్ లిల్లీ, ఆమెను జాగ్రత్తగా చూసుకో" అన్నాడు నాయర్.

పోలీస్ కమీషనర్ అరవింద్, ఇన్‌స్పెక్టర్ నాయర్ బయటకు వెళ్ళారు. ఆమెకు ప్రమాదం రాకుండా తను చేసిన బందోబస్తును చూపించాడు ఇన్‌స్పెక్టర్.

పన్నెండో అంతస్తు మేడమెట్ల దగ్గర పదిమంది సాయుధ పోలీసులున్నారు. పదమూడో అంతస్తులోని గదులన్నీ కమీషనర్ పేరులో తీసుకున్నాడు ఇన్‌స్పెక్టర్ నాయర్.

పదమూడో అంతస్తు నిండా కానిస్టేబుల్సు పచార్లు చేస్తున్నారు.

తెరిచిన కిటికీలోంచి కమీషనర్ అరవింద్ బయటకు చూశాడు. కింద నడుస్తున్న మనుషులు చీమల్లా కనిపించారు. హోటల్ ఎదుట రోడ్డమ్మట కార్లు దూసుకు

పోతున్నాయి. కార్లు అగ్గిపెట్టెల్లా కనిపించాయి.

"కిందన, గ్రౌండ్ ఫ్లోర్ మెయిన్ గుమ్మంముందు సాయుధ పోలీసులు వున్నారు. హోటల్లోకి వచ్చేవాళ్ళను చెక్ చేస్తేగాని లోపలకు వెళ్ళనివ్వరు. హోటల్లోకి రెండు లిఫ్ట్స్ వున్నాయి. అవి పన్నెండో అంతస్తు దాటి పైకి రావు. ఇక్కడకు రావడం ఏ హంతకుడికీ సాధ్యం కాదు" అన్నాడు నాయర్.

"వెల్ డన్!" మెచ్చుకున్నాడు కమీషనర్.

"ఆమె పోతే విశ్వమోహన్ అహల్యను హత్య చేశాడని మనం ఋజువు చెయ్యలేం. ఆమె మోస్ట్ యింపార్టెంట్ విట్నెస్!" అన్నాడు ఇన్ స్పెక్టర్ నాయర్.

# 3

టైమ్ తొమ్మిది దాటింది. ముకుంద్ కారును రోడ్డు వారగా ఆపాడు.

ఇటూ అటూ చూశాడు. సమీపంలో ఎవ్వరూ లేరు.

పిట్టగేటు తెరిచి అతడు లోపలకెళ్ళి తలుపును తట్టాడు. ఓ నిమిషం తర్వాత తలుపు తెరవబడింది.

ఎముకల పోగులావున్న అతడివంక ఒక స్త్రీ గాభరాగా చూసింది.

ఆమె వయస్సు యాభై దాటింది. ఆమె తెల్లటి చీర, రవిక ధరించింది. మెళ్ళో నగలు లేవు. రూపం చూస్తే విధవని తెలుస్తోంది.

"త్రివేండ్రం నుంచి వచ్చాను. లిల్లీని చూసిపోదామని యిలా వచ్చాను" అన్నాడతను.

"అమ్మాయి డ్యూటీకి వెళ్ళింది."

"పొద్దుటే నేను వెళ్ళిపోవాలి. లిల్లీ ఎక్కడుందో చెప్తే అక్కడికెళ్ళి మాట్లాడివస్తాను. ఆమె మా హాస్పి

టల్లో కొంతకాలం పనిచేసింది'' అన్నాడు ముకుంద్.

ఆమె నవ్వుతూ అతడిని కూర్చోమంది. లిల్లీ మొదట త్రివేంద్రం హాస్పిటల్లో పనిచేయడం ఆమెకు తెలుసు.

''కాఫీ తెస్తాను, వుండండి'' అందామె.

''ప్లీజ్, వద్దు. ఇవాళ ఎన్నిసార్లో తాగాను. మీ అమ్మాయిని ఎలా కల్సుకోగలనో చెప్పండి.''

''ఆమెను కల్సుకోలేరు! అక్కడికి ఎవ్వరూ వెళ్ళకూడదు. అది నాకు టెలిఫోన్ నంబరిచ్చింది. ఫోన్ చేసి మాట్లాడండి.''

ఓ నెంబరు అతడికి చెప్పింది.

అతడు నంబరు గుర్తుంచుకున్నాడు. అతడు ఆమెకు థాంక్స్ చెప్పి గుమ్మం దాటాడు.

''నీ పేరు?'' అడిగిందామె.

ఆమె ప్రశ్న వినపడనట్లు అతడు గబగబా వెళ్ళిపోయాడు.

కారును వేగంగా పోనిచ్చాడు. ఒక బూత్ పక్కనే కారాపి దిగాడు. లోపలికెళ్ళి గాజుతలుపు మూశాడు.

రిసీవర్ ఎత్తి ఆమె చెప్పిన నంబరు తిప్పాడు. స్లాట్ లో యాభై పైసలు పడేశాడు.

''హలో, హోటలు గంగా ప్లీజ్!'' అంది టెలిఫోన్ ఆపరేటర్.

''మిస్ లిల్లీ ప్లీజ్?'' అన్నాడతను.

''యూ వాంట్ నర్స్ లిల్లీ?''

''యస్.''

''ఆమె రూమ్ నంబర్ 265లో వుంది. ఆ గదికి నేను కనక్షనివ్వలేను. మీ నంబరు, పేరు చెప్తే ఆమెను ఫోన్

చెయ్యమంటాను" అందామె.

"ఆమె ఫోన్ చెయ్యా నవసరం లేదు. తర్వాత నేనే అటువైపు వచ్చి ఆమెతో మాట్లాడతాను," అని అతడు రిసీవర్ని పెట్టేశాడు.

బూత్ లోంచి బయటకొచ్చి అతడు కారులో కూర్చున్నాడు. కారును తిన్నగా హోటలు గంగా వైపు పోనిచ్చాడు.

కాంపౌండ్ లో కారాపి అతడు ముందుగుమ్మంవైపు చూశాడు. గుమ్మం ముందు అరడజన్ మంది సాయుధ పోలీసులు వున్నారు. లోపలకు వెళ్ళేవాళ్ళను వాళ్ళు చెక్ చేస్తున్నారు.

గుమ్మం వారగా ఒక మిషన్ అమర్చబడింది. దాని ముందునుంచి అందరూ వెళ్ళాలి. జేబుల్లో పిస్టల్సు దగ్గరా వుంటే ఆ మిషన్ వెంటనే చూపుతుంది.

ముకుంద్ కారులో కూర్చుని అదంతా గమనించాడు. తన కోటు లోపల జేబులోవున్న పిస్టల్ని కారు సీటుకింద దాచేశాడు. కారు అద్దాలెత్తి, తలుపులు లాక్ చేసి, అతడు గుమ్మంవైపు నడిచాడు.

మిషన్ ముందునుంచి అతడు నడిచాడు. సాయుధ పోలీసులు అతడిని ఆపలేదు. ఏర్ కండిషండ్ లాంజిలోకి అతడు ప్రవేశించాడు.

తిన్నగా బార్రూమ్ లోకి వెళ్ళాడతను. ఒక టేబులు ముందు కూర్చున్నాడు. బాయ్ వచ్చాడు.

"ఒక బాటిలు బీర్ ఫారన్" అన్నాడతను.

బిస్మార్క్ బ్రాండ్ జర్మన్ బీర్ బాటిల్ను తెచ్చి బాయ్ టేబులుమీద పెట్టాడు. గ్లాసులో పోసుకుని బీర్ తాగుతూ అతడు నలువైపులూ చూశాడు.

అరగంట తర్వాత అతడు బిల్లు చెల్లించి మెల్లిగా బయటకు నడిచాడు.

# 4

విశ్వమోహన్ ఎదురుగా ముకుంద్ కూర్చున్నాడు. పక్కనే మరో కుర్చీలో రాజు వున్నాడు.

విశ్వమోహన్ మూడు గ్లాసుల్లో స్కాచ్ విస్కీ పోసి సోడా కలిపాడు. ముగ్గురూ గ్లాసులు అందుకున్నారు.

ముకుంద్ మితంగా తాగుతాడు. గ్లాసులో విస్కీని కొంచెం తాగి అతడు విశ్వమోహన్ వంక చూశాడు.

"రెండు రోజుల్లో ఆమెను చంపును!" అన్నాడతను.

విశ్వమోహన్, రాజు అతనివైపు చూశారు. చేత్తో అతడు జుత్తును నిమురుకుంటున్నాడు.

"ఆల్ రైట్ ప్రొసీడ్!" అన్నాడు విశ్వమోహన్.

"ఈ ఆదివారం సాయంత్రం లాండ్రీ వాన్ యిస్త్రీ చేసిన దుస్తులను ఆ హోటలుకి అందజేస్తుంది!" అన్నాడు ముకుంద్.

"లాండ్రీ వాన్‌తో మనకేంపని?"

"అన్నీ నాకు వుపయోగపడ్తాయి!" అన్నాడతను క్లుప్తంగా.

గ్లాసులు ఖాళీ అయ్యాయి. మళ్ళీ గ్లాసుల్లో రాజు విస్కీ పోస్తున్నాడు.

"నాకొద్దు ప్లీజ్," అన్నాడు ముకుంద్.

వాళ్ళిద్దరూ గ్లాసులను తీసుకున్నారు. ముకుంద్ కుర్చీలోంచి లేచాడు. గదిలోంచి మెల్లిగా బయటకు నడిచాడు.

హోటలు బాత్రూమ్‌లోకి చేరుకున్నాడతను. బాత్రూమ్‌లో ఎక్కువమంది లేరు. ఒక యువతి టేబులు

ముందు ఒంటరిగా కూర్చుని వుంది.

పక్కనుంచి వెళ్తూ ఆమె కేసి చూశాడతను. నవ్వాడు. అతడిని చూసి ఆమె భయంతో మొహాన్ని పక్కకు తిప్పేసుకుంది.

అతడామె కెదురుగా కూర్చున్నాడు. ఆమె వయస్సు యిరవై రెండు దాటివుండదు. షిఫాన్ చీర ధరించిందామె. పచ్చటి శరీరం. ఆమె విశాల నేత్రాలు మెరుస్తున్నాయి.

"మిస్, నీలాటి సుందరి ఒంటరిగా కూర్చోకూడదు" అన్నాడతను.

తన అందాన్ని మెచ్చుకున్నందుకు ఆమె సంతోషించింది.

"నా ఫ్రెండ్ కోసం వెయిట్ చేస్తున్నాను" అందామె.

అతడు టైమ్ చూశాడు. పదకొండు కావస్తోంది.

"నీ ఫ్రెండ్ ఏం చేస్తున్నాడు?"

"ఒక ఫారన్ కంపెనీలో సేల్సు అసిస్టెంట్" అందామె.

"అతడు ఆఫీసు పనిలో మునిగి వుంటాడు!"

బార్రూమ్ బాయ్ టేబులు దగ్గర కొచ్చాడు. ముకుంద్ ఆమెవైపు తిరిగాడు.

"యూ ఆర్ మై గెస్ట్. ఏం తెప్పించను?"

"మీ యిష్టం" అందామె.

అతడు ఆమ్లెట్లు ఆర్డరిచ్చాడు. ఒక బీర్ బాటిలు తెమ్మన్నాడు. బాయ్ వెళ్ళిపోయాడు. జేబులోంచి ఒక రింగ్ తీసి అతడామెకిచ్చాడు. డైమండ్ రింగ్ ధగధగా మెరుస్తోంది.

"నీ వేలుకు పెట్టుకుని చూడు" అన్నాడతను.

ఆమె వుంగరాన్ని పెట్టుకొంది. ముచ్చటగా తన

వేళ్ళ వైపు చూసుకుంది.

"ఇది మీ కెక్కడ కొన్నారు."

"దుబాయ్‌లో ఒక వ్యక్తి నాకు బహుమతిగా యిచ్చాడు. అతడికి నేను చిన్న సహాయం చేశాను," అన్నాడతను.

వేలునుంచి వుంగరాన్ని తీసి అతడికియ్యడానికి ఆమె మనస్సు ఒప్పడంలేదు!

అది అతను పసిగట్టాడు.

"నా గదికి వస్తే ఆటువంటి వుంగరాలు, చెవులరింగులు చూపిస్తాను. అన్నీ ఆ దేశంనుంచి తెచ్చినవే."

ఇద్దరూ ఆమ్లెట్లు తినడంలో నిమగ్నులయ్యారు. బీర్ సేవిస్తూ అతడు మధ్యలో ఆమ్లెట్ నవుల్తున్నాడు.

"మీగదికి వస్తాను. పదినిమిషాల్లో వెళ్ళిపోవాలి!" అందామె. తర్వాత ఇద్దరూ పైకి వెళ్ళారు.

ఏర్ కండిషన్డ్ గది అది.

పెద్ద సోఫాలో కూర్చున్నారు ఇద్దరూ. గదిలో లైటు వెలుగుతోంది.

"మిస్..." అన్నాడతను.

"మిస్ రాధిక..." అందామె.

"మంచిపేరు!" అన్నాడు ముకుంద్. అతడామెకేసి నవ్వుతూ చూశాడు.

"బాత్రూమ్‌లోకి రాగానే నీకళ్ళు నన్ను ఆకర్షించాయి. మేగ్నెట్‌లా నన్ను నీ ముందుకు లాగాయి," అన్నాడతను.

ఆమె కిలకిల నవ్వింది.

ఒక వెల్వెట్ పాకెట్ తెరిచి ఆమెకిచ్చాడు. లోపల ముత్యాల హారముంది. దాన్నిచూసి ఆమె ఆశ్చర్య

పోయింది. "అద్భుతంగా వుందీ హారం!" అందామె.

"నువ్వు యీ పట్నంలో ఏం చేస్తున్నావు?"

"బి. ఎ. పాసయ్యాను. ఉద్యోగం కోసం వెతుకుతున్నాను."

అతడు నవ్వాడు. ఆమె కేసి పరీక్షగా చూశాడు.

"బి. ఎ. పాసయిన యువతి నీలా మాట్లాడదు. నీ మెళ్ళోనున్న గొలుసు, నీ చెవలరింగులు గోల్డు కోటెడ్ వి! నువ్వు అబద్ధం చెబుతున్నావ్!" అన్నాడతను.

ఆమె కోపంగా అతడివంక చూసింది.

"మర్యాదగా జీవించే ఏ యువతీ పొద్దుటే వచ్చి బాత్రూమ్‌లో కూర్చోదు!" అన్నాడతను.

తటాలున ఆమె లేచింది. అతడామె చెయ్యిపట్టుకున్నాడు. "కూర్చో!" అర్చాడతను.

అతడివంక చూసి ఆమె తృళ్ళిపడింది. పిశాచంలాగా ఆమెకు అగుపించాడతను.

"నేను వెళ్ళాలి!" అందామె.

"ఎక్కడకు, వేటకా?" కమ్చీతో కొట్టినట్లు అడిగాడతను.

ఆమె సోఫాలో కూర్చుండిపోయింది. మొహాన్ని పక్కకు తిప్పుకుంది. ఆమె వేళ్ళను మెల్లిగా నిమిరాడతను.

"రాధికా, నిజం చెప్పేవాళ్ళను నేను మెచ్చుకుంటాను! అందమైన నీ శరీరాన్ని అమ్మి పాడవుతున్నావు!" అన్నాడతను.

ఆమె అతడివైపు తిరిగింది.

"తల్లినీ, ఇద్దరు తమ్ముళ్ళను పోషించాలి. మరేం చేసేది?" అందామె.

అతడామె కళ్ళల్లోకి చూశాడు.

"నేను చాలా బిజీ మనిషిని. ఎప్పుడూ దేశంలో తిరుగుతూ వుంటాను. పని లేని సమయాల్లో నాకు వినోదం కావాలి! నువ్వు నాకు వినోదాన్ని యివ్వగలవు. ఇటు పైన మాసమాసం నీకు నేను వెయ్యిరూపాయ లిస్తాను. నీ వ్యాపారానికి గుడ్ బై చెప్పి, నువ్వు నాతో నే వుండాలి!" అన్నాడతను.

"వెయ్యి చాలదు!" అందామె.

"ఎంతయితే చాలుంది?"

"రెండు వేలు," అంది రాధిక.

అతడు జేబులోంచి రెండు వేలుతీసి ఆమెకిచ్చాడు.

"ప్రతి నెలా నువ్వడిగిన మొత్తం యిస్తాను. ఇదికాక నేను నీకు బహుమతులు యివ్వొచ్చు."

"ఐయామ్ లక్కీ!" అందామె.

"నువ్వెక్కడుంటున్నావు?"

"ఒక చిన్న ఇంట్లో."

"వెళ్ళి మంచి యిల్లు తీసుకో. నీయింటి అడ్రెస్ నాకు ఫోన్ చేసి చెప్పు. పనిలేనప్పుడు నేనక్కడికి వస్తాను."

ఆమె వుంగరంవైపు చూసింది.

"ఆ వుంగరం నీదే. కీపిట్!"

సోఫాలోంచి ఆమె లేచి నిలబడింది. ఆమె కూడా

అతడు తలుపుదాకా వెళ్ళాడు. ఎర్రటి ఆమె పెదిమలను ముద్దుపెట్టు కున్నాడు. ఎముకల పోగులావున్న అతడి బలాన్ని చూసి ఆమె ఆశ్చర్యపోయింది.

కళ్ళు చిట్లిస్తూ అతడివైపు చూస్తూ వుండిపోంది. "మీ పేరు?" అందామె.

అతడు నవ్వాడు. ఆమె బుగ్గమీద వేలితో తట్టి, "ముకుంద్" అన్నాడు.

ఆమె బయటకు వెళ్ళిపోయింది.

అతడు తలుపుమూసి, తాళం చెవిని తిప్పాడు. సోఫాలో కూర్చున్నాడు.

టీపాయి మీదున్న ప్లేటులో జీడిపప్పుంది. జీడిపప్పును నవుల్తూ అతడు హోటలు గంగా బ్లూప్రింట్స్‌ను చూడసాగాడు.

హోటలు గంగా ఆర్కిటెక్ట్ శేఖరం ఆ బ్లూప్రింట్స్‌ను అతడికిచ్చాడు. వాటినిచూసి తను నిర్మించబోయే హోటల్ ఎలా వుండాలో ఆలోచించి తనని మళ్ళీ కలుసుకోమన్నాడు శేఖర్.

"వారం రోజుల్లో వస్తాను," అని అతడు బయటపడ్డాడు.

# 5

విశ్వమోహన్ సిగరెట్ పొగ వదుల్తూ రాజు వైపు చూశాడు.

'మన హోటల్లో వుండడానికి భయంగా వుంది. ఏ క్షణంలో నయినా పోలీసులు నన్ను అరస్టు చేయడానికి రావచ్చు" అన్నాడతను.

"డోంట్ బాదర్! వాళ్ళు వచ్చినా నువ్వు కనబడవు" అన్నాడు రాజు.

తలుపును తోసుకుని ఒకతను విశ్వమోహన్ ముందుకొచ్చాడు.

"పోలీస్ వాన్, జీప్ హోటలు ముంగు ఆగాయి సార్!" అన్నాడతను.

విశ్వమోహన్ కుర్చీలోంచి లేచాడు.

"మేనేజ్ వెల్," అన్నాడు రాజుతో.

"పదినిముషాల్లో వాళ్ళు పోయేటట్లు చూస్తాను," అన్నాడు రాజా.

విశ్వమోహన్ లోపల గదిలోకి వెళ్ళాడు. చిన్నగది. చాలా అందంగావుంది. గదిలో లైటు వెల్గుతోంది. గోడ వారగా పెద్ద బీరువావుంది. అతడు బీరువా తలుపు తెరిచాడు.

బీరువాలోకి వెళ్ళాడు. చిన్న బటన్ నొక్కాడు. బీరువా వెనుకభాగం పక్కకు జరిగింది. కిందకు వెళ్తున్న మేడమెట్లు కనిపించాయి.

బీరువాముందు తలుపును మూశాడతను.

మరోబటన్ నొక్కాడతను. బీరువా వెనుకభాగం కదిలింది. అతడు మెట్లుదిగి ఒక విశాలమైన గదిలోకి ప్రవేశించాడు. రెండు స్విచ్‌లు నొక్కాడు. ఫ్లోరసెంట్ లైట్లు వెలిగాయి. ఏర్ కండిషనర్ చప్పుడు అతడికి వినిపిస్తోంది.

అతను గది నలువైపులా చూసి పెద్దసోఫాలో కూర్చున్నాడు. టీ పాయ్‌మీద స్కాచ్ విస్కీబాటిలుంది. గ్లాసులో విస్కీపోసుకుని సోడా లేకుండా మెల్లిగా తాగాడు. గొంతులోంచి వేడిగా విస్కీ లోపలకు దిగింది. అతడిలో ధైర్యం తలెత్తింది!

## 6

యాభైమంది కానిస్టేబుల్సు హోటలు నలువైపులా కాపలా వున్నారు.

ఇన్‌స్పెక్టర్ నాయర్‌ని ముందు హాల్లో కల్సుకున్నాడు రాజు. "ఇన్‌స్పెక్టర్ సాబ్, దయచేయండి," అన్నాడు రాజా.

ఇన్‌స్పెక్టర్ నాయర్‌తో అరడజనుమంది కానిస్టేబుల్సు వున్నారు.

"నేను వినోదంకోసం రాలేదు. విశ్వమోహాన్ని అరెస్టు చేయడానికొచ్చాను," అన్నాడతను సీరియస్‌గా.

"ఆయన ఇక్కడలేడు," అన్నాడు రాజా.

"ఎక్కడికెళ్ళాడు?" ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్.

"గోవా వెళ్ళారు. ఈ వారంలో వచ్చేస్తారు."

"ఈ హోటల్లోని గదులన్నిటినీ మేం చెక్ చెయ్యాలి" గర్జించాడు ఇన్‌స్పెక్టర్ నాయర్.

"మీ ఇష్టం! ప్లీజ్ యువర్ సెల్ఫ్!" అన్నాడు రాజా.

ఇన్‌స్పెక్టర్ నాయర్ ముందుకు కదిలాడు. ఎదురుగా వున్న బార్రూమ్‌లోకి వెళ్ళాడు.

బార్రూమ్‌లో ఎక్కువమంది లేరు. ముకుంద్ ఒక కుర్చీలో కూర్చుని బీర్ తాగుతూ రేస్ బుక్ను చూస్తున్నాడు. అతడి ప్రక్కనుంచి వెళ్తూ ఇన్‌స్పెక్టర్ నాయర్ ఆగాడు.

"మిస్టర్, మిమ్మల్ని ఎక్కడో చూశాను" అన్నాడు నాయర్.

ముకుంద్ నవ్వుతూ చూశాడు.

"ఎక్కడ చూశారో జ్ఞాపకం తెచ్చుకోండి యిన్‌స్పెక్టర్," అన్నాడతను.

కౌంటరు ప్రాంతంలో కొందరు కూర్చుని తాగుతున్నారు. ఇన్‌స్పెక్టర్ నాయర్ నలువైపులా చూస్తూ ఆలోచిస్తున్నాడు. ఈ ఎముకల పోగును యెక్కడ చూశాడు? గుర్తురావడం లేదు.

"ఇన్‌స్పెక్టర్, మీకు జ్ఞాపకశక్తి తక్కువ. నా

ఫోటోను మీరు ఏ పత్రికలోనో చూసి వుంటారు. అయామ్ ముకుంద్ ఫ్రమ్ బొంబే!" అన్నాడతను గర్వంగా.

ముకుంద్. నటోరియస్ కిల్లర్! ఇతడు యిక్కడ ఏం చేస్తున్నాడు? మద్రాస్‌కి యితను ఎందుకొచ్చాడు? విశ్వమోహన్ యితని నిక్కడకు రప్పించాడా?

"మిస్టర్ ముకుంద్, మీరిక్కడికొచ్చి యెన్నిరోజు లయింది?"

"నాలుగయిదు రోజులయింది."

"ఎందుకొచ్చా రిక్కడికి?"

"వ్యాపారం మీద."

"ఇంకా వుంటారా?"

"నాపని పూర్తయినదాకా వుంటాను," అన్నాడు అతను.

"మీరు యిదే హోటల్లో వుంటున్నారా?"

"ఎస్ రూమ్ నెంబర్ 40."

ఇన్‌స్పెక్టర్ నాయర్ వెనక్కు తిరిగాడు.

"ఇన్‌స్పెక్టర్ ఎనీ ట్రబుల్?" అడిగాడు ముకుంద్.

"ప్లెన్టీ ఆఫ్ యిట్!" అని నాయర్ బయటకు పరిగెత్తాడు.

ప్రతి గదినీ పోలీసులు చూశారు. విశ్వమోహన్ ఎక్కడా లేదు. రూమ్ నెంబర్ 40ని నాయర్ జాగ్రత్తగా చూశాడు. ఏర్ బాగ్‌లో దుస్తులు, స్వామీ వివేకానంద పుస్తకం మాత్రం వున్నాయి.

రెండుగంటల తర్వాత ఇన్‌స్పెక్టర్ నాయర్ తన జీప్ వైపు నడిచాడు. ముందు సీటులో కూర్చున్నాడు. కానిస్టేబుల్సు వెనుక కూర్చోగానే జీప్ కదిలింది. జీప్

వెనకనే వాన్ దూసుకుపోయింది.

ఎవరో తలుపును తట్టారు.

"కమిన్!" అన్నాడు ముకుంద్.

రాజు గదిలోకొచ్చాడు. ఒక ఏర్‌బాగ్‌ను అతడు టేబిలుమీద వుంచాడు.

"థాంక్స్‌ఫర్ సేఫ్ కస్టడీ," అన్నాడు ముకుంద్.

"మళ్ళా కొంతకాలం దాకా పోలీసులు రారు!" అన్నాడు రాజు.

"ఆదివారం తర్వాత వాళ్లిక్కడికి రావలసిన అవసరం వుండదు!" అన్నాడు ముకుంద్.

"మీరు జయిస్తే!" అన్నాడు రాజు.

"ఇంతవరకు నేనోడిపోలేదు," అన్నాడు ముకుంద్ జుత్తును నిమురుకుంటూ.

## 7

ఆదివారం!

విశ్వమోహన్ గదిలో పచార్లు చేస్తున్నాడు. తలుపును తట్టి, లాగి ఒకతను లోపలకొచ్చాడు.

పొడుగ్గా, బలంగా వున్నాడతను. అతడి చేతులు యినప కడ్డీల్లా వున్నాయి.

"జాకబ్!" అని అగాడు విశ్వమోహన్.

"చెప్పండి బాస్!"

అతడిది బొంగురు కంఠం.

"ఇవాళ రాత్రి ముకుంద్ హోటలు గంగాకు వెళ్తాడు. పని పూర్తయ్యాక అతడు తిరిగివస్తాడు. దోవలో అతడిని తుద ముట్టించాలి!"

జాకబ్ వులిక్కిపడ్డాడు. భయంతో బాస్ వంక తిరిగాడు. విశ్వమోహన్ అతడి కళ్ళలోకి చూశాడు.

"ఆ ఎముకలపోగును చూసి మీరందరూ ఎందుకంతగా భయపడ్డారు? ముకుంద్ బలవంతుడు కాడు. నువ్వతడిని సులువుగా సఫా చెయ్యగలవు!"

"ముకుంద్ నక్కలాంటివాడు, బాస్! అతడితో కయ్యానికెళ్తే నేనే చావవలసి వస్తుంది!" అన్నాడు జాకబ్.

"నువ్వు ధైర్యం కలవాడవు అనుకున్నాను. ఈపని తిరపతి కిస్తానులే!"

తిరపతి పేరు వినగానే జాకబ్ కళ్ళు ఎర్రబడ్డాయి. తిరపతి విశ్వమోహన్ మనిషే కాని, జాకబ్, తిరపతుల మధ్య పచ్చగడ్డేస్తే భగ్గుమంటుంది.

"తిరపతి యీపని చెయ్యలేడు బాస్. నేనే మీరు కోరినట్లు చేస్తాను."

"అంతా సవ్యంగా జరిగాక నువ్వికక్కడ పెద్ద హోదాలో వుంటావు!" ఆశ చూపించాడు విశ్వమోహన్.

"చేస్తాను, జయిస్తాను," అన్నాడు జాకబ్.

# 8

చీకటి పడింది. లైట్లు వెల్గుతున్నాయి.

ఇన్‌స్పెక్టర్ నాయర్ జీప్ హోటలుముందు ఆగింది. అతడు కిందకు దిగాడు.

సాయుధ పోలీసులు అతడికి శల్యూట్ చేశారు.

"అందర్నీ జాగ్రత్తగా చెక్ చేయండి! చెక్ చేయకుండా ఎవర్నీ లోపలకు వెళ్ళనీయకూడదు," అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"చీమనుకూడా వెళ్ళనివ్వం సార్," అన్నాడొక కానిస్టేబుల్.

అంతలో డ్రీమ్‌లాండ్ లాండ్రీస్ వాన్ జీప్‌పక్క

నుంచి హోటలు వెనక్కి దూసుకుపోయింది.

యాభై అట్టపెట్టెలను పెద్దహాల్లో గోడ వారగా పెట్టారు. లాండ్రీవాన్ తిరిగి వెళ్ళిపోయింది. సోమవారం పొద్దుటదాకా ఆ పెట్టెలను ఎవరూ ముట్టుకోరు.

దుప్పట్లు, తువ్వాళ్ళు, గలేబులు సరిగావున్నాయో లేవో సోమవారం పొద్దుటే చెక్ చేస్తారు. ఆటుపైన వాటిని గదులకు పంపుతారు!

ఒక పెట్టె పై మూతను ముకుంద్ మెల్లిగా పైకి తోశాడు. తల కొద్దిగా పైకెత్తి చూశాడు.

విశాలమైన స్టోర్ రూమ్. గది నలువైపులా పాకెట్లు, డబ్బాలు వగైరా వున్నాయి. ఇద్దరు మనుషులు అతడున్న వైపు వస్తున్నారు.

అతడు మళ్ళీ వుండచుట్టుకు పడుకుని మూతను కిందకు లాగాడు. పక్కనుంచి వాళ్ళిద్దరూ నడిచి వెళ్ళిపోయారు.

అతడు మూతను మళ్ళీ పైకి తోశాడు. గదిలో ఎవరూ లేరు. లైట్లు వెల్గుతున్నాయి.

ముకుంద్ బయటకు వురికాడు. పాకెట్ మూతను మూసేశాడు.

వాన్ డ్రయివర్‌కి వందరూపాయలిచ్చాడతను. పోలీసులు చెక్ చేయకుండా అతడు హోటల్ స్టోర్‌రూమ్‌లోకి చేరుకో గలిగాడు!

అతడు టైమ్ చూసాడు. ఏడయింది.

మెల్లిగా గుమ్మంవైపు నడిచి బయటకు చూశాడు. ఎవరో వస్తున్నారు!

ముకుంద్ తలుపువెనక్కి జరిగాడు. ఇద్దరు లోపలకు వచ్చి రెండు నూనెడబ్బాలను పట్టుకుని వెళ్ళిపోయారు.

ముకుంద్ వేగంగా కదిలాడు. బయటనున్న నడ

వమ్మట కదిలాడు. లిఫ్ట్ కిందకు దిగి ఆగింది. అందులోంచి ముగ్గురు పని మనుషులు దిగి హోటలు గదిలోకి గబగబా వెళ్ళారు.

అతను నలువైపులా చూసి లిఫ్ట్‌లోకి దూరాడు. పన్నెండో అంతస్తు బటన్ నొక్కాడు. కాస్సేపట్లో లిఫ్ట్ ఆగింది. ముకుంద్ నడవలో అడుగు పెట్టాడు.

అతడు నడవమ్మట నడుస్తున్నాడు. మలుపు తిరిగి ఎవరో ఎదురుగా వస్తున్నారు. అతడు విదేశీయుడు!

ముకుంద్ నవ్వుతూ ముందుకుపోయాడు. బూట్ల చప్పుడు అతడికి వినిపించింది. ఆ శబ్దాలనిబట్టి పోలీసు లని అతడు పసిగట్టాడు.

అతడు నడవ పొడుగునా చూశాడు. ఎక్కడా దాక్కునే అవకాశం లేదు. అతడు ముందుకు వెళ్లాడు. ఒక గది తలుపునుతోసి లోపలకు చూశాడు. గదిలో ఎవ్వరూ లేరు.

అతడు లోపలకు వెళ్ళి తలుపును దగ్గరగా మూశాడు. గదిలోవుండే అతను ఎటాచ్‌డు బాత్‌రూమ్‌లో వున్నట్లు న్నాడు.

బూట్లచప్పుడు గుమ్మం ముందునుంచి కదిలింది. అతను బయటకు వంగి చూశాడు. ఇద్దరు కానిస్టేబుల్సు పోతు న్నారు.

ముకుంద్ మళ్ళీ నడవమ్మట వేగంగా కదిలాడు. నడవ చివర మలుపుతిరిగి టైమ్ చూశాడు. ఎనిమిదిన్నర కావ స్తోంది.

మధ్యవయస్సులోవున్న స్త్రీ గదితలుపు మూసి నడ వమ్మట నడచివస్తోంది. అతడు దాక్కోడానికి ప్రయ త్నించలేదు.

ఆమె అతడివైపుచూసి కళ్లు చిట్లించింది. అతడు మెల్లిగా నవ్వుతూ ముందుకు కదిలాడు, ఆమె గదిముందు కెళ్ళి ఆగాడు.

అతడు తాళం చెవినితిప్పి లోపలకు వెళ్ళాడు. తలుపు మూసి తాళం వేశాడు.

కిటికీ దగ్గరకు నడిచి బయటకు చూశాడు.

స్విమ్మింగ్ పూల్ కనిపిస్తోంది. పరిసరాల్లో ఎవ్వరు లేరు. లైట్లు తీసివేయబడ్డాయి.

ముకుంద్ కిటికీమీదకు ఎక్కాడు. పైనున్న సన్ షేడ్ అతడి చేతికి తగిలింది. రెండు చేతుల్తోనూ సన్ షేడును పట్టుకుని అతడు పైకిలేచాడు. మెల్లిగా సన్ షేడు మీదకు చేరుకున్నాడు.

సన్ షేడుమీద నిలబడి నలువైపులా చూశాడు. హోటలు పక్క రోడ్డమ్మట కార్లు కదుల్తున్నాయి. కింద మనుషుల అతడికి స్పష్టంగా కనపడ్డంలేదు.

కాస్సేపు అలాగే వున్నాడతను. ఎనిమిదడుగుల దూరంలో నీళ్ళగొట్టం కనిపించింది. పై డాబాలోవున్న ఓవర్ హెడ్ టాంక్ నుంచి ఆ గొట్టం కిందకు దిగింది.

జేబులోంచి నైలాన్ తాడుచుట్ట తీశాడతను. తాడుకు చివర స్టీల్ హుక్కు అమర్చబడింది.

అతడు హుక్కును నీళ్ళగొట్టం వైపు విసిరాడు. హుక్కు గొట్టానికి తగిలి వెనక్కువచ్చింది. మళ్ళీ విసిరాడతను. ఈసారి హుక్కు పైప్ కు చుట్టిన రింగును పట్టుకొంది.

అతడు తాడును బలంగా లాగాడు. హుక్కు పట్టు విడలేదు. రెండో భాగాన్ని అతడు నడుముకు చుట్టి కట్టుకున్నాడు. అమాంతంగా అతడు తాడును పట్టుకుని

గాల్లోకి దూకాడు. పైపునుదాటి అతడు అటువైపుకు వెళ్లాడు. మళ్ళా యిటువైపుకు కదిలాడు. కొంత సేప టికి అతడి కాళ్ళకు పైప్ తగిలింది. అతడు ఒకచేత్తో పైప్ ను పట్టుకొన్నాడు.

పైపమ్మట అతడు మెల్లిగా పైకి పాకాడు. హుక్కు పట్టుకున్న చోటుకు చేరుకున్నాడు. హుక్కును తీసేసి జేబులో పెట్టుకున్నాడు.

కాసేపట్లో అతడు పైనున్న రూఫ్ గార్డెన్ కు యెక్కు కలిగాడు. పైన చీకటిగావుంది.

దక్షిణం వైపుకు నడిచాడతను. పిట్టగోడ వారగా నిలబడి కిందకు చూశాడు. సన్ షేడు కనిపిస్తోంది. 265 నంబరు గది కిటికీ అక్కడేవుంది.

పిట్టగోడ పక్కనున్న యినుప రింగ్ లోకి హుక్ ను పోనిచ్చాడతను. తాడు పట్టుకుని మెల్లిగా సన్ షేడు మీదకు దిగాడు.

టైమ్ చూశాడు. తొమ్మిదిన్నర యింకా కాలేదు.

అతడు సన్ షేడు మీద పడుకొని ముఖాన్ని చివరకు పోనిచ్చాడు. మెడనువంచి కిందికి చూశాడు. కిటికీ తలుపులు తెరిచివున్నాయి. కిటికీదగ్గర ఎవరూలేదు.

లత యీపాటికి భోజనంచేస్తూ వుండాలి.

ముకుంద్ సన్ షేడుమీద బోర్లా పడుకొనివున్నాడు. నిమిషాలు గడుస్తున్నాయి.

సరయిన క్షణంకోసం అతను ఎదురు చూస్తున్నాడు.

# 9

ఏదో చప్పుడువిని ఇన్ స్పెక్టర్ నాయర్ కిటికీ దగ్గర కెళ్ళి బయటకు చూశాడు.

ఏదో భయంకరమైన కేకవిని అతడు వులిక్కిపడ్డాడు. గబగబా బయటకు పరిగెత్తాడు. పక్కనేవుంది లత గది.

సాయుధపోలీసులు అతడివైపు ఆశ్చర్యంగా చూశారు. అతడు గదిలోకి జొరబడ్డాడు.

కిటికీ తెరిచివుంది. నర్స్ లిల్లీ అతడివైపు గాభరాగా చూసింది. కిటికీముందు గచ్చునేలమీద లత పక్కకు పడుంది. ఆమె నుదురుమీదనుంచి రక్తం కార్తోంది.

ఇన్ స్పెక్టర్ నాయర్ వంగి మోకాళ్ళమీద కూర్చుని లత చెయ్యి పట్టుకున్నాడు.

"ఎవరు షూట్ చేశారు?" అడిగాడు నాయర్.

ఆమె అతడి వైపు బాధతో చూసింది. మరుక్షణంలో ఆమె తల పక్కకు పడింది.

ఇన్ స్పెక్టర్ నాయర్ లేచాడు. కిటికీ దగ్గరకెళ్ళి బయటకు చూశాడు. ఏమీ కనిపించలేదు.

నాయర్ లిల్లీ వైపు చూశాడు.

"విచిత్రంగావుంది సార్. ఇదెలా జరిగిందో!" అంది లిల్లీ.

ఇన్ స్పెక్టర్ నాయర్ వెనక్కు తిరిగి గుమ్మంవైపు పరుగెత్తాడు. బయట కాపలావున్న సాయుధ పోలీసులు అతన్ని చుట్టేశారు.

"ఎవడో హంతకుడు ఈ హోటల్లో వున్నాడు. సీల్ ది హోటల్! ఎవర్నీ బయటకు వెళ్ళనీయకండి. ఈ అంతస్తులోని గదులన్నీ వెతకండి. పై డాబామీదకి వెళ్ళి చూడండి," అర్చాడు నాయర్.

సాయుధ పోలీసులు నలువైపులా పరుగెత్తారు. ఇన్ స్పెక్టర్ నాయర్ మేడ మెట్లవైపు కదిలాడు. అక్కడున్న పోలీసుల్ని కూడా హెచ్చరించాడు.

కొందరు సాయుధపోలీసులు పై డాబావైపు మెట్లు ఎక్కారు.

ఇన్‌స్పెక్టర్ నాయర్ మెట్లుదిగి పన్నెండో అంతస్థుకి చేరుకున్నాడు. లిఫ్ట్‌వైపు వేగంగా అడుగులేశాడు.

ముకుంద్ నీళ్ళపైపమ్మట వేగంగా కిందికి జారుతున్నాడు.

కాస్సేపట్లో స్విమ్మింగ్‌పూల్ సమీపంలో అతడు కిందికి దిగాడు. అక్కడ చీకటిగా వుంది. ముకుంద్ చీకట్లో మెల్లిగా కదిలాడు. కొంచెందూరం వెళ్ళాక నిలబడి నలువైపులా చూశాడు. దూరంలో హోటలుముందు గుమ్మం ప్రాంతంలో సాయుధ పోలీసులు గుంపులుగా వున్నారు. లతకు ఏం జరిగిందీ వాళ్ళకింకా తెలిసినట్లు లేదు.

అతడు గబగబా గేటువైపు అడుగులేశాడు. గేటు దాటి బయటకు వెళ్తూండగా నలుగురు కానిస్టేబుల్సు వెనకనుండి గబగబా రావడం అతడు గుర్తించాడు.

అతడు వెనక్కి తిరిగి చూడలేదు. హోటలు యినుప గేటు మూసిన చప్పుడు అతడికి వినిపించింది. కొంచెం దూరంలోవున్న తన కారువైపు అతడు వేగంగాకదిలాడు. కారులో కూర్చుని తలుపు మూశాడు. సిగరెట్ వెలిగించి పొగవదల్తూ కారుని పోనిచ్చాడు.

# 10

ఏర్ కండిషన్డ్ గదిలో ప్రశాంతంగా వుంది.

రొటేటింగ్ కుర్చీలో కూర్చున్న విశ్వమోహన్ మెదడులో రైళ్లు పరిగెడుతున్నాయి. జాకబ్ రాకకోసం అతనెదురు చూస్తున్నాడు.

ఎదురుగా కూర్చున్న రాజు చేతులు వణుకుతున్నాయి.

విశ్వమోహన్ అతడివైపు సూటిగా చూశాడు. రెండు గ్లాసుల్లో స్కాచ్ విస్కీ పోశాడు.

"డ్రింకిట్. నీ భయం మాయమవుతుంది," అన్నాడు విశ్వమోహన్.

ఇద్దరూ సోడా కలపని విస్కీని మెల్లిగా తాగుతూ కూర్చున్నారు.

తలుపుమీద ఎవరో తట్టారు. విశ్వమోహన్ కళ్ళు మెరిసాయి.

"రాజూ, జాకబ్ అయియుంటాడు. లోపలికి రాగానే ఏం చెయ్యాలో నీకు తెలుసు. షూట్ హిమ్!"అన్నాడు విశ్వమోహన్.

తలుపునులాగి లోపలికొచ్చిన ఆకారం వైపు వాళ్ళు యిద్దరు భయంతో చూశారు.

ముకుంద్! అతడు మృత్యువులా వాళ్ళవైపు నడిచాడు. చేతిలో పిస్తోలు మెరుస్తోంది. విశ్వమోహన్ వైపు అతను పళ్ళుకొరుకుతూ చూశాడు.

"మిస్టర్ విశ్వమోహన్ నువ్వుకోరినట్లు లతను సఫా చేశాను," అన్నాడతను.

విశ్వమోహన్ కుర్చీలోంచి లేవబోయాడు.

"కదలకు, అలాగే కూర్చో" అన్నాడు ముకుంద్.

విశ్వమోహన్ చలనం లేకుండా కూర్చుండిపోయాడు.

"యూ ఆర్ ట్రెయిటర్. నాచేత అంతా చేయించుకుని నన్ను చంపడానికి జాకబ్ ని పంపావు. పూర్ ఫెలో, జాకబ్ అంత తెలివయినవాడు కాదు. నన్ను చంపబోయి నా చేతుల్లో చచ్చాడు."

"మిస్టర్ ముకుంద్, నీ మాటలు విచిత్రంగావున్నాయి. జాకబ్ ని నేను పంపలేదు. నిన్ను చంపవలసిన అవసరం

నాకేముంది?" అన్నాడు విశ్వమోహన్.

"యూ ఆరే లయర్. నీకు ఆశ్రయమిచ్చి నిన్ను పైకి తీసుకొచ్చిన దీనదయాళ్‌ని చంపి అతడి ఆస్తిపాస్తులను కాజేశావు. నిన్ను చంపాలనే వుద్దేశం మొదట్లో నాకులేదు. జాకబ్ చెప్పింది విన్నాక నీలాంటి ద్రోహులను నిర్మూలించి తీరాలని నిశ్చయించుకున్నాను. ట్రెయిటర్! గుడ్ బై టుయూ!"

ఒక్కసారి ముకుంద్ ట్రిగర్ నొక్కాడు. భయంకరమైన చప్పుడయింది. కుర్చీలోంచి తూలి విశ్వమోహన్ కింద పడ్డాడు. రాజా వణుకుతూ చేతులు జోడించి, అతడివైపు తిరిగాడు.

ముకుంద్ అతనివైపుచూసి మెల్లిగా నవ్వాడు.

"రాజా, ఇటుపైన ఈ హోటలుకి నువ్వు యజమానిగా వుంటావు. విష్‌యూ గుడ్ లక్!"

పిస్టల్ని జేబులో పడేసుకొని ముకుంద్ మెల్లిగా గుమ్మంవైపు అడుగులేశాడు. స్ప్రింగ్ తలుపు అతడి వెనకనే మూసుకుపోయింది.

—:ఐపోయింది:—

# టాక్సీ స్టాండ్!

ఎస్. ఎస్. శాస్త్రి

"రాజా! నేను వెళుతున్నాను!" అని ఇన్‌స్పెక్టర్ వినోద్ చూస్తున్న ఫైలుమూసేసి, లేచినిలబడ్డాడు.

అదే సమయంలో టేబిలుమీది టెలిఫోన్ గణ...గణ మంది. వెళ్లబోతున్న ఇన్‌స్పెక్టరు వెనక్కి తిరిగి విసుగ్గా చూసాడు దానివేపు.

సార్జంటు రాజు నవ్వుతూ చూసాడు ఇన్‌స్పెక్టర్ వినోద్ వేపు. "బాడ్ లక్ సార్" అన్నాడు.

"అసలు ఫోన్ 'ఆ' విషయాలకి సంబంధించిందేనని ఎలా చెప్పగలం? ఎవరో చూడు?" అన్నాడు వినోద్.

సార్జంటు రాజు మౌనంగా రిసీవరందుకుని "హలో..." అన్నాడు. వినోద్ అతని ముఖంలో భావాలు చూస్తున్నాడు.

రాజు అవతల మనిషి చెప్పింది విని "లైన్లో వుండండి" అని వినోద్ వేపుచూసి, "నిజంగా బాడ్ లక్కే సార్! ఎవడో మహాదేవన్‌ట. సైకిలుమీద యింటికిపోతూ, ఓ

సందులో రోడ్డుపై ఓ శవం చూసాడట. మనకు తెలియ పర్చటం తన ధర్మమని, ఓ పబ్లిక్ టెలిఫోన్ బూత్ లోంచి టెలిఫోన్ చేస్తున్నాడట...'' అన్నాడు.

''అలాగా తక్షణం వస్తున్నామని, అతన్నక్కడే వుండమని చెప్పు! అలాగే మన పోలీస్ డాక్టర్‌కి, మిగతా బలగానికి ఫోన్ చెయ్యి!'' అన్నాడు ఇన్స్పెక్టర్ వినోద్ సిగరెట్ తీసి వెలిగిస్తూ.

సార్జంట్ రాజు అలాగే ఫోన్‌లో చెప్పి, అంబులెన్స్‌కి ఫింగర్ ప్రింట్ ఎక్స్‌పర్ట్‌కి, ఫోటోగ్రాఫర్‌కి ఫోన్ చేసి లేచాడు.

వినోద్, సార్జంట్ రాజు, మరో నలుగురు కానిస్టేబుల్సుతో జీప్‌లో బయలుదేరాడు.

వినోద్ టైం చూసుకున్నాడు.

సరిగ్గా పన్నెండుంపావు! అర్థరాత్రిదాటి పావుగంట అయిందన్నమాట, అనుకున్నాడు.

ఇన్స్పెక్టర్ వినోద్ సిగరెట్ కింద పడేస్తుండగా జీపు ఓ సందులోకి తిరిగింది. ఆ వీధి పోలీసుస్టేషన్‌కు దగ్గరలోనేవుంది.

అప్పుడే వీధి మొదట్లోవున్న ఓ కిళ్ళీకొట్టును చూసాడిన్స్పెక్టర్. కిళ్లీకొట్టు మూయబడివుంది.

ఇరుకుగావున్న ఆ సందులో జీప్ కొద్దిదూరం వెళ్ళి టక్కున ఆగింది. కిందికి దిగుతూ హెడ్‌లైట్స్ వెలుగులో చూసాడిన్స్పెక్టర్.

రోడ్డుకు ఓపక్క నేలమీద బోరుగిల పడుంది శవం. పక్కనే నెత్తురు మడుగుకట్టి వుంది. కంఠంలో కత్తి కన్పిస్తోంది.

అక్కడే ఓపక్క నిలబెట్టబడిన సైకిల్ నానుకున్న

ఓ మనిషి కనిపించేరు. అతనే తమకు ఫోన్ చేసిన మహా దేవన్ అని అనుకున్నాడు వినోద్.

"మీరేనా మహాదేవన్!" అన్నాడు వినోద్.

అతను అవునని తలూపి, "ఇన్స్పెక్టర్ నన్ను వేగిరం పంపించేయండి. ఇంటిదగ్గర వంట్లో బాగోలేని మా అమ్మ ఒక్కతేవుంది..." అన్నాడు.

"మీ యిల్లెక్కడ?"

"మా యిల్లు యీపక్క సందే..."

"మీరేం చేస్తున్నారు? ఎక్కడ్నుంచివస్తూ శవాన్ని చూసారు?"

"సుబ్రహ్మణ్యవిలాస్ నాదే! హోటలు కట్టేసరికి రాత్రి పదకొండు దాటుతుంటుంది రోజూ. ఎప్పటిలాగే సైకిలుమీదవస్తూ లైటువెలుగులో ఈ ఘోరంచూసాను." అన్నాడు మహాదేవన్.

"ఫోను యెక్కడ్నుంచి చేసారు?" అడిగాడు వినోద్.

"ఇక్కడ్నుంచి మెయిన్ రోడ్డులో కొంచెందూరం వెళ్తే పబ్లిక్ టెలిఫోన్ బూత్ వుందిగదా!...అక్కడకు సైకిలుమీద వెళ్ళాను. మీరుండమన్నారని యిక్కడ వున్నాను...సార్! నన్ను పంపేయండి. వేగిరం మా అమ్మ..." అన్నాడు మహాదేవన్.

"సరే! మీ యింటి అడ్రస్ యిచ్చి వెళ్ళండి...రేపు పోలీస్ స్టేషన్‌కి రావటం మరవద్దు! స్టేట్‌మెంటివ్వాల్సి వుంటుంది," అన్నాడు వినోద్.

మహాదేవన్ తలూపి, అడ్రసిచ్చి వెళ్ళిపోయాడు.

అదే సమయంలో అంబులెన్స్ వచ్చింది. దాంతో ఆ ప్రదేశం బాగా వెలుగుతో నిండింది. అయినా వీధిలోకి

జనం ఎవరూ రాలేదు.

"ఇంత తతంగం జరుగుతున్నా యెవ్వరు లేవరేం? ఈ వీధిలోని వాళ్ళందరు మొద్దునిద్ర గాళ్ళల్లా వున్నారు," అన్నాడు రాజు.

వినోద్ నవ్వి, "ఆ విషయం హంతకుడికి బాగా తెలిసి వుండాలి! అందుకే యిక్కడకి రానిచ్చి అతడ్ని హత్య చేశాడు..." అని శవం దగ్గర మోకాళ్ళమీద కూర్చున్నాడు. సార్జంటు రాజుకూడా ముందుకు వంగేడు.

సార్జంటు రాజుపై ఇన్స్పెక్టర్ వినోద్‌కి బాగా అభిమానముంది. అతన్నో సార్జంటులాకాక, తన అసిస్టెంటులా చూస్తాడు.

వినోద్ పరీక్షగా చూస్తున్నాడు.

హతుడి కుడి అరచేయి బోర్లించి వట్టుంది. వినోద్ ఆలోచిస్తూ చేయి ఎత్తేడు. అక్కడ నేలమీద అష్టవంకర్లుగా ఏవో అక్షరాలు నెత్తురుతో వ్రాయబడి కనుపించాయి. వినోద్ మరింత ముందుకు వంగాడు.

"మూడు 'ఆర్'లు! ట్రిబుల్ ఆర్!" అన్నాడు రాజు ఆశ్చర్యంగా. వినోద్ చూపుడువేలు చూసాడు. వేలి చివర రక్తంతో యెర్రగావుంది.

"హతుడే వ్రాసాడు" అన్నాడు రాజు తన నోట్ బుక్‌లో వ్రాస్తూ. వినోద్ పెదిమ విరిచి, "చెప్పలేము. హంతకుడే శవం వేలిని ముంచి రాయించుండొచ్చు, మూడు 'ఆర్'లుతో పేరున్న హతుడి బంధువుమీదకు నేరం పోవటానికి వీలుంటుందని..." అన్నాడు.

వినోద్ హతుడి పాంటుజేబు తడిమాడు. పర్సుందని అర్థమయింది. రుమాలుతో దాన్ని తీసి, మళ్ళీ చెయ్యిపెట్టి ఓ కాగితంముక్క తీశాడు. అది సినిమా టికెట్ ముక్క.

"హతుడు సినిమానుంచి వస్తూ హత్యగావింప బడ్డా డన్న మాట" అన్నాడు.

"అయుంటుంది. ఈ జేబులో మరేం లేవు. ఆ జేబులో వెతికితే శవం కదులుతుంది. ముందు ఫోటోగ్రాఫర్‌ని ఫోటోలు తియ్యమని చెప్పు. ఆ పర్సు ఫింగర్ ప్రింటు ఎక్స్‌పర్ట్‌కియ్యి. డాక్టర్ని రమ్మను..." అని లేచా డిన స్పెక్టర్ వినోద్.

వెంటనే ఫోటోగ్రాఫర్ ముందుకొచ్చాడు ఫ్లాష్ కెమెరా పట్టుకుని!

## 2

ఇన్‌స్పెక్టర్ వినోద్ చెప్పమన్నట్టుగా సార్జంటు రాజు వేపు చూసేడు.

రాజు గొంతు సవరించుకున్నాడు.

"హతుడి వివరాలు తెలుసుకున్నాను. హతుడి పేరు రామారావు. ఈ నగరానికి మైలుదూరంలో ప్రభుత్వం కొత్తగా స్థాపించిన ఫ్యాక్టరీలో ఆఫీస్ క్లర్కుగా వుద్యోగం చేస్తున్నాడు. భార్య పేరు లక్ష్మి. ఇద్దరు కొడుకులు చిన్నవాళ్ళే! రామారావుకీవూర్లో దగ్గిర బంధువులెవరూ లేరట..." అన్నాడు.

వినోద్ తలూపి "గుడ్, అయితే మనం ఒకసారి హతుడి యింటికి వెళ్ళొద్దాం పద" అని హేటందుకుని లేచాడు.

ఇద్దరు కూర్చున్నాక జీపు కదిలింది.

"రాజూ! రామారావు సినిమాకి వెళ్ళినట్లు నిర్ధారణ అయ్యిందా?" అన్నాడు. సార్జంటు రాజు పెదిమవిరిచి "ఏదీ! రామారావు ఫ్యాక్టరీలో పనిచేస్తున్నాడని అతని పర్సులో ఓ కాగితం వలన తెలిసిందా. అక్కడకు వెళ్ళి

అతనింటి అడ్రసు తెల్సుకొని యింటికెళ్ళి ఈ దుఃఖవార్త చెప్పేసరికి పాపం ఆ లక్ష్మి హృతాశురాలయి మూర్ఛపోయింది. జనం గుమికూడారు. ఇక లాభంలేదని వచ్చేసాను. అందుకే పూర్తి వివరాలు తెలీలేదు. ఇప్పుడు వెళ్తున్నాంగా..." అని "కానిసార్...ఓ విషయం" అన్నాడు రాజు.

"ఏమిటి?" అడిగాడు వినోద్.

"నేను రామారావు హత్య చెయ్యబడ్డాడని తెల్పగానే ఆ ఫ్యాక్టరీ మేనేజర్ జగత్‌సింగ్ ... అతనో రిటైర్డ్ మిలట్రీ ఆఫీసర్ ... చాలా ఆశ్చర్యపోయాడు. చాలా గాభరాపడ్డాడుకూడా. ఏదో తీవ్రంగా ఆలోచిస్తూండిపోయాడు. హత్య వివరాలన్నీ తెల్సుకున్నాడు" అన్నాడు.

వినోద్ తీవ్రంగా ఆలోచిస్తూండిపోయాడు.

"సార్ మరో విషయం" అన్నాడు రాజు.

"చెప్పు."

"రామారావు సినిమాకు వెళ్ళాడనుకుందాం. అతను యింటికి వెళ్ళడానికయితే...అతను హత్య చేయబడిన సందులోకి రానవసరంలేదు. ఎందుకంటే, అతనిల్లు సినిమాహాలుకు వెనుకనున్న వీధిలోనేవుంది. కాబట్టి అతను మరెక్కడికో వెళ్ళటానికో ఆ సందులోపడి వస్తున్నాడు" అన్నాడు రాజు.

"అతను ఫస్ట్‌షో సినిమాకు వెళ్ళి యింకెటో వెళ్ళడానికి ఈ సందులోంచి వస్తున్నాడన్న మాట. కాని మరో విషయం గమనార్హం. ఆ టిక్కెట్టుముక్క లోయర్ క్లాస్‌ది. రామారావులాటి వాళ్ళు ఆ 'క్లాస్'కి వెళతారంటే అసందర్భంగా వుంది. కాబట్టి అతడు అలా వెళ్ళ

టానికి యేదో కారణం వుండి వుండాలి,'' అన్నాడు వినోద్.

"అవును..." అన్నాడు రాజు తలూపుతూ.

"అంతేకాదు రాజూ! జాగ్రత్తగా ఆలోచిస్తుంటే రామారావు హత్య సామాన్యమైన దానిగా తీసివేయ కూడదనిపిస్తోంది!" అన్నాడు వినోద్.

"ఎందుకంటారు?" అన్నాడు రాజు.

"అతను పనిచేస్తున్న ఫ్యాక్టరీ సామాన్యమైనదిగాదు. మన ప్రభుత్వం దాన్నిమధ్యనే కొత్తగా నెలకొల్పింది. ఆ ఫాక్టరీలో సైనికుల కవసరమైన గన్స్, పిస్టల్సు మొదలయిన మారణాయుధాలలోని కొన్నిటి పార్ట్స తయారవుతాయి. కాబట్టి ఆ ఫాక్టరీలో సెక్యూరిటీ చాలా స్ట్రిక్ట్‌గా వుంటుంది..."

రాజు కతని వుద్దేశ్య మర్థమయిందికానీ ఏకీభవించలేక పోయాడు. అలాంటి ఫాక్టరీలు దేశంలో చాలావున్నాయి.

"వచ్చేసాం...సార్" అన్నాడు జీపు కాలనీలోకి తిప్పుతూ. ఆ కాలనీ ప్రత్యేకంగా ఫాక్టరీ వర్కర్స్‌కి నిర్మించబడింది. రాజు ఓ యింటిముందు జీపు ఆపాడు.

"ఇదే రామారావు యిల్లు!" అన్నాడు రాజు.

ఇన్స్పెక్టర్ వినోద్ తలూపి, ఆ యింటి వేపు పరీక్షగా చూస్తూ, జీపునుంచి కిందకు దిగాడు.

## 3

"టక్...టక్..." రాజు తలుపుతట్టేడు.

మరుక్షణం తలుపులు తెరుచుకున్నాయి. ఓ ముసలాయన యిద్దరినీ ఎగాదిగాచూసి "రండి..." అన్నాడు.

వినోద్, రాజు యిద్దరూ లోనికి నడిచి, ముసలాయన చూపిన కుర్చీల్లో కూర్చున్నారు.

"మీ రేమవుతారు లక్ష్మిగార్కి?" అడిగాడు రాజు ముసలాయన్ని చూస్తూ.

"బాబాయినవుతాను..." అన్నాడాయన నిట్టూరుస్తూ.

రాజు ఆశ్చర్యంగాచూచి, "బాబాయా? లక్ష్మిగారు నాతో తనకెవరూ లేరు అన్నారే" అన్నాడు.

ఆ ముసలాయన విషాదంగా నవ్వి "అందులో వింత లేదు. లక్ష్మినాన్న అంటే మా అన్న చనిపోతూ దీన్ని నా చేతుల్లో వుంచాడు. నేనేలాగూ ఒంటరినే గాబట్టి లక్ష్మిని గారాబంగా చూసేవాణ్ని. లక్ష్మి రామారావును ప్రేమించి పెళ్ళిచేసుకుంది. నేను ముందు ససేమిరా వీల్లే దన్నాను. అందుకే ఆమెకి నాపై బాగా కోపం. నాకు ఎన్నడూ లక్ష్మిఅంటే ప్రేమే. రామారావు ఒంటరి. అతనెవరో అతనికే తెలీదు! అందుకే ఆనాడు వద్దన్నాను. పోనీలెండి యిదంతా యెప్పటి మాట..." అన్నాడు.

"అలాగా ... మీ పేరేమిటి? మీ రెక్కడుంటు న్నారు? ఏం చేస్తూంటారు?" అడిగాడు యిన్స్పెక్టర్ వినోద్.

ఇంతలో లోపలి గదినుంచి రామారావుభార్య లక్ష్మి వచ్చింది. వెనకే ఆమె చీరకొంగు పట్టుకొని భయంగా చూస్తూ యిద్దరు పిల్లలు వచ్చేరు. ఆమెముఖంలో దైన్యం పేరుకుపోయింది. ఇన్స్పెక్టర్ని చూడగానే ఆమెకళ్లలో నీరు వుబికింది.

వినోద్ బాధగా ఆమెనోసారి చూసి, ముసలాయన వేపు చూశాడు తన ప్రశ్నలకు సమాధానమివ్వమన్నట్లు.

ముసలాయన ఓసారి దగ్గి "నాపేరు రామానుజరావు. ఈ నగరానికి పది మైళ్ల దూరానవున్న కొత్తపురంలో వుంటున్నాను. సేద్యం చేస్తుంటాను. పనిమీద ఎప్పుడూ

యిక్కడికి వస్తుంటాను...అలాగే నిన్న సాయంత్రం వచ్చేనీవూరు. కాని పని బాగా వుంటంతో యింటికి రాలేకపోయానప్పుడే. ఈరోజు వుదయం వచ్చేసరికి... యీ విషయం తెల్సింది'' అన్నాడాయన.

''మీ పూర్తిపేరేమిటి?'' రాజు అడిగేడు.

''రామవరపు రామానుజరావు!'' ఆయన అన్నాడు.

ఉలిక్కిపడి యిన్స్పెక్టర్ వినోద్ వేపు చూశాడు రాజు. కాని వినోద్ అతనివైపు చూడలేదు.

''మీరీ వూరికి ఏ పనిమీదవస్తుంటారో చెప్పగలరా'' అడిగాడు వినోద్.

''ఏమీ లేదు ... నేను వ్యవసాయంగదా చేస్తూంట. విత్తనాలు ... మొదలయిన వాటికోసం వస్తుంటాను. 'నేషనల్ అగ్రికల్చర్ సీడ్సు అండ్ ఇంప్లిమెంట్స్ సప్లయి స్టోర్స్'కి వెళుతుంటాను వివరాలకి. నిన్న ఆ పని మీదేవచ్చి ఆ కంపెనీకి వెళ్ళాను...''

''నిన్న అక్కడ ఎన్నిగంటలవరకు వున్నారో చెప్ప గలరా?'' అడిగాడు రాజు.

రామానుజరావు అదోలా రాజును చూసి ''విత్తనాలు మొదలయిన వాటిగూర్చి నేనీవూరు వచ్చినపుడు నాతోటి వ్యవసాయదారులు తమపనిగూడా నాకే ఒప్పచెపుతారు. నిన్న ఆ కంపెనీలో పదిన్నరవరకు మా నేజరుతో ఈ విష యాలపై మాట్లాడుతూనే వున్నాను. ఆయనతో నాకు బాగా పరిచయముంది...అందుకే రాత్రి చాలా టైమ్ అయిందనీ, యిప్పుడు యెక్కడికి వెళ్తారని తనయింటికి రమ్మన్నాడు. నాకు రాత్రివచ్చి లక్ష్మిని, రామారావును డిస్టర్బ చేయటం యిష్టం లేకపోయింది...'' అని విపు లంగా చెప్పాడు ఆయన.

రాజు నిరుత్సాహంగా వినోద్ వేపు చూశాడువివరాలు

వినోద్ నవ్వి "థాంక్స్! ఓపికగా అన్ని.

చెప్పారు." అని లక్ష్మివేపు చూసి "చూడండి లక్ష్మిగారు మీకు జరిగిన అన్యాయం చాలా ఘోరమయినది. యీ ఘోరానికి కారకుడైన హంతకుడిని వురికంబం ఎక్కించితే కొంత తృప్తి అయినా మిగులుతుంది. కాబట్టి దయచేసి నా ప్రశ్నలకి సమాధానాలు తెలిపి అందుకు సహకరించండి" అన్నాడు.

లక్ష్మి మౌనంగా తలూపింది.

"రామారావు గారెలాంటి వారు?"

"ఆయన చాలా మంచివారని ఖచ్చితంగా చెప్పగలను. అందుకే అతన్ని ప్రేమించి వివాహం చేసుకున్నాను. నన్ను పిల్లల్ని ప్రాణంగా చూసుకునేవారు!"

"మీకు పెళ్ళయి యెంతకాలమయింది?"

"పదేళ్ళు దాటింది..."

కొద్దిగా ఆశ్చర్యపడ్డాడు రాజు. లక్ష్మి అంత వయసు వున్నదానిలా కనుపించదు.

"అప్పుడు రామారావు గారెక్కడ పనిచేస్తుండే వారు?"

"ఏదో చిన్న వుద్యోగం...గుమస్తాగా."

మరి మీయిద్దరికి పరిచయమెలా అయింది అని అడుగు దామనుకుని మానేశాడు వినోద్.

"తనగురించి ఏం చెప్పాడతను?"

"అంటే..."

"తన కుటుంబం గురించీ..." అన్నాడు వినోద్.

"అప్పటికే ఆయనకెవ్వరూ లేరు. అసలు పదేళ్ల వయసులోనే ఆయన అనాధగా వుండేవారు..."

"ఈమధ్య కాలంలో ఆయనకెవరితో నయినా దెబ్బ లాటలయ్యాయా? ఈమధ్య కాలంలో కాకపోయినా ఆయన జీవితంలో తనకు తెలియకనే యెవరికయినా అప కారం చేయటం జరిగిందా?"

"ఊ...హు...అలాటి ప్రస్తావన మామధ్య ఎన్నడూ రాలేదు. ఒకవేళ అలా అయుంటే ఆయన నాతో చెప్పే వారు. ఆయనకు చిన్న శత్రువుగూడా ఏర్పడడని నా అభిప్రాయం!" అన్నది.

"జాగ్రత్తగా ఆలోచించండి! ఈమధ్య పదిరోజులలో రామారావుగారు ఎలావుండేవారు? అంటే ఆయన ప్రవ ర్తన ఎలా వుండేది? ఏదయినా ఆలోచిస్తూండేవారా?" అడిగేడు.

"అవునండీ! మీరూహించింది నిజమే! సుమారువారం క్రిందట కాబోలు...మా రవి కనుపించలేదు. ఆయనతో చెప్పే వెతకటానికి బయటకు వెళ్లారు. కొంత సమయం గడిచాక రవే ముందువచ్చేడు. ఎక్కడికెళ్లావని అడి గాను. పార్కులో ఒకాయన చాక్లెటిచ్చేడనీ, అవి తిన గానే తనకు నిద్రవచ్చేసిందని, కళ్లువిప్పిచూస్తే ఆయన మాయమైపోయాడని...మంత్రాలు తెల్సునని...అంటూ ఏదో అన్నాడు. మరికొంత సేపటికి ఆయనావచ్చి రవిని నాలాగే అడిగారు...తర్వాతనుంచే ఆయన ఒకోసారి తీవ్రంగా ఆలోచిస్తూండేవారు..." అన్నది లక్ష్మి.

చిక్కు విడిపోయింది అన్నట్టు చూసాడు రాజు, వినోద్ వేపు. కాని అతను తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

"...తర్వాత ఆయనవద్ద డబ్బు ఎక్కువగా వుండడం మీరు గమనించారా?..." అడిగాడు రాజు.

"ఊహు...లేదే...ఎప్పటిలాగే వుండేది. మామూలు

గానే ఖర్చుపెట్టేవారు" అన్న లక్ష్మి సమాధానంతో రాజు నీరుకారిపోయాడు. అంతలోనే ఉత్సాహంగా, "ఎక్కడయినా దాచారేమో?" అన్నాడు.

"ఎందుకు దాయటం?" లక్ష్మి ఆశ్చర్యంగా అంది.

"చెపుతాను...ఒక్కసారి...ఆయన గదిలో వెదికి చూడండి" అన్నాడు వినోద్.

"మీవుద్దేశ్యం నాకర్థం కావడంలేదు, రామారావు..." అనబోయాడు రామానుజరావు. అతని మాటల్లో కొద్దిగా కోపం వుందిగాని కన్పించనీయలేదు.

"అయాం సారీ...ఆయన్ని మేము శంకించటంలేదు. మా అనుమానం నిజమయితే హంతకుడు దగ్గరవుతాడు" అన్నాడు వినోద్.

"మీ ఇష్టం..." అంది లక్ష్మి.

"రాజు...నువ్వు వెళ్ళు" అన్నాడు.

రాజు రెండు నిమిషాల్లో తిరిగివచ్చి పెదిమ విరిచాడు.

ఇన్స్పెక్టర్ వినోద్ నిట్టూర్చి లేచినిలబడి "థాంక్స్ మళ్ళీ కలుస్తాము..." అని నడిచేడు బయటకు.

## 4

ఇద్దరు బయటికివచ్చి జీపు ఎక్కారు.

"రామానుజరావు విషయమేమిటి సార్. రామవరపు రామానుజరావు...'త్రిబుల్ ఆర్'" అన్నాడు రాజు.

వినోద్ నవ్వి, "హంతకుడే త్రిబుల్ ఆర్ వ్రాసివుంటే వాటికి బదులు పేరే వ్రాయవచ్చే? అదీగాక రామానుజరావుకు తిరుగులేని సాక్ష్యంవుంది. హత్య పది...పదకొండు గంటలమధ్య జరిగివుంటుందని గదా డాక్టర్ రిపోర్టు. కాని రామానుజరావు ఆ సమయాల్లో ఆ 'అగ్రి

కల్చరల్ సీడ్స్ అండ్ యింప్లిమెంట్సు సప్లయిస్టోర్సు' మానేజరుతోనే వున్నాడు ... నువ్వు ఆ కంపెనీకెళ్ళి మానేజర్ని కలుసుకు మాట్లాడు'' అన్నాడు వినోద్.

అంతలో జీపు స్టేషన్లోకి తిరిగింది.

ఇద్దరు జీప్ దిగి స్టేషన్లో కెళ్ళారు.

ఓ కానిస్టేబుల్ గబగబా ఎదురొచ్చి ''సార్, కమీషనర్ గారినుంచి ఫోన్ వచ్చింది. మీరు లేరని చెప్పాను. వచ్చిన వెంటనే వున్నపళాన తక్షణం తనవద్దకు రమ్మని చెప్పారు'' అన్నాడు.

వినోద్ తలూపి, రాజుకు చెయ్యవలసిన కొన్ని ముఖ్యమయిన పనులు పురమాయించాడు.

''కమీషనర్ నన్ను పిలిపించేరంటే కారణం ముఖ్యమైనదై వుంటుంది. ఈలోపల నువ్వు తెల్సుకోవల్సిన విషయాలు చాలా వున్నాయి. రామారావు హత్యచేయబడ్డ ఆ వీధి మొదటనున్న కిళ్ళీకొట్టు కెళ్ళి వాకబు చెయ్యి... రామానుజరావు చెప్పిన ఆ కంపెనీకిగూడా వెళ్ళిరా.''

రాజు బయటకు వచ్చి మోటార్ బైక్ ఎక్కాడు.

వినోద్ ఆలోచిస్తున్నాడు!

ఈ హత్యలో ఏదో మర్మంవుంది. రామారావు యింటి నుండి రహస్యంగా బయల్దేరాడు. ఎవరకు కనపడకూడదనుకుని దగ్గరలోవున్న సినిమాహాలుకువెళ్ళి, జనం ఎక్కువగా వుండే లోయర్ క్లాస్ టికెట్టు తీసుకున్నాడు. సినిమా విడిచాక సందుల్లోపడి వెళ్ళాడు. యింతవరకు తనూహించింది నిజమయుంటుంది. కాని ఓ ప్రశ్న! అతను ఎక్కడకెళ్ళాలని రహస్యంగా ఆ సందులో బయలుదేరాడు? ఎందుకని వెళ్ళాడు?

వినోద్ ఆలోచిస్తున్నాడు! అతను చనిపోయిన వీధి

దగ్గరలో నే అతని గమ్యంవుందా? వులిక్కిపడ్డాడు వినోద్.

అవును...దగ్గరిలో వున్నది పోలీస్ స్టేషన్!! కరక్ట్... అవును...అతను అక్కడికే ఎందుకు బయల్దేరి వుండడు?

వినోద్ ఆలోచనలు చకచక కదిలిపోతున్నాయి!!

# 5

'నేషనల్ అగ్రికల్చర్ సీడ్స్ అండ్ యింప్లిమెంట్సు సప్లయ్ కంపెనీ' నుండి బయటకు వచ్చి మోటారు బైక్ ఎక్కాడు సార్జంట్ రాజా.

పది నిమిషాల్లో రామారావు హత్య చేయబడిన వీధిలో కొచ్చాడు.

వీధి మొదట్లోని కిళ్ళీకొట్టు తెరిచే వుంది. ఎవరో యిద్దరు మనుషులు ఏవో కొనుక్కుంటున్నారు.

రాజా వాళ్ళు వెళ్ళేంతవరకు ఆగి కిళ్ళీకొట్టు ముందుకు మోటర్ బైక్‌ని పోనిచ్చి, దిగి స్టాండు వేశాడు.

కొట్టులోవున్న మనిషి రాజా డ్రస్ చూసి, పోలీసు మనిషేనేమో అనుకున్నాడుగాని భయపడలేదు.

రాజా అయిదు రూపాయల కాగితమందించి "గోల్డ్ ఫ్లేక్ సిగరెట్టు పాకెట్టొకటి, అగ్గిపెట్టి యియ్యి!" అన్నాడు.

కొట్టతను వాటితోపాటు మిగతా చిల్లర యిచ్చాడు. రాజా కొట్టుకానుకుని నిలబడి అక్కడే సిగరెట్ పాకెట్ ఓపెన్ చేసి ఓ సిగరెట్టు వెల్గించేడు.

తర్వాత కొట్టతని వేపు చూస్తూ "నీ పేరేమిటోయ్?" అన్నాడు.

"జంబులింగం సార్!" అన్నాడు చేతులు నలుపు కుంటూ.

"ఉదయం ఎన్ని గంటలకి కొట్టు తెరుస్తావ్!" అడి

గాడు రాజు.

"ఆరుగంట్లలోనే తెరుస్తానండి!" అన్నాడు జంబులింగం.

"రాత్రి ఎన్ని గంటలకి మూస్తావు?" రాజు అడిగాడు సిగరెట్టు మెల్లగా పీలుస్తూ.

"ఒకోసారి పదిన్నర...మరోసారి పదకొండు గంటలు గూడా అవుతుంటుంది..." అన్నాడు జంబులింగం వినయంగా!

"అద్సరే...నిన్నరాత్రి ఈ వీధిలో ఓ హత్య జరిగిన విషయం నీకు తెల్సా?" అన్నాడు రాజు.

అప్పుడర్థమయింది జంబులింగానికి రాజు ప్రశ్న లెందుకడుగుతున్నాడో! "లేదండి... తెలీలేదే! ఎవరు చంపబడ్డారు?" అన్నాడాశ్చర్యంగా!

"నీకు అతను తెలిసుండడు. సరే, నిన్నరాత్రి ఎన్ని గంటలకి నువ్వు కొట్టుమూసి వెళ్ళిపోయావు?" అడిగాడు రాజు.

ఓ క్షణం ఆలోచించి "పావుతక్కువ పదకొండుకను కుంటాను." అన్నాడు జంబులింగం.

రాజు వుత్సాహంగా చూశాడు. అతనిలో ఏదో ఆశ చిగురించింది.

"చూడు జంబులింగం! జాగ్రత్తగా ఆలోచించు. నిన్న రాత్రి సుమారు పదిన్నర పదకొండు గంటలమధ్య నీ కొట్టు ముందునించి ఎంతమంది మనుషులు వెళ్లారు..." అడిగాడు.

"పదిన్నర తర్వాత వీధిలో కెవ్వరూ వెళ్ళలేదు...కాని నేను కొట్టు కట్టేసుండగా ఓ మనిషి మారన్న ఈ వీధిలోంచి...నా ఎదుటనుంచే వెళ్ళిపోయాడు గబగబా...

సిగరెట్టు తాగుతూ!''

రాజు గుండె స్పందించింది! మైగాడ్! అతనే అయ్యుంటాడు హంతకుడు!!

రామారావు వెళ్ళిన సినిమా పదిన్నరకు విడిచేరు. పది రెండు లోపల హత్య జరిగింది. ఆ సమయాన ఇటునుంచి ఒక్కడే వచ్చాడని జంబులింగం అంటున్నాడు.

''...గుడ్. అతన్ని నువ్వు క్లియర్‌గా చూసావా? ఎలా వున్నాడతను?'' అడిగాడు.

''అతన్ని నేను పరీక్షగా చూడలేదు. ఓ మారుచూసి తల తిప్పుకున్నాను. అతను నల్లని బట్టలు వేసుకున్నాడు. నల్లని కోటు. హేటు పెట్టుకున్నాడు... చకచకా నడిచి వెళ్ళిపోయాడు.''

''అతను నిన్ను చూసాడా?'' అడిగాడు రాజు.

జంబులింగం ఆలోచించి...''ఏమో నేను కొట్టులోని లైటార్పి సర్దుతుండగా అతను వెళ్ళిపోయాడు. ఓసారి చూసి వూరుకున్నాను. అతను నన్ను చూసాడో, లేదో చెప్పలేను'' అన్నాడు.

''అతన్ని మళ్ళీ చూస్తే గుర్తుపట్టగలవా?''

జంబులింగం పెదిమవిరిచి ''మళ్ళీ ఆ బట్టల్లోనే చూస్తే గుర్తుపడతానేమో!'' అన్నాడు.

''సరే! అతనెటువైపు వెళ్ళాడు?'' రాజు అడిగాడు.

''ఇదుగో ఇలా తిన్నంగా వెళ్ళిపోయాడు. అలా టర్న్ అయితే మైన్ రోడ్డే!'' అన్నాడు.

''థాంక్స్! చాలా ముఖ్యమయిన విషయాలు తెలియజేశావు. నీ కెన్నడయినా అలాటి మనిషి మళ్ళీ తారసపడితే అతన్ని వున్నాడి యిల్లు తెల్సుకో... వెంటనే స్టేషన్‌కి వచ్చి తెలియచెయ్. యికవస్తాను'' అని రాజు

బయలుదేరాడు మోటర్ బైక్ మీద.

రాజా మెయిన్ రోడ్డులోకి రాగానే ఏం చేయటమా అని ఆలోచిస్తూ చుట్టూ చూశాడు. మరుక్షణం అతడి కళ్ళు మెరిసాయి. కారణం కొద్దిదూరంలో టాక్సీస్టాండు వుంది.

రాజా మోటర్ బైక్‌ని అటు పోనిచ్చాడు. టాక్సీ స్టాండు ముందాపి, దిగాడు.

స్టాండులో నాల్గు టాక్సీలున్నాయి!

"ఈ స్టాండులో మొత్తం ఎన్ని టాక్సీలుంటాయి?" అడిగాడు రాజు ఓ టాక్సీడ్రైవర్‌ని.

"మొత్తం పది వుంటుంటాయి, సార్!" చెప్పాడా డ్రైవర్.

"నిన్న రాత్రి పదిన్నర...పదకొండు గంటల మధ్య ఎన్ని టాక్సీ లున్నాయి? వాటిల్లో ఎవరైనా ఎక్కారా?" అని అడిగాడు.

"నిన్న రాత్రిపదిన్నర...పదకొండు గంటల మధ్య మూడే టాక్సీలున్నాయి. నాదీ వుంది! నా టాక్సీలో ఓ మనిషి ఎక్కాడు. ఆ తర్వాత మిగతా రెండు టాక్సీల్లో ఎవరయినా ఎక్కారో, లేదో వాటి డ్రైవర్ల నడిగితే చెప్తారు!" అన్నాడా డ్రైవర్.

"నీ టాక్సీని నిన్న రాత్రి సరిగ్గా ఎన్నిగంటల కెక్కాడా మనిషి? అతనెలా వున్నాడు?" అన్నాడు రాజా.

"లాగ్ బుక్ చూసి చెప్తాను..." అని డ్రయివర్ జేబునుంచి తన లాగ్ బుక్ తీసాడు. అతనికి లాగ్ బుక్‌లో వ్రాసే అలవాటున్నందుకు రాజు సంతోషించాడు.

"సరిగ్గా అయిదునిముషాలతక్కువ పదకొండు కెక్కా

డో కాయన."

"అతనెలా వున్నాడో చెప్పలేదు!" అన్నాడు రాజా.

"నల్లని కోటు...నల్లని ప్యాంటు! ఫెల్టు హేటు!

రాజాగుండె మళ్ళీ స్పందించింది.

"అతనెక్కడ దిగాడు?" ఆత్రంగా అడిగాడు రాజా.

డ్రయివర్ ఆ వ్యక్తి యెక్కడ దిగిందీ చెప్పాడు. రాజా మళ్ళీ అతను కన్పిస్తే వెంటాడి వివరాలు తెలుసుకో మని చెప్పి, బయలుదేరాడు మోటర్ బైక్ మీద.

రెండు నిముషాల్లో బైక్‌ని నాల్గురోడ్ల జంక్షన్ మధ్య నాపాడు. అక్కడే దిగాడు హంతకుడు.

రోడ్లపై జనం రద్దీ విపరీతంగా వుంది. రాజా సందిగ్ధంలో పడ్డాడు. ఇన్ని రోడ్లలో ఏ రోడ్లో వెళ్ళాడు హంతకుడు? అతని గమ్యం యిక్కడేవుందా? ఊహు... అలా అయుండదు. ఇక్కడున్నవన్నీ షాపులు.

రాజా ఆలోచిస్తూండి పోయాడు. ఆ ప్రక్కన మరో టాక్సీస్టాండు వుంది.

రాజా అటు బయలుదేరాడు. తనూహించింది నిజం అయితే హంతకుడు యిక్కడ మరో టాక్సీ ఎక్కివుండ వచ్చు. ఒక వేళ హంతకుడిక్కడ్నుంచి రోడ్డుమీదపోయే టాక్సీ యెక్కినా, లేక నడిచిపోయినా తన పరిశోధన కుంటుపడుతుంది...

రాజా ఆ టాక్సీస్టాండు కెళ్ళి వాకబు చేశాడు.

ఆశ్చర్యం!

హంతకుడు అక్కడ టాక్సీఎక్కి మరోచోటదిగాడు!!

# 6

"కమాన్ మిస్టర్ వినోద్! టేక్ యువర్ సీట్" అన్నారు కమీషనర్ అప్పుడే స్ప్రింగ్ డోర్స్ తోసుకుని,

లోనికొచ్చి సెల్యూట్ చేసిన వినోద్‌ని నవ్వుతూ చూసి.

వినోద్ కుర్చీలో కూర్చుంటూ, పక్క కుర్చీలో కూర్చునున్న వ్యక్తిని పరీక్షగా చూశాడు.

"ఆయన మిస్టర్ జగత్‌సింగ్! అతన్ని ఫ్యాక్టరీకి అధికారిగా నియమించింది ప్రభుత్వం......" అంటూ వినోద్‌ని, జగత్‌సింగ్‌కి పరిచయం చేసాడు కమీషనర్.

"నీకు రామారావు హత్యకేసులో పూర్తివివరాలు తెలుపటానికే జగత్‌సింగ్‌గారు వచ్చేరు" అని జగత్‌సింగ్ వేపు చూసి, "చెప్పండి" అన్నారు కమీషనర్.

జగత్‌సింగ్ ఓమారు గొంతు సవరించుకొని—

"డియర్ ఇన్స్‌పెక్టర్! నేను చెప్పిందాన్ని బట్టియే విషయము మీరే నిర్ణయించండి. కాని కేవలం అనుమానం మీదనే నేను మీకీ విషయాలు చెపుతున్నాను. మా ఫ్యాక్టరీ ఎటువంటిదో మీకు తెల్సు. మారణాయుధాలు కేవలం రక్షణదృష్ట్యా మారణాయుధాలు తయారు చేయబడే ఓ ప్రభుత్వ ఫ్యాక్టరీ అది. అదీ పూర్తిగాకాకుండా కొన్నిరకాల పార్ట్సుమాత్రమే తయారు చేయబడతాయి. సుమారు ఐదునెల్ల క్రితం 'విశ్వేంద్ర ప్రసూన' అనే ప్రఖ్యాత ఇంజనీరును మా ఫ్యాక్టరీకి పంపింది ప్రభుత్వం. ఆయన ఆటమిక్ రీసెర్చి సెంటర్లో ముఖ్యుడుకూడా. ప్రభుత్వాదేశం ప్రకారం ఆయన కొన్ని "డిజయిన్స్" తయారు చేశారు, మా ఫ్యాక్టరీ లాబ్‌లో..." జగత్‌సింగ్ ఆగి పైప్ తీసి వెల్గించుకున్నాడు.

"ఆయన చాలా కష్టపడి కొన్ని డిజయిన్స్ పూర్తి చేశారు. వాటిల్లో రెండు "వార్ టాంక్స్" మాడల్సు అతి విలువయినవి. తిరుగులేని మిషనరీతో నిర్మింపబడే టాంక్సు అవి. వాటిపేరు "ఎక్సుబామ్!" విశ్వేంద్ర

ప్రసూన అతిలాఘవంతో వాటి డిజెయిన్స్ పూర్తిచేసారు అవి అతి దృఢమయినవి. ఈజీగాను వుంటాయి. వాటి మిషనరీ ఖర్చుగూడా తక్కువ.

అయితే ప్రభుత్వం ఈ విషయం రహస్యంగావుంచింది. ఇంచుమించు ఆ విషయం కొద్దిమంది ముఖ్యులకు తప్ప, మరెవరకూ తెలియదు.

అయితే ఓరోజు విశ్వేంద్రప్రసూన నాతో, తన చర్యలనెవరో గమనిస్తున్నట్లు అనుమానంగా వుందని అన్నారు. ఆయన వర్క్ చేస్తున్న రూమ్‌ను యెవరో పరికించేరని తనకనుమానంగా వుందని అన్నారు. నేను ఆశ్చర్యపోయాను. ఈ విషయం రహస్యంగా వుంచబడింది. ఐనా ఆయనకలాంటి అనుమానం రావటంలో అర్థం లేదన్పించింది... కాని'' ఆగాడు జగత్ సింగ్.

''కాని...'' కుతూహలంగా అన్నాడు వినోద్.

''ఆ డిజెయిన్స్ నిన్నటిరోజు వుదయం మాయమయ్యాయి!!

''వ్హాట్...?''

''ఎస్...మిస్టర్ వినోద్. ఇంతలో రామారావుహత్య చేయబడ్డాడని తెల్సింది... నాలో మరుక్షణం అనుమానం బయలుదేరింది. విశ్వేంద్రప్రసూన ఈ హత్యకి, డిజైన్స్ మాయమవటానికి తప్పక సంబంధముందని అంటున్నారు'' అని ముగించేడు జగత్ సింగ్.

''ఆ డిజయిన్స్ ఎలా పోయాయసలు?'' అడిగాడు వినోద్.

''ఆ 'డిజెయిన్స్' ఆఫీస్‌రూంలో నా టేబిల్ లాకర్లో దాచాను. అయితే నిన్నటిరోజు ఆఫీస్‌లోవుండగా నాకు ఫోను వచ్చింది. ఫలానాచోటుకు రమ్మని విశ్వేంద్ర

ప్రసూనగారు చావుబ్రతుకుల్లో వున్నారని ఫోన్ చేశా రెవరో. ఆశ్చర్యపోయి వెంటనే వెళ్లాను. చూస్తే అక్కడ విశ్వేంద్ర ప్రసూనకోసం కాచుకునివున్నారు. నాగురించి ఎవరో ఫోన్ చేస్తే వచ్చారట. ఇద్దరం ఆశ్చర్య పోయి అనుమానంతో తిరిగి వచ్చేము. అయితే కొంప మునిగింది. ఆఫీసుకి రాగానే బీరువాలు, లాకర్సుకి సంబం ధించిన తాళాలు నా టేబిలుమీద వుంచుకోవటం అల వాటు. అదే ముంచింది కొంప'' అన్నాడు జగత్ సింగ్.

వినోద్ తలవూపాడు.

"అర్థమయింది. మీకా అలవాటుందని ఎవరికో బాగా తెల్సుండాలి...బైదిబై ఫాక్టరీలోకి కొత్తవాళ్ళు రావ టానికి అవకాశముందా?''

"మీకు తెల్సుగా, ఈలాంటి ఫాక్టరీలలో సెక్యూ రిటీ ఎంత స్ట్రిక్టుగా వుంటుందో. అయితే లోపలంతగా వుండదు. మా అనుమానం ప్రకారం రామారావుని శత్రు వులు లోబర్చుకుని...తర్వాత హత్యచేసుంటారని...''

"మీకెవరో ఫోన్ చేస్తే అనుమానం రాలేదా?''

"అనుమానంరాని విధంగా ఫోన్‌లో చెప్పారు.''

"మీ రూంకు ఎవరు ఎక్కువగా వస్తుంటారు?'' అడి గాడు వినోద్.

"చాలామందివస్తుంటారు...నా సెక్రటరీ జీవానంద్. యింకా యింజనీర్స్. ఫాక్టరీకి సంబంధించిన క్లర్కు. వస్తూనే వుంటారు.''

"మీ ఫ్యాక్టరీలోని మిగతా ఆఫీసర్లు, క్లర్కుల పేర్లు చెప్తారా?'' అడిగాడు వినోద్.

జగత్ సింగ్ అలాగే చెప్పాడు.

వినోద్ ఆలోచిస్తుండిపోయాడు. 'ట్రిబుల్ ఆర్'

వచ్చిన పేరు ఒక్కటీ లేదు. కొన్ని పేర్లలో రెండు అర్థు, మాత్రమే వచ్చాయి. అతని ఆలోచనలు వేరే దారి మళ్ళాయి. ఆ 'దొంగ' జగత్ సింగే ఎందుకు కాకూడదు? కొన్ని విషయాలు ఆ అనుమానానికి అనుకూలంగా వున్నాయి. జగత్ సింగు నెవరో ఫోన్ చేసి పిల్చేరు. కాని విశ్వేంద్ర ప్రసూన నెందుకు పిలుస్తారు? వారికి అడ్డు జగత్ సింగు!... కాని విశ్వేంద్ర ప్రసూన ఎందుకు? తనకు ఎలిబీ సృష్టించుకున్నాడు జగత్ సింగ్.

వినోద్ మరికొన్ని వివరాలడిగాక, జగత్ సింగు కమిషనర్ తో చెప్పి వెళ్ళిపోయాడు.

అతను ద్వారం దాటుతుండగా ఫోన్ మ్రోగింది.

ఫోనందుకుని ''నీకు'' అని అందించేడు కమీషనర్.

''ఎస్...రాజు. మాటర్ ఏమిటి?'' అన్నాడు వినోద్.

''వాట్ సార్! యింకా మేటరేమిటి? ఏకంగా హంతకుడే దొరికితే!'' అట్నుంచి రాజుకంఠం ఆత్రుతగా పల్కింది.

''వ్వాట్. ఎవరు?'' షాక్ తింటూ అడిగేడు.

''జగత్ సింగు!! అఫ్ కోర్స్, అతను చేయలేదు. చేయించాడు!''

''డిడ్ యు రియల్లీ నో యిట్?'' సంభ్రమాశ్చర్యాల్ని అణుచుకుంటూ అన్నాను.

''ఎస్. పర్ ఫెక్ట్లీ'' రాజుగొంతు స్థిరంగా వుంది.

''క్షణంలో అక్కడుంటాను'' అని రిసీవర్ రెస్ట్ మీదుంచాడు వినోద్.

''ఏమిటి విశేషం?'' కమీషనర్ కుతూహలంగా అడిగాడు.

వినోద్ ఏదో చెప్పబోతుండగా మళ్ళీ ఫోన్ మ్రోగింది.

కమీషనర్ రిసీవరందుకుని "హలో!" అన్నాడు.

"సర్. అయామ్ ది సెక్రటరీ ఆఫ్ జగత్ సింగ్. యిక్కడ ఒక వర్కర్ యిప్పుడే నా వద్దకు వచ్చేడు. నిన్న సాయంత్రం రామారావు ఏదో హోటల్లో వుండగా ఎవరో 'యిద్దరు వ్యక్తులు' అతని గురించి ఏదో మాట్లాడుకుంటుంటే తను విన్నానని అంటున్నాడు. ఈ వర్కర్ని మీ హెడ్ క్వార్టర్స్‌కు పంపుతున్నాను. జగత్ సింగ్ గారక్కడే వున్నారా?" అటునుంచి సెక్రటరీ జీవానంద్ గొంతు విన్పించింది.

"ఆయన యిప్పుడే వెళ్ళిపోయారు. ఆ వర్కర్ని వెంటనే పంపించండి" అని రిసీవర్ పెట్టేశాడు కమీషనర్.

"వినోద్. ఎవరో వర్కరు మనకేదో క్లూ యివ్వబోతున్నాడు. బైదిబై నీ పరిశోధన వివరాలు చెప్పు!" అన్నాడు.

"సర్. రామారావు ఒంటరి. అయ్‌మీన్, అతని తరఫున బంధువులెవరూ లేరు. ఓ రోజు అతని కొడుకు మాయమయ్యేడు. అతను వెతకటానికి వెళ్ళగా, అతని కంటే అతని కొడుకు ముందు యింటికి వచ్చేడు. తర్వాత నుంచే అతను ఏదో ఆలోచిస్తూండేవాడట.

నా అనుమానం ప్రకారం రామారావు నెవరో లోబర్చుకునుంటారు. హత్య జరిగిన నాటి సాయంత్రం రామారావు ఎవరికంటా పడకుండా వుండటానికి ప్రయత్నించేడు. సినిమాకు వెళ్ళాడు. లోయర్ టిక్కట్టులో కూర్చున్నాడు. సినిమా వదిలాక సందుల వెంట పడ్డాడు.

నిజాని కతని యింటి కటుదారే కాదు! కాని అతనలా రావటానికి అంతరార్థ మేమిటి? నేను వూహిస్తున్నదాన్ని

బట్టి అతను పోలీస్ స్టేషన్‌కి ప్రయాణమయ్యాడని!" ఆగాడు వినోద్.

యింతలో టెలిఫోన్ మ్రోగింది. కమీషనర్ రిసీవ్ చేసుకున్నాడు.

రెండు నిమిషాలు మాట్లాడి ఫోన్ పెట్టేశాడు.

"యిటీజ్ ఫెంటాస్టిక్! టూ టౌన్ పోలీస్ యిన్స్పెక్టరు ఫోన్ చేస్తున్నాడు. రోడ్డుమీద పోతున్న ఓ మనిషిని ఓ కారు గుద్దేసిందట. నెంబరెవరూ చూడలేదు. అలా పోతున్న జగత్‌సింగు, హతుడు తన వర్కరని గుర్తించి ఫోన్ చేయిస్తున్నాడుట!!!"

# 7

జీపు స్టేషన్ ముందాగింది!!

ఇన్స్పెక్టర్ వినోద్ కిందకు దిగి చకచక లోనికి నడిచేడు.

"కమాన్ రాజా! నీవు వెళ్ళినదగ్గరనుంచి జరిగింది క్లుప్తంగా చెప్పు! జగత్ సింగునే హంతకుడిగా ఎలా నిర్ణయించావు?" అన్నాడు సిగరెట్ తీసి వెలిగిస్తూ.

రాజా గొంతు సవరించుకుని తాను కిళ్ళీకొట్టు దగ్గర నుంచి జరిపిన పరిశోధనా వివరాలు అన్నీ చెప్పి—

"సార్. చివరి టాక్సీ ఎక్కి హంతకుడు ఎక్కడ దిగాడో తెల్సా? జగత్‌సింగు బంగళాకి దగ్గరలో! జగత్ సింగు బంగళా దగ్గరకు పోవటం టాక్సీవాడు స్పష్టంగా చూసానని అంటున్నాడు. అంతేకాదు, జగత్‌సింగు బంగళా వాచ్‌మన్ అలాంటి మనిషి యింట్లోకి వెళ్లాడని, పది నిముషాలు గడిపి బయటకొచ్చాడని చెప్పాడు.

హంతకుడు ఐమీన్ హత్య చేయించినవాడు జగత్ సింగే!! మనం ఈ సాక్ష్యాలతో డైరక్టుగా అతన్నరస్ట్

చేద్దాం. అసలు విషయం అప్పుడు కనుక్కుంటాడు.'' అన్నాడు వుత్సాహంగా.

''కేవలం ఈ సాక్ష్యాలు చూసి జగత్ సింగుని నువ్వు 'దొంగ'గా నిర్ణయించావన్నమాట!'' అన్నాడు వినోద్ నవ్వుతూ.

విచిత్రంగా చూసాడు రాజు. వినోద్ తనకు తెల్సిన వివరాలు చెప్పాడు.

''అయితే రామారావును జగత్ సింగు ఎందుకు చంపించాడో నువ్వే చెప్పు!'' అన్నాడు వినోద్.

''యస్ సర్. జగత్ సింగు ముందు రామారావును లోబర్చుకుని అతనిద్వారా తన పని పూర్తి చేసుకుందా మనుకున్నాడు. ప్లాన్ ప్రకారం విశ్వేంద్రప్రసూనని ఫోన్‌లో తన మనిషి చేత పిలిపించాడు. తన నెవరో ఫోన్‌లో పిలిచినట్టు నటించి బయటకు వెళ్ళిపోయాడు. విశ్వేంద్రప్రసూన మంచి సాక్ష్యం వుంటాడు. రామారావు ఆ సమయంలో వెళ్ళి ఆ 'డిజయిన్స్' దొంగిలించాడు. తర్వాత యింకేముంది? తనకి రామారావు ప్రమాదం ఎప్పటికయినా వుంటుందని చంపించేడు'' అన్నాడు.

వినోద్ మెల్లగా నవ్వాడు!

''దొరికిన సాక్ష్యాలనుబట్టి నీ వూహాలు సమంజసంగా వున్నాయి. కాని ఓ విషయం నువ్వాలోచించలేదు. హంతకుడు తన వునికి అంత మూర్ఖంగా ఎందుకు బయట పెట్టుకుంటాడు? ప్రతీసారి టాక్సీస్టాండులోని టాక్సీలో ఎందుకు ఎక్కాడు? దాని వలన తన వునికి బయల్పడే అవకాశముందని అతను అనుకోలేదా?'' వినోద్ సిగరెట్ లాస్ట్ పఫ్ లాగుతూ అన్నాడు.

''సార్ అదలావుంచి విశ్వేంద్రప్రసూన ఆ డిజయిన్స్

తిరిగి తయారు చెయ్యలేడా?" అన్నాడు రాజు.

"అఫ్‌కోర్స్. కాని మనవద్ద వున్న అస్త్రం శత్రువుల వద్దగూడా వున్నపుడు దాని విలువేముంది? బైదిబై జగత్ సింగు హంతకుడు కాదేమో?" అన్నాడు.

రాజు తెల్లబోయాడు.

"సరే. నేను కమీషనర్ గారివద్ద కెళ్ళిందగ్గరనుంచి జరిగిందంతా మళ్ళీ చెప్తాను. హంతకుడు దొరుకుతాడేమో ఆలోచించు" అని మళ్ళీ అంతా చెప్పాడు.

రాజు చకచక ఆలోచిస్తున్నాడు. హంతకుడు డెవరు? హంతకు డెవరో దగ్గరిలో వున్నాడు. అత డెవరో వినోద్ కు తెల్సేవుండాలి! లేపోతే యిలా అనడు. ఎవరు?

వున్నట్టుండి చటుక్కున లేచి నిల్చున్నాడు. అతని కళ్ళు వెల్గుతున్నయ్.

"మైగాడ్! తెల్సిపోయింది!!" అన్నాడు.

# 8

ఆ యింటినుండి అతను బయటకొచ్చాడు. చుట్టూ ఓ మారు దీర్ఘంగా పరిశీలించాడు.

తర్వాత చకచక నడవసాగాడు.

కొద్ది దూరం నడిచి ఓ టాక్సీ ఎక్కాడు. టాక్సీ బయలుదేరింది.

టాక్సీ వందగజాలు ముందుకు పోయాక ఓ చీకటి మూలనుంచి ఓ మోటర్ బైక్ బయలుదేరింది వెనుక.

దానిపై యిద్దరు వ్యక్తులున్నారు. నడుపుతున్నవాడు రాజు. వెనుక వినోద్ కూర్చునున్నాడు.

"రాజూ! జాగ్రత్తగా నేనిచ్చిప్పింది గుర్తుంచుకొని చెయ్!" అన్నాడు వినోద్. రాజు తలవూపాడు.

ఆ వ్యక్తి టాక్సీ ఓచోట ఆపి దిగి కాలినడకన బయలు

దేరాడు.

అతను చకచక నడుస్తున్నాడు. వుండి వుండి వెనక్కి చూస్తున్నాడు.

అతనలా చూసినపుడల్లా రాజా, వినోద్ చీకట్లోకి తప్పుకుంటున్నారు.

అతను ఓ చిన్న వీధిలోకి తిరిగాడు. ఆ వీధిలో యిళ్ళు ఒకదానిపై ఒకటి వున్నాయి.

రోడ్డుమీద గోతిలో పడుకున్న ఓ కుక్క వూసుపోనట్లు అపుడపుడు ఆరున్నొక్క రాగంలో ఏడుస్తోంది.

అతనవేం పట్టించుకోనట్లు నడుస్తూ ఓ యింటిముందాగాడు. చుట్టు ఓమారు చూసి, ఫెన్సింగ్ గేటు తెర్చుకుని లోని కెళ్ళిపోయాడు.

"రాజా! చూసావుగా. హారియప్! పోలీసులకి ఫోన్ చేసి ఎంత త్వరలో వస్తావో మరి. జాగర్త. యిక్కడ పరుగెత్తక! కుక్కలు పట్టుకుంటాయి!"

"అలాగే. మీరు జాగ్రత్త" రాజా ముందుకు కదిలి పోయాడు.

వినోద్ గోడవార్న నడుస్తూ, యింటిద్వారం వద్దకు వెళ్ళాడు. మెల్లగా తలుపులులోసి చూసాడు. తెర్చిలేదు. ఓ క్షణం ఆలోచించి చకచక యింటి వెనుకకు నడిచాడు. వాటర్ పైప్ కనుపించింది.

వినోద్ వాటర్ పైప్ పట్టుకు ఎగ్రబాకటం మొదలు పెట్టాడు. రెండు నిమిషాల్లో ఎక్కి బాల్కనీలోకి దిగేడు. అక్కడనుండి కిందకు మెట్లు కనుపించేయి. వినోద్ జేబులోంచి రివాల్వర్ తీశాడు. వెలుగు క్రింద గది తలుపుల సందునుండి గీతలా వస్తూ కన్పించింది.

వినోద్ నవ్వుకుని మరో జేబునుండి మినీసైజ్ టేప్.

రికార్డర్ తీసి తలుపులవద్దకు వెళ్ళాడు. లోనుండి మాటలు మెల్లగా విన్పిస్తున్నాయి.

వినోద్ చెవి ఆన్చి, టేప్ రికార్డర్ ఆన్ చేసాడు.

"గదాధర్! కమాన్...యిందు."

వినోద్ సందులోంచి మెల్లగా చూసాడు. గది మధ్య చిన్న టేబిలు వుంది. దాని వెనుక తాము వెంటాడిన వ్యక్తి కుర్చీలో కూర్చుని కనుపించాడు. అతని ముందు టేబిలు కిటువైపు యిద్దరు మనుష్యులు నిలబడున్నారు. అవతారాలని బట్టి ఆ యిద్దరు కిరాయి గుండాలని గ్రహించాడు వినోద్. వారిలోనే రామారావును చంపిన మనిషి గూడా వుండివుంటాడని గ్రహించాడు.

ఆ వ్యక్తి జేబునుండి ఓ డబ్బుకట్ట తీసిపడేసాడు బల్ల మీద. గదాధర్ అన్న గుండా, ఆ డబ్బు కట్ట అందుకున్నాడు.

"మహమ్మద్ ఇది నీకు" అని మరో డబ్బుకట్ట తీసిచ్చేడు. మహమ్మదు అది అందుకుని జేబులో దాచుకున్నాడు.

"బైదిబై. గదాధర్ ఆ వర్కర్ని కారుతో తుదముట్టిస్తున్నపుడు నిన్నెవరయినా చూసేరా" కుర్చీలోని వ్యక్తి కాళ్ళు విలాసంగా వూపుతూ అన్నాడు.

"నో. కన్నుమూసి తెర్చేలోగా జరిగిందంతా! అయినా ఆ కారు మనిగూడా కాదుగా? పైగా నేను మారు వేషంలో వున్నానాయె!" అన్నాడు గదాధర్.

"వెరీ గుడ్. మన ప్లాన్ ఫలించింది. బ్రహ్మదేముడు గూడా నేనే ఆ డిజయిన్స్ తీసేనని తెల్సుకోలేడు. పైగా ఆధారాలు నేరం మరొకరిమీదకు పోయేటు న్నాయి" అంటూ అతను జేబునుండి ఓ పొడవాటి

ఎరుపురంగు కవరు తీసాడు. అతని ముఖంలో పిచ్చి ఆనందం.

"వరేయ్! యిదిగోరా! ధనలక్ష్మి. దీని విలువ ఎంతో తెల్సా? డబ్బు కట్టలో స్తానం చేయవచ్చు. యివే ఆ 'డిజైయిన్స్'. బైదిబై మీరు సాధ్యమయినంతవరకు వీధుల్లో తిరగొద్దు కొన్నాళ్ళపాటు. మహమ్మదు నువ్వు రామారావును హత్యచేసిన వీధి కసలే వెళ్ళక" అతను ఏదో యింకా అనకముందే,

"మీరు కలుగులో ఎలుకల్లా ఏకన్నాల్లో దాక్కుంటే పోలీసులు పిల్లుల వాసన పసిగట్టారు మిస్టర్ జీవానంద్!" అంటూ రివాల్వర్‌తో తాపీగా తలుపులు తోసుకొని లోనికొచ్చాడు వినోద్.

# 9

ముగ్గురు అదిరిపడి చూసి, దిష్టిబొమ్మల్లా వుండిపోయారు.

"అలా గుంటనక్కల్లా చూడక ముందు చేతులెత్తండి!" వినోద్ కఠినంగా హెచ్చరించాడు.

ముగ్గురు మవునంగా చేతులెత్తారు!

వినోద్ నవ్వి, టేబిలుమీదున్న కవరు తీసుకుని తిరిగి తలుపులవద్దకు వెళ్ళి నిలబడ్డాడు.

"జీవానంద్! నీవు జగత్‌సింగ్ సెక్రటరీ అయివుండి, బాగానే నాటకం ఆడావు! కాని బెడిసికొట్టింది నీ తెలివి!" అన్నాడు వినోద్ పరిహాసంగా.

మహమ్మదు, గదాధర్‌లు గుర్రుగా చూస్తున్నారు. సెక్రటరీ జీవానందం మాత్రం షాక్ నుండి యింకా తేరుకోలేదు. తనెలా బైటపడ్డాడా అన్న ప్రశ్న బుర్రని చెదపురుగులా తొల్చసాగింది.

"నీకు బ్రతుకుమీద ఆశలేదా? నువ్వు మమ్మల్ని పట్టు

కున్నానంటున్నావుగాని, అది వట్టి భ్రమ!'' రౌద్రంగా అన్నాడు గదాధర్!

వినోద్ పరిహాసంగా చూసాడు.

''వరేయ్! గద సత్తలేని నీకు యింత పౌరుషమా!'' అన్నాడు.

అదే సమయంలో ఇన్స్పెక్టర్ మెడమీద మెల్లగా తగిలింది ఏదో.

''ఇన్స్పెక్టర్! కిక్కురుమనకుండా పిస్తోలు క్రింద పడేయి!'' వెనుకనుంచి మాటలు విన్పించాయి.

జీవానంద్ నవ్వుతూ, ''సుభాష్!!'' అన్నాడు. మహ్మద్, గదాధర్ పకపక నవ్వారు.

వినోద్ 'డామిట్' అనుకుంటూ పిస్తోలు పడేసాడు. వెనుకనున్న వ్యక్తి ముందుకు వచ్చాడు.

''ఓహో, నీకు మరో మనిషి వున్నాడా?'' వినోద్ తాపీగా అన్నాడు. తను పట్టుబడిపోయేనని అతనికి బాధగాలేదు. కాని ఐదు నిముషాలు వాళ్ళనాపాలి! ఈ లోపల రాజు వచ్చేస్తాడు...అందుకే అతను తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

''పటవ్...గదాధర్ వాడిజేబులోని కవరు లాక్కో. మనం తొందరగా వుడాయించాలి'' అన్నాడు జీవానంద్.

గదాధర్, వినోద్ ముందుకు వచ్చేడు. ఆ క్షణంలో అతను రివాల్వర్ పట్టుకున్న సుభాష్‌కి అడ్డమయ్యేడు.

వినోద్ అది గమనించి బలంగా రెండు చేతుల్తో పట్టి సుభాష్‌మీదకు విసిరేసాడు గదాధర్‌ని! ఇద్దరు దబ్బున పడ్డారు.

ఉత్సాహంగా విజృంభించేడు వినోద్. మీదకొస్తోన్న మహ్మద్ ముక్కు బద్దలయ్యేట్టు కొట్టాడు. మహ్మద్

కళ్ళముందు పదిలైట్లు కన్పించేయి.

లేవబోతున్న ఆ యిద్దర్నీ ఓ తాపుతన్ని, పిస్తోలు వేపు పరుగెత్తుతున్న జీవానంద్ మక్కాలిరిగేట్టు ఓ తాపు తన్నాడు బూట్ కాలితో. జీవానంద్ అక్కడే కూల బడ్డాడు.

కాని యీ లోపల మహ్మద్ తయారుగాలేచి వినోద్‌ని బలంగా తన్నాడు. అతను నేలపైబడ్డాడు.

గదాధర్, మహ్మద్, సుభాష్‌లు ఒకేసారి వినోద్ మీదకు దూకారు. అతను చటుక్కున పక్కకు తప్పు కోటంతో గోడకు కొట్టుకున్నారు ముగ్గురూ. వారు లేవక ముందే బూట్ కాళ్ళతో వాళ్ళ వీపులు డప్పుల్లా మోగిం చేడు.

"హాండ్సప్" అని వినిపించింది.

జీవానంద్ ఓచేత్తో నడుము, మరోచేత్తో పిస్తోలు పట్టుకున్నించాడు.

అంతలో "ధన్" మన్న శబ్దంతోపాటు, అతని చేతిలో పిస్తోలెగిరిపోవటమేకాక, రాజు పిస్తోలుతో తాపీగా లోపలకు వచ్చాడు.

వినోద్ వెళ్ళి నేలమీద పడిన రెండు పిస్తోళ్ళు యేరి రెండు చేతుల్లో పట్టుకున్నాడు.

"వాట్ సర్...వీళ్ళ అవయవాలు కొంచెం లూజ్ చేసినట్లున్నారు?" రాజు నవ్వుతూ అన్నాడు.

అంతలో బయట వాహనాలాగిన ధ్వని వినవచ్చింది. క్షణంలో ఆ యిల్లు పోలీసులతో నిండిపోయింది.

కమీషనర్, జగత్ సింగుగూడా లోనికి వచ్చేరు.

"మైగాడ్! అన్ బిలీవబుల్...మిస్టర్ జీవానంద్" అన్నాడు జగత్ సింగు.

"అవును. తన పదవినెలా నిర్వహించాలో అతనికి తెలియదు. అందుకే యిలాంటిదారుల్లోకి దిగాడు" అన్నాడు వినోద్ జగత్ సింగుకు కవర్ అందిస్తూ.

"రామారావును చంపించిందితనేనా?"

"అవును, అన్నీ యితనే ప్లాన్ వేశాడు! ముందు రామారావును లోబర్చుకుని అతనిద్వారా సాధిద్దామనుకున్నాడు. నా వ్యూహం ప్రకారం రామారావు వీళ్ళకు లొంగినట్లే నటించి, ఓరోజు రాత్రి రహస్యంగా పోలీస్ స్టేషన్‌కు బయలుదేరాడు. ఐతే మహ్మద్ అతన్ని కనిపెట్టుకువుండి, అతని వ్యూహం గ్రహించి, చంపేసాడు.

మహ్మద్ తెలివయినవాడు. అమోఘమయిన ప్లాన్ వేసాడు. పోలీసులకి తన ఆచూకీ సులువుగా తెల్సేట్లు టాక్సీస్టాండుల్లోని టాక్సీ లెక్కెడుతూ చివరకు జగత్ సింగ్ యింటివద్ద దిగి, ఆయనింట్లోకి వెళ్ళి, ఓ పావుగంట యేవారో నక్కి వచ్చేసాడు. దాంతో నేరం ఆయన మీదకు పోయే అవకాశముంది.

ఆ మర్నాడు జీవానంద్ తెలివిగా 'డి జె యిన్స్' దొంగిలించాడు తనే. అక్కడకూడా జగత్ సింగ్ మీదకు అనుమానాలు పోతాయి. నిజంగా అతడి ప్లాన్ అమోఘమైంది" అన్నాడు వినోద్.

"మరి, ఆ కారు అక్సిడెంట్లో హత్య చెయ్యబడ్డ 'వర్కరు' మాటేవిటి?" అడిగాడు జగత్ సింగు.

వినోద్ నవ్వాడు.

"రామారావు హత్య జరిగిన సాయంత్రం అతను ఏదో హోటల్లో వుండగా అతన్ని కన్పెడ్తూ జీవానంద్ అనుచరులు ఈ ముగ్గురిలో యిద్దరు వుండివుంటారు. రామారావు రహస్యంగా తిరగటంచూసి వీళ్ళుముందే గ్రహించి

వుంటారు. వారిద్దరూ రామారావు గురించి ఏదో మాట్లాడుతుంటే అక్కడేవున్న ఆ 'వర్కరు' విని వుంటాడు. అందుకే రామారావు హత్య చెయ్యబడ్డాడని మర్నాడు తెలియగానే ఆ యిద్దరిగురించి చెప్పుదామను కున్నాడు'' అన్నాడు.

''అఫ్‌కోర్స్, దీనిలో జీవానంద్ ననుమానించడానికి ఏమిలేదే? అతనే అని ఎలా గ్రహించారు?'' అన్నాడు కమీషనర్ ఆశ్చర్యంగా!

''నథింగ్ సర్! అతనే తన్ను పట్టిచ్చుకున్నాడు. ఆ వర్కరు తను చూసింది చెప్పటానికి సెక్రటరీ జీవానంద్ వద్దకు వెళ్లాడు. అప్పుడు జగత్‌సింగుగారు హెడ్ క్వార్టర్సులో మనతో మాట్లాడుతున్నారు. ఆ వర్కరు తన అనుచరులను చూసేడని హంతకుడికి తెల్సే అవకాశం లేదుకదా! జగత్‌సింగు వెళ్ళాక మనకి ఫోన్ వచ్చింది. తర్వాత తన అనుచరుడి కెవడికో ఫోన్ చేసుంటాడు వర్కర్ని చంపేయమని. గదాధర్ అలాగే చేశాడు. వర్కరు ఒక సాక్ష్యమని మన తర్వాత సెక్రటరీకొక్క డికే తెలుసు. అందుకే అతన్నే అనుమానించాను' వినోద్ అన్నాడు.

ఈలోపల సార్జంట్ రాజు, జీవానంద్, సుభాష్, గదాధర్, మహ్మద్‌ల చేతులకు బేడీలు బిగించాడు.

—:ఐపోయింది:—

## సీరియల్

# అంగారక

### శ్యాంబాబు



## (మొదటి భాగము)

మిస్ నదీరా కేబరే ప్రేక్షకుల్ని అల్లకల్లోలం చేస్తోంది. రోజారంగు శరీరంమీద పలచని వస్త్రాలు ఇప్పుడో, మరోక్షణాన్నో క్రిందికి జారిపోతాయేమో అనిపిస్తోంది. హాలులో మూలగావున్న రాక్ సెట్ అల్ట్రామోడరన్ రాక్ మ్యూజిక్‌లో జతపడిన నదీరా అవయవాల సొంపులు జనం నరాల్ని సాగతీస్తున్నాయి.

జయపాండ్యన్ సిగరెట్ వెలిగించి డిప్లమాట్ బాటిల్ని పూర్తిగా గ్లాసులోకి ఒంపుకున్నాడు. గటగట సగం గ్లాసు త్రాగేసి ముందున్న ఖాళీ ప్లేట్ వైపు చూశాడు.

"బేరర్! సమ్ మోర్ చిప్స్!"—అరిచాడు అసహనంగా.

క్షణాల్లో అతనిముందు చిప్స్ ప్రత్యక్షమయ్యాయి. "వన్ మోర్ క్వార్టర్!" అన్నాడు నదీరా శరీరం మీది నుండి కళ్ళు త్రిప్పకుండా.

అర్ధరాత్రి పన్నెండువరకూ నదీరా నృత్యం సాగుతూనేవుంది. జయపాండ్యన్ వరుసగా విస్కీసీసాలు ఖాళీ చేస్తూనేవున్నాడు. కళ్ళలో ఎర్రటి చారలు ఏర్పడుతున్నాయి. బాండుమ్యూజిక్ లీలగా మాత్రమే వినబడుతోంది. నదీరా శరీరం బొంగరంలా తిరుగుతూ శరీరమంతా ఒకే అవయవంలా కనబడుతోంది.

ప్రేక్షకుల్లో అరుపులు, ప్రేమనినాదాలు, ఈలలు ఎక్కువయ్యాయి. నదీరా శరీరంమీది పల్చనివస్త్రం గిర్రున తిరుగుతూ గాలిలోకి లేచింది. అనేకమంది వుత్సాహంగా కుర్చీల్లోంచి లేచిపోయి టేబిల్స్ మీదినుండి ముందుకువంగి ఆత్రుతగా చూడసాగారు.

ఉన్నట్టుండి పెద్దశబ్దంతో రాక్ మ్యూజిక్ ఆగిపోయింది. గిర్రున బొంగరంలా తిరుగుతున్న నదీరా శరీరం బ్రేక్ పడినట్లు ఆగింది. ఆమె వంటిమీద గౌను కుప్పలా నేలమీద పడిపోయింది. చటుక్కున లైట్లు ఆరిపోయాయి. జనంలో హాహాకారాలు చెలరేగాయి.

అరనిముషంలో లైట్లు వెలిగేటప్పటికి మిస్ నదీరా మెఱుపులా మాయమయింది.

"డామిట్!"_అనుకున్నాడు జయపాండ్యన్ కసిగా.

మెల్లిగా కుర్చీలోంచి లేచి నిలబడ్డాడు. ఎంతతాగినా అతని శరీరం సాధారణంగా స్వాధీనం తప్పదు. కానీ ఈరోజు బాగా ఎక్కువగానే త్రాగాడు, మిస్. నదీరా

అల్ట్రా సెక్సీ నాట్యం అతని నరాల్ని స్వాధీనం తప్పిస్తోంది. పర్సుతీసి రెండువందల రూపాయలు నిర్లక్ష్యంగా ప్లేట్ లో పడేసి బయటికి నడిచాడు.

ఇంకా కొందరు తాగుబోతులు నదీరా మళ్ళీ కనిపిస్తుందనే ఆశతో క్రొత్తబాటిల్స్ను ఆర్డరిస్తున్నారు.

"గుడ్ నైట్ సర్!"—అన్నాడు గేటుకీపరు తలుపు తెరిచి పట్టుకొంటూ.

చిన్నగా తలాడించి బయటికి నడిచాడు జయపాండ్యన్. మెదడంతా మొద్దుబారినట్లుగావుంది. కాస్త దాహంగా వుంది. జేబులోనుండి సిగరెట్ తీసి వెలిగించి టాక్సీకి చెయ్యి వూపాడు.

టాక్సీలో ఎక్కి కూర్చుని "సన్ సెట్ ఎవెన్యూ"—అన్నాడు బ్యాక్ రెస్ట్ పై తలానిస్తూ.

మేజర్ జయపాండ్యన్ ఆర్మీనుండి డిశ్చార్జ్ అయి పదిహేను రోజులవుతుంది. ఒక సహచరుడి పొరపాటు వలన మాక్ బాటిల్ ప్రాక్టీసులో లైవ్ గ్రెనేడ్ పేలిఅతని ఎడమకాలి వేళ్ళు నాలుగు తెగిపోయాయి. మూడు నెలలు ఆస్పత్రిలో చికిత్స తరువాత జయపాండ్యన్ను ఆర్మీ నుండి శాశ్వతంగా డిశ్చార్జ్ చేశారు.

జయపాండ్యన్ అందమైన వ్యక్తి అంటే కొందరు ఒప్పుకోకపోవచ్చు. కాని అతను కురూపి అంటేమాత్రం ఎవ్వరు అంగీకరించరు. అయిదడుగుల పదకొండు అంగుళాల ఎత్తు. విశాలమైన ఛాతీ, కండలు తిరిగిన శరీరం. ఆర్మీలో రోజూ కసరత్తు చేయడం వలన ఎప్పుడూ సెంట్ పర్సెంట్ కండిషన్ లో వుండే శరీరం అతనిది.

ముప్పైఆరేళ్ళ వయస్సులో అనుకోకుండా అతని ఆర్మీ కెరీర్ అంతమవకుండావుంటే బహుశా రిటైరయ్యేప్పటికి

యే మేజర్ జనరల్ అయినా అయ్యుండేవాడు జయ పాండ్యన్. శారీరకశక్తి, పదునయిన తెలివితేటలు వున్నా యతనికి.

జయపాండ్యన్ కు పెళ్ళయి రెండేళ్ళయింది. పెళ్ళి అయిన పదిరోజుల్లో అతనికి కేప్టన్ నుండి మేజర్ కు ప్రమోషన్ వచ్చిందన్న వార్త రావడంతో సుమిత్ర అదృష్టానికి అందరూ మురిసిపోయారు. ఐతే పెళ్ళయిన మూడు నెలలకే బోర్డర్ కి తన బెటాలియన్ తరలి వెళ్ళడంతో వెంట భార్యను తీసుకెళ్ళే అవకాశం లేకపోయింది జయ పాండ్యన్ కు.

పెళ్ళయిన తరువాత కలిసివున్నరోజులు అతితక్కువే అయినప్పటికి భార్య సుమిత్ర అంటే ఎంతో ప్రేమ జయ పాండ్యన్ కు. ఐతే ఆర్మీనుండి డిశ్చార్జయి వచ్చిన ఈ పదిహేను రోజుల్లో ఎందుకో సుమిత్ర ప్రవర్తన విచిత్రంగా అనిపించింది జయపాండ్యన్ కు. ఇదివరలో రెండు సార్లు శెలవులో ఇంటికి వచ్చినప్పుడు తనతో ఆప్యాయంగా, ప్రేమగా చూసుకొన్న సుమిత్రలో ఈసారి ఆ ఉత్సాహాంగానీ, అపేక్షగానీ కనిపించలేదు జయ పాండ్యన్ కు.

మొదటి నాలుగురోజుల్లో అంతగా గమనించలేదు గానీ, తర్వాత తర్వాత తన సామీప్యానికి, తనతో సాంగత్యానికి సుమిత్ర చూపుతున్న విముఖత అంతులేని పజిల్లా పట్టుకొంది జయపాండ్యన్ కి.

ఆర్మీనుండి డిశ్చార్జయి వచ్చిన ఈ రెండువారాల్లోనే సుమిత్ర సందర్భరహితంగా యిప్పటికి నాలుగుసార్లు పోట్లాడింది తనతో. ఆక్సిడెంటు వలన స్వల్పంగా మానసికంగా దెబ్బతిన్న జయపాండ్యన్ కు ఇది మరింత క్షోభ

కలుగజేసింది.

దాని ఫలితమే సరదాగావున్న హాబీ ఈ వారంలో క్రమమైన అలవాటుగా తయారయింది బార్కు వెళ్ళే రూపంలా.

* * *

ఐదురూపాయలనోటు టాక్సీడ్రయివర్ చేతిలోపెట్టి, కారు దిగాడు జయపాండ్యన్.

జనవరినెల వచ్చినా కొడైకెనాలులో ఇంకా చలి తగ్గలేదు. శరీరంలో అంత ఆల్కాహాలువున్నా చలి తీవ్రతకు సన్నగా ఒళ్ళు జలదరించింది జయపాండ్యన్కు.

తలెత్తి తను వుంటున్న అపార్ట్మెంట్ కిటికీవైపు చూశాడు. లైటు వెలుగుతుంది. అంటే సుమిత్ర ఇంకా మేలుకునే వుందన్నమాట. వుత్సాహంగా మెట్లవైపు అడుగులు వేశాడు.

సన్ సెట్ ఎవెన్యూలో పెద్ద అపార్ట్మెంట్స్వున్న భవనం అది. క్రింది అంతస్తులో పదివాటాలూ, పై అంతస్తులో పదివాటాలూ వున్నాయి. మేడమీద కుడివైపు మెట్లకు ఎడమవైపు అపార్ట్మెంట్ జయపాండ్యన్ది. సన్నగా ఈల వేసుకుంటూ మెట్లు ఎక్కసాగాడు.

"గుడ్ నైట్ మేజర్!"—అన్నాడు హౌస్కీపర్ తన మెట్ల ప్రక్కగదిలోంచి తొంగిచూసి...

"గుడ్ నైట్ రామన్"—అన్నాడు జయపాండ్యన్ హుషారుగా మెట్లెక్కుతూ.

మెట్లకు ఎడమవైపువున్న తలుపు జయపాండ్యన్ అపార్ట్మెంట్ది. చివరిమెట్టు పైనవుండగా అపార్ట్మెంట్ తలుపు కొద్దిగా తెరుచుకోవడం గమనించాడు జయపాండ్యన్. నాలుగంగుళాలు తెరుచుకుందేమో

సందులోనుండి ఎవరిదో పురుషుడి ఆకారం స్పష్టంగా చూశాడు జయపాండ్యన్. తలుపు మళ్ళీ చటుక్కున మూసుకొంది.

బయటికి రాబోతున్నవ్యక్తి బహుశా జయపాండ్యన్‌ను చూసి తలుపు మూసేసివుండాలి. జయపాండ్యన్ గుండెలు వేగంగా కొట్టుకొన్నాయి. ఎవరది? దొంగా? చటుక్కున రెండంగల్లో తలుపు ముందుకు నడిచాడు.

తను ఇంట్లోలేని సమయం చూసి బహుశా దొంగెవడో ఇంట్లో చొరబడి వుండాలి. సుమిత్రను ఏంచేసాడో ఆ దుర్మార్గుడు. తను పైకి వస్తున్న సమయంలోనే బయటికి రాబోవడం వాడి దురదృష్టం. అపార్ట్‌మెంట్‌లో నుండి బయటికి రావడానికి వున్నది అదొక్కటే ద్వారం. వేరే మార్గం లేదు. లేకపోతే రోడ్డువైపువున్న కిటికీ తెరుచుకొని క్రిందకు దూకాలి.

దబదబ తలుపు తట్టాడు జయపాండ్యన్. లోపలనుండి ఏ చప్పుడూ వినిపించలేదు. పాండ్యన్ మనసులో ఆతృత ఎక్కువయింది.

"సుమిత్రా!"—గట్టిగా కేకపెట్టాడు. జయపాండ్యన్ గొంతు హాలులో ప్రతిధ్వనించింది.

చటుక్కున తలుపులు తెరుచుకొన్నాయి. సుమిత్ర బద్ధకంగా ఆవలిస్తూ కనిపించింది.

"ఎందుకలా తలుపులు బాదుతారు. బెల్ నొక్కితే చాలదూ!" అన్నది సుమిత్ర విసుగ్గా.

జయపాండ్యన్ ఆతృత క్షణంలో అనుమానంగా మారింది.

"నిద్రపోతున్నావా?".—

"లేదు. ఏదో చదువుకొంటున్నాను"—అదే సుమిత్ర

చేసిన మొదటి తప్పు.

తను మెల్లెక్కుతున్నప్పుడు అపార్ట్‌మెంట్ తలుపు కొద్దిగా తెరచుకొని మూసుకోవడం, ఆ తలుపు సందు లోంచి కనిపించిన పురుషుడి ఆకారం మరిచిపోలేదతను. ఎన్ని పెగ్గులు విస్కీ తాగినా పరిసరాల్ని భ్రమించే మొద్దు మెదడు కాదతనిది. అయితే సుమిత్ర????

"ఎవరున్నారులోపల?"—అన్నాడు తలుపు తోసుకొని లోపలకు అడుగుపెడుతూ.

"ఎవరుంటారు?"—అన్నది సుమిత్ర అసహనంగా.

గదిలోకి అడుగుపెట్టి చటుక్కున తలుపు మూశాడు జయపాండ్యన్. ముందరివాల్లో లైట్ దేదీప్యమానంగా వెలుగుతోంది. ఎవ్వరూ దాక్కోడానికి అనువైన ప్రదేశాలు ఏమీ లేవు.

చకచక బెడ్‌రూమ్‌వైపు నడిచాడు. అతని దృష్టి మంచంమీద నేలవరకూ వ్రేలాడుతున్న బెడ్‌షీట్‌పై పడింది. బెడ్డు అంతా నలిగి, దిండ్లు అస్తవ్యస్తంగా పడి వున్నాయి.

జయపాండ్యన్ కళ్ళు ఎర్రబడ్డాయి. అతనిలో క్రోధం బుసలుకొడుతోంది.

మంచంమీద ఓ మూలకివున్న 'అండర్‌వేర్' పై అతని దృష్టి నిలిచిపోయింది. నీలంరంగు అండర్‌వేర్ అది. మగవాళ్ళది. తనెప్పుడూ వైట్ అండర్‌వేర్స్ వాడతాడు. తనదికాదది. మరెవరిది?

చటుక్కున క్రిందికి వంగి, దుప్పటి పైకెత్తి మంచం క్రిందకు చూశాడు.

మంచం క్రిందనుండి భయం భయంగా చూస్తున్న ఆ వ్యక్తిని చూడగానే జయపాండ్యన్‌లోని కోపం పరవళ్లు

త్రొక్కింది. కట్టలు తెంచుకొంది.

"బయటకు రారా పందీ!"–అరిచాడు జయపాండ్యన్.

మంచంక్రింది మనిషి భయంభయంగా ప్రాకొంటూ బయటికి వచ్చాడు. అతని మూతిమీద పదేల్న తన్నాడు జయపాండ్యన్.

"అమ్మో!"—అంటూ అరిచాడు ఆవ్యక్తి.

కాలరు పట్టుకొని వాణ్ని పైకిలేపాడు. ఎర్రటిమనిషి. చెమటలో అతడి ముఖమంతా తడిసి పాలిపోయి వుంది. అందమైన ముఖం. అతడి కళ్ళల్లో వేటగాడి చేతికి చిక్కిన లేడిపిల్లచూపు. ఏదో చెప్పబోతూ నోరు తెరవబోయాడు.

అతని చెంపల్ని డప్పుల్లా వాయించాడు జయపాండ్యన్.

"నోర్మూయ్. రాస్కెల్! నా బెడ్రూమ్లో చేరి ఏంచేస్తున్నావురా" కోపం పట్టలేక అతన్ని ఇష్టం వచ్చినట్లు బాదసాగాడు జయపాండ్యన్.

అతను భయంతో, బాధతో మూల్గుతూ నేలమీద మెలికలు తిరిగిపోతున్నాడు.

"ఆపు ఆపు. నీకు పిచ్చెక్కింది"––జయపాండ్యన్ కు అడ్డంవస్తూ అరిచింది సుమిత్రా.

"యూ డర్టీ బిచ్. నిన్ను నరికిపారేస్తాను"—హుంకరించి సుమిత్ర జుట్టు పట్టుకొని వంచి వీపుమీద ధభీధభీ గుద్దసాగాడు జయపాండ్యన్.

జయపాండ్యన్ సుమిత్రవైపు తిరగ్గానే మంచక్రింది మనిషి తలుపువైపు వుడాయించాడు.

పట్టుకున్న సుమిత్రను వదిలి వాడివెనకపడ్డాడు జయపాండ్యన్. జయపాండ్యన్ ముందు గదిలోకి వెళ్ళేలోపలే

బయట మోటారు సైకిలు స్టార్ట యిన శబ్దం వినిపించింది.

అపార్ట్ మెంట్ తలుపుమూసి బోల్ట్ వేసి పడగ్గదిలోకి వచ్చాడు జయపాండ్యన్. ఇప్పుడతనిలో ఇంతకుముందున్న ఆవేశం కనబడ్డం లేదు. ప్రేలబోయి అగ్నిపర్వతంలా ప్రశాంతంగా వున్నాడతను. అతని కళ్ళల్లోమాత్రం చెప్ప లేని కసి, క్రోధం, అవమానం కనిపిస్తున్నాయి.

సుమిత్ర నేలమీదపడి కీచుగా ఏడుస్తోంది.

"వాడేనా నీ ప్రియుడు. వాణ్ని చూసుకొనేనా నన్ను దగ్గరికి రానివ్వడంలేదు?"—అరిచాడు జయపాండ్యన్.

సుమిత్ర మాట్లాడలేదు. అతని కంఠంలో తీవ్రతకు ఏడుపు ఆపేసింది. ఏ క్షణాన అతని బూటుకాళ్ళు తాండవం చేస్తాయేనని శరీరం బిగుసుకుపోయింది.

"వై డోన్ట్ యు టాక్. యు గుడ్ ఫర్ నథింగ్ బిచ్"

సుమిత్ర మాట్లాడలేదు. భయంగాచూసింది అతని వైపు.

జయపాండ్యన్ శరీరంలో అణువణువూ అవమానంతో మండిపోతోంది. మెదడంతా మొద్దుబారిబోయి ఒకేఒక సంకేతాన్ని అతని అవయవాల కందజేస్తోంది.

"నువ్వుచేసిన మోసానికి నిన్ను చిత్రహింసచేసి చంపే యాలి" మామూలుగా, అతి సాధారణంగా, దాదాపు మృదువుగా పలికింది అతనికంఠం

ఆశ్చర్యంగా చూసింది సుమిత్ర.

జయపాండ్యన్ చేతిలో పాకెట్ నైఫ్ తళుక్కున మెరిసింది.

"నీ శరీరాన్ని ముక్కలు ముక్కలుగా నరికి నిన్ను చంపేవరకూ నాకు తృప్తిలేదు"—అన్నాడు జయ పాండ్యన్ సుమిత్రకు సమీపంగా వస్తూ.

సుమిత్ర అరవాలని నోరు తెరిచింది. జయపాండ్యన్ ముష్టిఘాతం సుమిత్ర మూతి పగలగొట్టింది. గొంతులోని ధ్వని గొంతులోనే ఆగిపోయింది.

బాధతో హృదయవిదారకంగా జంతువులా అరిచింది సుమిత్ర. ముందు పళ్ళూడి రక్తం విశేషంగా కార సాగింది. ముఖం నరాలు బిగుసుకుని వికృతంగా తయారయింది. భయంతో వెర్రిదానిలా చూసింది.

"ఇంతటితో అయిపోలేదు! బ్రతికుండగానే నీ కళ్ళు పొడిచేస్తాను" కత్తి ఝళిపిస్తూ ముందుకు వంగాడు జయపాండ్యన్.

అతనిలో తెలియని రాక్షసత్వం పూర్తిగా విజృంభించింది.

తుపుక్కున వూసింది సుమిత్ర. ఊడిన ముందుపళ్ళు రెండూ అతని ముఖంమీద పడ్డాయి.

జయపాండ్యన్ క్రోధం కట్టలు తెగింది. పాకెట్ నైఫ్ కొన కుడికంటిలో బలంగా దిగబడింది.

కెవ్వున అరిచింది సుమిత్ర...అలా అరుస్తూనేవుంది. కాళ్ళతో చేతుల్తో అతన్ని తన్నుతూ దూరంగా తోసేయడానికి ప్రయత్నం చేస్తోంది.

సుమిత్ర జుట్టుపట్టుకుని ఎడమకంటిని పొడవబోయాడు జయపాండ్యన్. గురితప్పడంతో బుగ్గమీది యెముకలో కరకర శబ్దంచేస్తూ దిగబడింది కత్తి.

చెవులు చిల్లులుపడేలా కేకలు పెడుతోంది సుమిత్ర.

ఎవరో ముందుగది తలుపులు దబదబ బాదుతున్నారు.

రక్తంతో, గాయాలతో వికృతంగా గుర్తు తెలియకుండా తయారయింది సుమిత్ర ముఖం.

"బిచ్...బిచ్...షేమ్ లెస్ బిచ్!" కసిగా, మెథా

డికల్ గా తిడుతూ, పాకెట్ నైఫ్ తో ఆమె వక్షాల్ని చిల్లులు చిల్లులు పొడుస్తున్నాడు జయపాండ్యన్.

గదంతా ఒకటే ధ్వని. సుమిత్ర చేసే మృగంలాంటి అరుపుల ధ్వని...

జయపాండ్యన్ కు ప్రపంచం తెలియడంలేదు. ఏమీ కనబడ్డంలేదు. మంచంమీద అండర్ వేర్, అస్తవ్యస్త మైన తలగడలు, తలుపు సందులోంచి పురుషుడి ఆకారం అతని గుండెలు మండిపోతున్నాయి.

తలుపులు విరగ్గొడుతున్నా రెవరో, పరిగెడుతున్న శబ్దం, అరుపుల శబ్దం, సుమిత్రకు స్పృహ తప్పింది.

మూడంగుళాల పాకెట్ నైఫ్ బ్లేడ్ ను బలంగా సుమిత్ర కంఠంలోకి దించాడు జయపాండ్యన్.

విపరీతమైన వణుకు. శరీరం అవలా వణుకుతోంది.

ముందుగది తలుపు పెళపెళ మంటోంది. ఆలోచించ కుండా కిటికీవైపు గెంతాడు జయపాండ్యన్.

* * *

బ్రిటిష్ ఎయిర్ లేన్ జట్ విమానం మెల్లిమెల్లిగా క్రిందకు దిగుతున్నట్లు తెలుస్తోంది. కిటికీలోనుండి క్రిందకు చూశాడు. రంగురంగుల దీపాలతో వెలిగిపోతోంది హాంగ్ కాంగ్ నగరం.

హాంగ్ కాంగ్ చుట్టూవుండే సముద్రజలాల్లో, నగరం మధ్యనుండి పాయకాలవల్లో అటూయిటూ కదుల్తోన్న రంగురంగుల బల్బుల గుత్తులను ఓడలుగా గుర్తుపట్టాడు ఫ్రెడిక్ ఫెర్రిరా.

తొమ్మిదీ ఇరవైయేడు నిమిషాలకు ఏమాత్రం 'బంప్' లేకుండా మెత్తగా, త్రాచుపాములా రన్ వే మీదకు దిగింది విమానం.

"ఎనిథింగ్ టు డిక్లేర్?" కస్టమ్స్ ఆఫీసరు ప్రశ్నకు అడ్డంగా తలాడించాడు ఫెర్రిరా.

పావుగంటలో కస్టమ్స్ ఫార్మాలిటీస్ ముగించుకొని ఎయిర్ పోర్ట్ బయటకు నడిచాడు.

ఆరడుగుల ఎత్తు, ఎర్రటి ఒంటిరంగు, కింగ్ లూయిస్ పోర్ట్రెట్ లాంటి గడ్డం మీసాలు, చెవిక్రింద కందిగింజంత పుట్టుమచ్చ. క్రీమ్‌కలర్ మేడ్-టు-ఆర్డర్ ప్యాంటు, తెల్లచుక్కలున్న యెర్రటిరంగు టై, షరుపైన సీల్ చర్మంతో కాలర్ కుట్టిన ఖరీదయిన స్పోర్ట్స్ కోటు — పెదిమలు బిగించి చకచక నడుస్తుంటే వయసులోవున్న యే ఆడదయినా ఓసారి వెనక్కి తిరిగి చూడకమానదు.

టాక్సీలోయెక్కి కూర్చుని, "హోటల్ ఇంటర్నేషనల్" అన్నాడు ఫెర్రిరా వెనుకసీటుకు జారగిలబడుతూ.

అతని పాస్‌పోర్ట్‌లో యిచ్చిన వివరాల ప్రకారము, అతను భారతీయుడనీ, వృత్తి దంతవైద్యుడనీ, సరదాగా ఓ వారంరోజులు గడపడానికి హాంగ్ కాంగ్ వస్తున్నాడనీ, అడ్రసు ఢిల్లీ అని తెలుస్తుంది —

కాని; అతని అసలుపేరు ఫెర్రిరాకాదనీ, దంతవైద్యం కాదుగదా, కనీసం మనిషినోట్లో ఎన్ని పళ్ళుంటాయనేదే అతనికి స్పష్టంగా తెలియదనీ, అతను హాంగ్ కాంగ్ రావడానికి కారణం సరదాగా గడపడం కాదనీ ఎవరూ గ్రహించలేదు. అతని విషయం పట్టించుకోవలసిన అవసరం లేదెవరికీ.

* * *

హోటల్ ఇంటర్నేషనల్‌లో సరిగ్గా గంటసేపు గడిపాడు ఫెర్రిరా. ఈ గంటలో అతను తనగదిలో స్నానం చేసి దుస్తులు మార్చుకున్నాడు.

ఊదారంగు బుష్‌షర్ట్, నీలంరంగు పాంటు వేసు కున్నాడు. బూటుతీసేసి సింగపూర్ స్లిప్పర్లు తొడుగు కున్నాడు. పర్సులో నిండుగా హాంగ్‌కాంగ్ కరెన్సీ కుక్కుకున్నాడు.

మరో విషయం. ఇప్పుడతని ముఖం సాదాగా, గడ్డం మీసాలు లేకుండా నున్నగా అప్పుడే షేవ్ చేసుకొన్నట్లు వుంది. స్నానం చేయబోయే ముందతను ఆ పెట్టుడు గడ్డం, మీసాలు తీసేసి ఓచిన్న ప్లాస్టిక్ సంచిలో వేసి బిగించి పక్షటాంకులో పడేశాడు.

తనగదిలో లైటు ఆర్పి తలుపు తెరిచాడు.

నడవాలో ఎవరూ లేకపోవడం గమనించి, తలుపు తాళంవేసి చకచక మెట్లవైపు నడిచాడు. లిఫ్ట్ సర్వీస్ ఉపయోగించ దలచలేదతను. ఎందుకంటే వచ్చేపోయే వాళ్ళను పరీక్షగాచూసే లిఫ్ట్‌బాయ్‌కి తన ముఖంకొత్తగా కనిపించవచ్చు.

మెట్లుదిగి జన సమ్మర్దంగావున్న హాల్లోంచి ఏ ఇబ్బందీ లేకుండా బయట పడటం కష్టం కాలేదతనికి. టాక్సీ ఎక్కకుండా రోడ్డమ్మటే పావుగంటసేపు నడిచాడు. తరువాత ఓ లాగుడురిక్షాలో కూర్చుని హాంగ్‌కాంగ్‌లో నైట్ క్లబ్బులు ఎక్కువగా వుండే ప్రదేశానికి పోని మ్మన్నాడు.

హాంగ్‌కాంగ్‌లాంటి అధునాతనమయిన నగరంలో ఇంకా లాగుడురిక్షాలలాంటి అనాగరిక మైన వాహనాలు వుండడం ఆశ్చర్యమే. అయితే గమ్మత్తేమిటంటే హాంగ్ కాంగ్ రద్దీ వీధులలో టాక్సీ ఎక్కడంకన్న లాగుడు రిక్షాలు ఎక్కడమే సుఖం. ఎందుకంటే అంత రద్దీలో నీటిలో చేపల్లాగా రకరకాల వాహనాల్ని, మనుషుల్ని

తప్పించుకుని వేగంగా పోగలశక్తి, నేర్పు హాంకాంగ్ రిక్షావాళ్ళకే వున్నాయి.

దాదాపు అరగంట తర్వాత ఫెర్రిరా చెప్పిన హోటల్ ముందు రిక్షా ఆగింది. రిక్షావాడి చేతిలో ఓ నోటు పడేసి హోటల్ లోపలికి అడుగుపెట్టాడు ఫెర్రిరా. కౌంటర్ దగ్గర ముసలి చైనీస్ ఒకడు నలిగిపోయిన దినపత్రిక చదువుతూ కూర్చున్నాడు.

"గదికావాలి" అన్నాడు ఫెర్రిరా చేతిలోని ఓవర్ నైట్ బ్రీఫ్ కేస్ కౌంటర్ మీద పెడుతూ.

హోటల్ రిజిస్టర్‌ను ఫెర్రిరావైపు తోశాడు చైనా వాడు. వెనుకవైపు ఏదో అలికిడయినట్లయి తలత్రిప్పి చూశాడు ఫెర్రిరా. ఇద్దరు చైనీస్ అమ్మాయిలు. పెదాలకు ఎర్రటి లిప్ స్టిక్, మినీగౌన్సు వేసుకుని నవ్వుతూ ఫెర్రిరావైపు చూశారు.

హాంకాంగ్ వేశ్యలు!! ఫెర్రిరా మనసులోనే నవ్వుకుని 'విన్సెంట్ లుముంబా' అనే పేరు పెద్ద అక్షరాలతో రిజిస్టర్లో వ్రాశాడు.

"యూ ఆఫ్రికా?" అడిగాడు వృద్ధచైనీస్ ఆశ్చర్యంగా.

"నో, నో, ఇండియన్."

"పాస్‌పోర్ట్ ప్లీజ్ —"

బ్రీఫ్ కేస్‌లోనుండి పాస్‌పోర్ట్ తీసిచ్చాడు ఫెర్రిరా అలియాస్ లుముంబా. ఆ పాస్‌పోర్టులో వ్యక్తి లుముంబాయే. విమానంలో హాంకాంగ్ వచ్చిన ఫెర్రిరాకాదు. వృత్తి చేపల ఎగుమతి. ఆ రోజు సాయంత్రం ఎనిమిది న్నరకు చిటగాంగ్ నుండి వచ్చినట్లు వ్రాసివుంది పాస్‌పోర్ట్ ఎంట్రీచికాలమ్‌లో. తలాడించి పాస్‌పోర్టు తిరిగి ఫెర్రిరాకు యిచ్చేశాడు చైనీస్. పాస్‌పోర్టుతోపాటు ఓ తాళంచెవికూడా అందించాడు.

"ఫస్ట్ ఫ్లోర్‌లో కుడివైపు నాలుగవ గది. రూమ్ వన్ జీరో ఫోర్" అన్నాడతను బిగ్గరగా.

మెట్ల దగ్గరున్న అమ్మాయిలకుకూడా తన రూమ్ నెంబరు వినిపించాలని అతడలా అరిచాడని ఫెర్రిరాకు నవ్వొస్తూ తాళం తీసుకుని మెట్లవైపు నడిచాడు.

"హలో, డూయువాంట్ కంపెనీ?" మెట్లకడ్డంగా నిలబడి అడిగింది ఇద్దర్లో పొట్టిగా, లావుగావున్న చైనీస్ యువతి.

తల అడ్డంగా ఆడించి మృదువుగా ఆమెను ప్రక్కకు నెట్టి పైకి నడిచాడు ఫెర్రిరా.

* * *

విరామం లేకుండా అరుస్తోన్న కుక్కల అరుపులకు మెలకువ వచ్చింది ముత్తురామన్‌కు. టార్చిలైటు, కర్ర చేతిలో పట్టుకుని గుడిసెలోనుండి బయటకు వచ్చాడు.

పదెకరాల భూమిలో వేసిన కూరగాయల తోటది. వంకాయలు, టమోటాలు కాపుకువచ్చి వున్నాయి. ఏ మాత్రం అప్రమత్తంగా వున్నా కోసుకుపోవడానికి చుట్టు ప్రక్కల లేబరుజనం కాచుకొని ఉన్నారని తెలుసు ముత్తుకు. అందుకే పగలంతా తను వెయ్యికళ్ళతో కాపలా కాసి, రాత్రిళ్ళు రెండు జాగిలాలకూ ఆ పని వప్పచెప్పేస్తాడు.

తోటచుట్టూ వదులుగా పేర్చిన కొండరాళ్ళ గోడ నాలుగడుగుల ఎత్తువుంది. గోడవెంట ఆనవాలుగా యూకలిప్టస్ చెట్లు పెంచారు. కుక్కల అరుపులు గేటు వైపునుండి రావడం విని అటు బయలుదేరాడు.

"ఎవరది?"___గట్టిగా అరిచాడు ముత్తు. దొంగల్ని పట్టుకోవడం కాదు అతనిపని, దొంగలు రాకుండా చూడటం. తను మెలకువగానే వున్నట్లు తెలిస్తే ఆ

దొంగ పారిపోతాడని ముత్తు ఆశ.

ముత్తు స్వరంవిని కుక్కలు పరిగెత్తుకు రాలేదు. అక్కడే వుండి ఇంకా పెద్దగా అరవడం మొదలు పెట్టాయి. అంటే తను వస్తున్నానని తెలిసినా ఆ దొంగ పారిపోవడం లేదన్నమాట.

"ఎవరక్కడ? మాట్లాడరేం?" ఇంకా బిగ్గరగా అరిచాడు ముత్తు.

"ముత్తూ! నువ్వేనా?" ఎవరిదో స్వరం. ఎక్కడో విన్నట్లున్న స్వరం. ముత్తు గబగబా గేటువైపు అడుగులు వేశాడు.

గేటుకవతల ఎవరో నిలబడి ఉన్నారు. కుక్కలు రెండూ గేటు కివతల నిలబడి చెవులు చిల్లులు పడేలా అరుస్తున్నాయి. అతని ముఖంమీద పడేలా టార్చిఫోకస్ చేశాడు ముత్తు.

"నేనేరా ముత్తూ!"

జయపాండ్యన్‌ను చప్పున గుర్తుపట్టాడు ముత్తురామన్.

"నువ్వా?" అన్నాడు ఆశ్చర్యంగా ముత్తు. కుక్కల్ని అవతలకు తరిమి గేటు తెరిచాడు.

ముత్తు, జయపాండ్యన్‌లు హైస్కూలులో ఎనిమిదవ తరగతి వరకూ కలిసి చదువుకున్నారు. స్కూల్లో చదువుకునే రోజుల్లో ఇద్దరూ ప్రాణస్నేహితుల్లా తిరిగేవాళ్ళు. ముత్తు ఎనిమిదవ తరగతి వరసగా మూడేళ్ళు తప్పిన తరువాత వాళ్ళనాన్న చదువు మానిపించి కూలిపనికి పంపేశాడు. ఆ తర్వాత యిద్దరూ కలుసుకున్న సందర్భాలు చాలా తక్కువే అయినా ఇద్దరిమధ్య స్నేహం మాత్రం అలానే ఉండిపోయింది.

పాండ్యన్ ముఖం, వంటిమీద బట్టలు చెమటతో

తడిసిపోయి ఉన్నాయి. తల చెదిరిపోయి నుదుటిమీదకు పడుతోంది.

"ఏమిటి ఇంత అర్ధరాత్రి వచ్చావు?" ఆశ్చర్యంగా అడిగాడు ముత్తు తలుపుమూసి గుడిసెవైపు నడుస్తూ.

రెండు ఉక్కళ్లో ఒకటి ఇంకా గుర్రుమంటూ జయ పాండ్యన్ వెనకే వస్తోంది. ముత్తు క్షణం ఆగి దానివీపు నిమిరి మొక్కల మధ్యకు తోలేశాడు.

గుడిసెలోకి వచ్చేవరకూ పాండ్యన్ నోరు తెరవలేదు. "కాస్త మంచినీళ్ళిప్పిస్తావా?" అన్నాడు గుడిసెలో నులకమంచంలో కూలబడుతూ.

మాట్లాడకుండా కుండలో నీళ్లు సత్తుగ్లాసులో ముంచి అందించాడు ముత్తు. గ్లాసు నీళ్లు గటగటా తాగి చిన్నగా నిట్టూర్చాడు పాండ్యన్.

"రెండ్రోజులు యెవరికంటా బడకుండా గుడిశెలో తల దాచుకోవడానికి వీలవుతుందా?" — అడిగాడు పాండ్యన్.

నిశ్శబ్దంగా తలవూపాడు ముత్తు. "ఏం జరిగిందసలు?"

"సుమిత్రను చంపేశాను."

ఆశ్చర్యపోలేదు ముత్తు. ఏదో ఒక కారణంతో భార్య లను భర్తలు చంపి పారేయటం మామూలే ఆ ప్రాంతా లలో. దేశంలో భర్తల్ని భార్యలు, భార్యల్ని భర్తలు చంపుకునే కేసుల్లో డెబ్భయిశాతం ఆ జిల్లాలోనే జరుగు తాయి.

ఎందుకనికూడా అడగలేదు ముత్తు. కారణం చాలా తేలిగ్గా వూహించగలిగేడతను. జయపాండ్యన్ చాలా కాలంగా మిలట్రీలో ఉంటున్నాడు. అతని భార్య ఒక్కతే ఇక్కడ ఉంటోంది. హత్య జరగడానికి ఆ మాత్రం కారణం చాలు. (సశేషం)

## " ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ "

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం ఉండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్లకాగితంపై వ్రాసి, ఈ నెల 10వ తేదీలోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబరు కూడా వ్రాయాలి. సభ్యులు కాని వారు తమ వ్యాఖ్యలతో 30 పైసలు స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 20/-లు నగదు పంపుతాము. ఫలితాలు వచ్చే నెల మాస పత్రికలో చూడండి.

## " హోమ్ డెలివరీ "

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 7/-లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారా గాని మీ ఇంటిదగ్గర అంద జేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీల కోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరుగనవ సరం వుండదు. కాపీలు దొరుకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య ఎంతమాత్రం లేదు.

నెలనెలా వి.పి. తీసుకోవటం వీలుకాని వారు ఏడాది పైకము రు. 80/-లు ముందుగా పంపితే వారికి కాపీలు 'రికార్డెడ్ డెలి-వరీ' లో పంపగలము.

# క్రైమ్‌లో తమాషాలు

(ప్రథమ బహుమతి రు. 15/- లు పొందిన రచన)

## పర్సు పోయింది !

ట్రైన్ కదిలింది.

తలుపు దగ్గిరేవున్న నేను లోపలికి కదలబోతూ ఒక్క-సారిగా వులిక్కిపడ్డాను.

అందుకు కారణం టి.సి. అక్కడికి పరిగెట్టుకుంటూ వచ్చి ఎక్కడమే.

నాకు ముచ్చెమటలు పోసాయి.

గబగబా అడ్డమొచ్చిన వారందరినీ నెట్టుకుంటూ ఏదో అర్జెంటు పని వున్నవాడిలా లోపలకు దూసుకుపోయాను. అదే కంపార్టుమెంటులో రెండవవైపు వున్న తలుపు దగ్గిరకు వెళ్ళేదాకా నాకు గాభరా తగ్గలేదు.

అక్కడికి వెళ్ళాక కొద్ది రిలీఫ్ ఫీలయి బుర్ర ఆలో చించడం మొదలెట్టింది.

నేను వృత్తిరీత్యా దొంగనే అయినా టిక్కెట్టు కొన కుండా ఎప్పుడూ రైలెక్కలేదు. ఇంతవరకూ అలాంటి పని చెయ్యాలన్న ఆలోచనే రాలేదు.

కాని మొన్న మొన్ననే వైజాకులో నా చిన్ననాటి స్నేహితుడు (వృత్తిరీత్యా ప్రాణమిత్రుడు) శేషు నాకు హితబోధచేశాడు.

"నువ్వు వృత్తిరీత్యా ఎన్నో ఊళ్ళు తిరుగుతూవుంటావు. ఇలా ప్రతీసారీ టిక్కెట్టు కొనుక్కుపోతూంటే నీ ఆదా యంలో చాలాపట్టుకు దీనికే సరిపోతుంది. ఇన్ని సాహస

కృత్యాలు చేసేవాడివి, అదికూడా మొదలెట్టు" అని నూరి పోసాడు.

మొదట్లో రుచించకపోయినా వినేకొద్దీ నాకు అది సమంజసమనే అనిపించింది.

అందుకే ఇప్పుడు అనుభవిస్తున్నాను.

ఇంక జీవితంలో ఎవ్వరి వుద్బోధలూ తలకెక్కించుకో కూడదని శపథం చేసుకున్నాను.

"ఇంతకీ ముందు ఇప్పుడు బయట పడటమెలా" బుర్రని దొలిచేస్తున్న ప్రశ్న ఇది.

ఎలాగైనా మధ్యలో రైలాపించి నేను పారిపోవాలి.

ఈ రైలు ఎక్స్‌ప్రెస్ కావడంవల్ల ఇప్పుడప్పుడే ఆగే టట్లు లేదు.

బుర్రకి పదునుపెట్టాను.

చటుక్కున ఆలోచన వచ్చింది.

అదృష్టంకొద్దీ నా జేబులో నేను బట్టలు ఆరేసుకోవ డానికి కొనుక్కున్న సన్నటి ప్లాస్టిక్ తాడుకూడా వుంది.

నా ప్లాను ఫలించడానికి సహాయంగా ఎవరు దొరుకు తారా అని చుట్టూ చూశాను.

హఠాత్తుగా చూపులు కలవడంతో 'అతను' చటు క్కున వెనక్కి తిరిగిపోయాడు.

బ్లాక్ స్ట్రెచ్‌లాన్‌పేంటు, దానిమీద తెల్లని పాలిస్టర్ షర్టు, మనిషి చాలా స్మార్టుగా వున్నాడు. అతను ధరించిన జేమ్స్‌బాండ్ బెల్ట్ అతనికో వింత అందాన్ని చేకూర్చింది. ఇది ఆఖరిసీటు వెనకాతల కావడంతో ఇటువైపు ఎవరూ లేరు, నేను అతను తప్ప.

ఇది చాలా పాత కంపార్ట్‌మెంటేమో, దీనికి ఆఖరి సీటు వెనకాతల కూడా చెయిన్‌వుంది. మెల్లిగా జేబులోంచి

తాడుతీసి దానికి ఒక చివరని లూజుగావుండే ముడివేశాను. అందులోంచి రెండవకొస పోనిచ్చి, ఉరితాడులా చేశాను. అక్కడే వున్న ఎవరిదో ట్రంకుపెట్టెమీద నిలుచుని, దానిని చెయిన్ హాండిలుగుండా పోనిచ్చి, అందులో చెయిన్ ఇరుక్కునేలాచేసి, కర్చీఫ్‌తో నొక్కిపెట్టి, రెండవకొస పట్టుకొని లాగాను. అది బిగుసుకుపోయింది. తృప్తిగా కిందకిదిగి రెండవకొస, ఇందాక నాకు కనిపించిన స్మార్టు మనిషికి వెనకాతల, బెల్టు చుట్టూరా రెండు రౌండ్లు, రెండు బెల్టు రింగుల్లోంచి పోనిచ్చి కట్టేశాను.

కడుతూన్నంతసేపూ కూడా నా గుండెలు 'లడక్' 'లడక్' మంటూనే ఉన్నాయి. నా అదృష్టంకొద్దీ ఆ మనిషి ఇంతవరకూ వెనక్కి తిరగలేదు. 'అమ్మయ్యా' అనుకునే లోగా దూరంగా టి.సి. కనిపించాడు.

కర్చీఫ్‌తో చెయిన్ని పట్టుకుని బలంకొద్దీ లాగాను. ట్రెయిన్ చాలావరకు స్లో అయింది. కాని అదే వూపుకు అతను వొచ్చి నామీద పడ్డాడు.

అది ముందుగానే వూహించిన నేను అతన్ని బలంగా తోసుకుంటూ ముందుకుపోయి, అతన్ని ఇంకా బలంగా తోసేశాను. ఈ వూపుకి ట్రైన్ ఆగిపోయింది.

అతని బుర్ర గట్టిగా దేనికో కొట్టుకోవడంవల్ల దిమ్మెక్కినట్టయి, నాకేసి ఒకసారి చూసి, నా చేతుల్లోనే స్పృహ తప్పి పడిపోయాడు.

రైల్లో నిద్రపోతున్న ఆసాములందరూ తల్లక్రిందులయ్యారు. కొందరు వాళ్ళే పరిస్థితుల్లో వున్నారో వాళ్ళకే అర్థం కాకుండా వున్నారు. ఇంత మందిలో టి. సి. ఎక్కడున్నాడో దేముడికే తెలియాలి. నేను ఓపిక తెచ్చుకొని లేచి నిలబడి, ఒక వైపు తలుపుగుండా దిగబోయి, అటు

వైపు గార్డువాళ్లు పరిగెత్తుకు వస్తూండటం చూసి, చటుక్కున రెండో వైపు దూకి పిక్కబలం చూపించాను.

అది కొద్ది వెనకబడ్డ ప్రాంతంలా వుంది! చెట్లు పుట్టలతో నిండివున్న ఆ ప్రదేశం నేను పారిపోవడాని కెంతో సహకారం అందించింది.

దూరంగా మెయిన్‌రోడ్డు కనిపించడంతో, నా వుత్సాహాసు ఇనుమడించింది.

పది నిమిషాలు రెస్టు తీసుకున్నానో లేదో ఆర్టీసీ బస్సు వస్తూ కనిపించింది.

చప్పట్లుకొట్టి అరిచి ఆపు చేశాను.

అది కాకినాడ వెళ్ళే బస్సు. లోపలికి ఎక్కి దర్జాగా కూర్చున్నాను.

కండక్టర్ వచ్చి "ఎక్కడిదాకా సార్?" అన్నాడు.

సమాధానంగా 'కాకినాడకి' అని చెప్పి జేబులో చెయ్యి పెట్టిన నేను షాక్ తిన్నాను. జేబు ఖాళీ! 'మైగాడ్! ఇప్పుడెలా! నా పర్సులో 50 రూ.లు దాకా వుండాలి.' కంగారుగా ఆ జేబు, ఈ జేబు వెతికాను. శూన్యం. నాకేం సీక్రెట్ పోకెట్స్ కూడా లేవు.

నా కంగారు చూసి "ఏమైంది సార్?" అన్నాడు కండక్టరు.

"పర్సు పోయింది" అన్నాను కొద్దిగా దీనంగా మొహం పెట్టి.

"క్షమించండి సార్! మీరిక్కడే దిగిపోవాల్సి ఉంటుంది" అన్నాడు కండక్టర్ బస్సు ఆపబోతూ!

నా గుండె గుభేలుమంది. 'ఇక్కడి నుంచి జేబులో పైసా కూడా లేకుండా కాకినాడదాకా పోయేదెలా?' కండ

క్టర్నే బ్రతిమాలాను. వెళ్ళగానే మర్నాడే నిజాయితీగా తెచ్చి ఇచ్చేస్తానని చెప్పాను.

"లాభం లేదుసార్! మధ్యలో ఎక్కడయినా చెకింగ్ అయ్యిందంటే మీరు నేను కూడా నామరూపాల్లేకుండా పోతాం" అని రాడ్ మీద టకటకలాడించబోయాడు.

"అతని డబ్బులు నేనిస్తాలెండి" అన్నారెవరో వెనక సీట్లోంచి.

'ఇంత ఆపద్బాంధవు డెవరా' అని వెనక్కి చూసిన నాకు రహీం దేముడిలాగా కనిపించాడు!

సంతోషంతో వాడి చెయ్యి పట్టుకొని వూపేశాను. వాడు నవ్వి, డబ్బులు చెల్లించి టిక్కెట్లు తీసుకొని, నా ప్రక్కకి వచ్చి కూర్చున్నాడు.

కూర్చున్నాక నా చెవి దగ్గర నోరుపెట్టి "ఏం భయ్యా! నువ్వు దొంగతనాల్లో ఆరితేరినవాడివని బాస్ నమ్మకం, నా నమ్మకం కూడా. అలాంటిది నీ దగ్గర ఎవడో కొట్టెయ్యడ మేమిటి? చాలా షేమ్. వాడెవడో 'దొంగలకు దొంగ' అయ్యుంటాడు" అన్నాడు వెక్కిరిస్తూ.

నేను నవ్వుతూనే "గట్టిగా అనకు. ఈ బస్సు ఇలాగే తిన్నగా పోలీస్ స్టేషను కెళ్ళగలదు జాగ్రత్త" అన్నాను.

కాకినాడ చేరుకోగానే, నా రూమ్‌కు వెళ్ళి హాయిగా నిద్రపోయాను.

తిరిగి పక్షుల కిలకిలారావాలకు మెలుకువ వచ్చింది. ఎవరో తలుపు కొడుతున్న శబ్దం వినిపించింది.

ఆశ్చర్య మేసింది. నన్ను లేపడానికి నా రూముకి వచ్చే దెవరు? శబ్దం ఎక్కువ కావడంతో లేచి, శరీరం ఈడ్చుకుంటూ వెళ్ళి తలుపు తీశాను.

నిర్ఘాంతపోయాను. పోలీసులు!

"యు ఆర్ అండర్ అరెస్ట్" ఇన్‌స్పెక్టర్ కంఠం పిడుగులా విన్పించింది.

గుండె గాభరా అణుచుకుంటూ "కారణం" అన్నాను.

"అతి తెలివితో రైలు చెయిన్‌లాగి రైలాపినందుకు" తాపీగా అన్నాడు.

"లేదు. నాకేం తెలీదు" గట్టిగా అరిచాను. మొహం నిండా చెమట్లు పట్టేశాయి.

"చూడు మిస్టర్. నువ్వింక దబాయించి లాభం లేదు. సాక్ష్యాధారాలన్నీ దొరికాయి. ఎలాగో తెలుసా? నువ్వు ఏ మనిషికైతే తాడు కట్టావో, అతనొక ఆరితేరిన దొంగ. అతను ఆఖరి నిమిషంలో అతి లాఘవంగా నీ పర్సు కొట్టేశాడు. రైలాగాక అతన్ని 'నీ కెవరిమీదనయినా అనుమానం వుందా?' అని అడిగితే మొదటగా నీ గురించే చెప్పాడు. నువ్వు అప్పటికే పరారి ఆయినట్లు రూఢి అయ్యింది. అప్పుడు అతనిచ్చిన పర్స్ తెరిస్తే అందులో అందంగా ప్రింటు చేయబడిన నీ ఎడ్రస్ కనబడింది...." ఇన్‌స్పెక్టర్ చెప్పుకుపోతున్నాడు.

నా బుర్ర పనిచేయటం ఎప్పుడో మానేసింది.

—ఇ. బి. ఎస్. పార్థసారథి, విశాఖపట్టణం.

(ద్వితీయ బహుమతి రు. 10/-లు పొందిన రచన)

## "రండి! ముండ!!"

మా ఫ్రెండ్ పెళ్ళిలో నాకు గెస్టులను రిసీవ్ చేసుకొనే డ్యూటీ ఇచ్చారు. అక్కడంతా ఒరియావాళ్ళు. అందుకని ఏదో కొంచెం ఇంగ్లీషులోనే ఇన్‌వైట్ చేస్తూ, సీట్లు చూపిస్తున్నాను.

ఇంతలో ఒక ఒరియా ఆవిడ ముసుగు వేసుకొని

వచ్చింది. నా డ్యూటీ ప్రకారం ఇన్‌వైట్ చెయ్యబోయి "రండిరండి" అన్నా!

అంతే! ఆవిడ ముఖం సీరియస్‌గా పెట్టేసి ఏదో అంది.

నాకు బోధపడలేదు. ఆవిడకి మౌనంగా సీటు చూపించి, తర్వాత తెలుగు ఒరియా వచ్చిన ఒక అమ్మాయిని అడిగాను.

ఆ అమ్మాయి గట్టిగా నవ్వి "చంపేశారు! 'రండి' అంటే ఒరియాలో 'ముండ' అని అర్థం!" అని చెప్పింది.

అప్పుడు నా అదృష్టాన్ని నేను మెచ్చుకోకుండా వుండలేకపోయాను.

ఎందుకంటే, ఆ ఒరియా ఆమె కొంచెం మంచిదై వుంటుంది. ఏవో తిట్లతో సరిపెట్టింది. మరొకరైతే నా ఎముకలైనా మిగిలివుండేవి కావేమో?

—ఎమ్. కామేశ్వరి, బరంపురం.

## పందెం?

పిల్లికి బిచ్చం పెట్టని ఒక జమిందారు వద్దనుండి ఎలాగైనా యాచించి తీసుకువస్తానని, స్నేహితులతో 100 రు. పందెము కాసి, జమిందారు వద్దకు వెళ్ళాడు సుబ్బారావు.

సుబ్బారావుని చూచి, అతడు వచ్చిన పనిని తెలుసుకొని, జమిందారు తన ఇనప్పెట్టెలో వున్న డబ్బు, బంగారు నగలు, వెండిసామాను చూపించాడు. "ఇదంతా నేను కష్టపడి సంపాదించింది కాని, యాచించి, పందాలు కాసి కాదు" అన్నాడు జమీందారు.

అంతే! సుబ్బారావు తల అవమానంతో క్రుంగిపోయింది.

—కె. వెంకటేష్ గౌడ్, రాజమండ్రి.

# వేశ్యాగృహం?

మెట్రిక్యులేషను పాసయి పోకిరిగా తిరుగుతున్న ప్రకాష్‌ను వాళ్ళ మేనమామ రామయ్యా తన యింటికి తీసుకువచ్చి, ఒక రేడియో మెకానిక్ దగ్గర పని నేర్చుకో మని కుదిర్చాడు.

ప్రకాష్ రోజూ పనిలోకి వెళ్ళివస్తున్నాడు. బుద్ధిగా వున్నాడు ఫరవాలేదు అనుకొన్నాడు రామయ్య. ఈలోగానే అతనికి ఒక క్రొత్త విషయం తెలిసింది, ప్రకాష్ వేశ్యా గృహాలు పావనం చేస్తున్నాడని.

చెప్పుడు మాటలు విని ఏదో ఒకటి నిర్ణయం చేసు కోవడం ఇష్టంలేని రామయ్య ఒక సాయంత్రం ప్రకాష్‌ను ఫాలో అయ్యాడు.

ప్రకాష్ తిన్నగా వేశ్యవాడలోకి వెళ్ళి ఒక ఇంటిలో దూరి, ఇరవై నిముషాల తరువాత తిరిగి వచ్చాడు.

అంతవరకు కోపంతో తచ్చాడుతున్న రామయ్య ప్రకాష్ జుట్టు పట్టుకుని నాలుగు దెబ్బలు ఎడాపెడా కొట్టి, "బాగు పడతావని ఇక్కడకు తీసుకువస్తే, ఇటువంటి చెడు తిరు గుళ్ళు తిరుగుతావా వెధవా?" అని ఇంటికి లాక్కు వెళ్ళాడు.

ప్రకాష్ ఏడుపు ఆపుకొంటూ "ఆ ఇంటిలో రేడియో గ్రాం చెడిపోతే, బాగుచేసి రమ్మని నన్ను పంపాడు మెకా నిక్" అన్నాడు యింకా వెక్కుతూ.

—ఎస్. రామారావు, రాయగడ.

